డా॥ వేంపల్లి గంగాధర్ : 'రాష్ట్రపతి భవన్'లో విశిష్ట ఆతిథ్యం అందుకున్న తొలి భారతీయ సాహితీవేత్తగా వీరు గుర్తింపు పొందారు. 2014, సెప్టెంబర్ 8వ తేదీ నుంచి 26 వరకు వీరు రాష్ట్రపతి భవన్‌లో విడిది చేశారు. రాయలసీమ ప్రాంతానికి సంబంధించిన పలు అంశాలపై పుస్తకాలు రాశారు. వీరి కథా సంకలనం 'మొలకల పున్నమి'కి కేంద్ర సాహిత్య అకాడమి మొదటి యువపురస్కారం - 2011 లభించింది. ప్రసిద్ధ సాహితీవేత్త సునీల్ గంగోపాధ్యాయ చేతుల మీదుగా తామ్రపత్రం అందుకున్నారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి 'రాయలసీమ కథా సాహిత్యం' పై పిహెచ్‌డి, 'రాయలసీమ ఫ్యాక్షనిజం' పై ఎంఫిల్ పూర్తి చేశారు. కేంద్ర ప్రభుత్వం వారి 'రైటర్స్ ట్రావెల్ గ్రాంట్' ద్వారా 'శాంతినికేతన్'లో పర్యటించారు. మొలకల పున్నమి, దేవరశిల, గ్రీష్మభూమి, తొలితెలుగు శాసనం, పూణే ప్రయాణం, కథనం, హిరణ్యరాజ్యం, నేలదిగినవాన, నేను చూసిన శాంతినికేతన్, పాపాఘ్ని కథలు, రావణవాహణం కథలు, కడప వైభవం (సంపాదకత్వం), అనంతపురం చరిత్ర (సంపాదకత్వం), ఎర్రచందనం దారిలో తమిళ కూలీలు, యురేనియంపల్లె నవల పుస్తకాలు రాశారు. సీమ గిరిజన తండాల నుంచి పడుపు వృత్తిలోకి తరలిపోతున్న మహిళల జీవన ఆక్రందనను 'పూణే ప్రయాణం' రచనలో చిత్రణ చేశారు. ఇదే ఇతివృత్తంతో రాసిన 'మైనం బొమ్మలు' కథకు అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) పురస్కారం దక్కింది. న్యూఢిల్లీ కథా ఫౌండేషన్‌వారి నుంచి 'శిలబండి' కథకు జాతీయ కథాపురస్కారం, 'నేలదిగిన వాన' నవలకు అంపశయ్య నవీన్ సాహితీ పురస్కారం, 'దేవరశిల'కు రావూరి భరద్వాజ స్మారక




Dr.Vempalli Gangadhar of Kadapa receiving sahitya Akademi Yuva Puraskar from Akademi president Sunil Gangopadhyay . (25th August 2012, Bhubaneswar (Odisha).

# First Writer in Residence at Rasthapathi Bhavan









WRITERS IN-RESIDENCE PROGRAMME

**CERTIFICATE**

*This is to certify that*

**DR. VEMPALLI GANGADHAR**

*has participated in the*

*Writers In-Residence Programme*

*at Rashtrapati Bhavan, New Delhi*

*from 08th to 26th September, 2014.*

*Secretary to the President*

# Sahitya Akademi First Yuva Puraskar Winner in Telugu



Dr.Vempalli Gangadhar of Kadapa receiving sahitya Akademi Yuva Puraskar from Akademi president Sunil Gangopadhyay . (25th August 2012, Bhubaneswar (Odisha).

# కథనం

## పత్రికా వ్యాసాలు

## వేంపల్లి గంగాధర్

ఉషస్సు ప్రచురణలు

**KATHANAM**
collection of articles by
**Vempalli Gangadhar**

First Edition: November,2002

Cover Design
**Ramana GV**

Published by
**Ushassu Prachuranalu**

For Copies
**Vempalli Gangadhar**
D.No:4 - 432/A, Vivekananda Nagar,
Cuddapah- 516001.✆ 08562–79313

**Visalandhra Book House**
Bank Street, Hyd. and its branches in AP

**Disa Pustaka Kendram**
Chikkadapally, Hyderabad- 20

**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir, Kachiguda, Hyderabad

**Prajashakti Book House**
Chikkadapally, Hyd. and its branches in AP

Rs. 50/-

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
ఆర్థిక సహాయంతో ప్రచురితం.

స్వాతి సంపాదకులు
శ్రీ వేమూరి బలరామ్‌గారికి
ఆత్మీయంగా...

కృతజ్ఞతలు
డాక్టర్ సి.నారాయణరెడ్డి
ఐ.వెంకట్రావు
ఆర్.ఎం.ఉమామహేశ్వరరావు
ఎం.వి.ఆర్. శాస్త్రి
టి.వి. రమణమూర్తి
పి.డి.పి.వర్మ
గొట్టిపాటి సుజాత
రమణ జీవి గార్లకు...

## కథన క్రమం

# మహిళ



## అరుంధతీరాయ్ అంతరంగం

### ఆమె మాటల్లోనే ఆమె జీవిత పోరాటం

సంచలనానికి మరో పేరు అరుంధతీరాయ్. ఆమె మాటల్లో ఆవేశం వుంది. ఆవేదన వుంది. అందుకే 39 సంవత్సరాల వయస్సులోనే భారతీయ సాహిత్య రంగంలో ప్రముఖ స్థానానికి చేరుకోగలిగింది. ఒకే రచనతో ప్రభంజనాన్ని సృష్టించింది.

'గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్'తో అత్యంత విలువైన సాహితీరంగంలో ప్రశస్తమైన బుకర్ ప్రైజ్ విజేత అయ్యిందామె. అంతర్జాతీయ స్థాయిలో అనూహ్యమైన గుర్తింపును పొందింది. ఆమె ఈ స్థాయిని చేరుకోవడం వెనుక అంతులేని నిరంతర శ్రమ వుంది. మోయలేనంత భారమైన కష్టం వుంది. మధ్యతరగతి కంటే దిగువస్థాయి నుంచి ఆమె జీవితం ప్రారంభమయ్యింది.

అందుకే పేద ప్రజల గురించి, వారు పడుతున్న కష్టాల గురించి ఆమె రచనలు సుదీర్ఘంగా విశ్లేషిస్తాయి. అలాంటి పేద ప్రజలే సర్దార్ సరోవర్ ప్రాజెక్టు ముంపుకింద తమ భూముల్ని, నివాసాల్ని పోగొట్టుకున్నారని తెలిసి విలవిలలాడింది.

ర్యాలీ ఫర్ వ్యాలీ

ఆనకట్టల పేరుతో వారి బతుకుల్ని ఎలా నాశనం చేస్తున్నారో, ఏ రకమైన సాయం లేకుండా దుర్భర జీవితాన్ని గడుపుతున్న ఆదివాసీల కోసం ఆమె తన బుకర్‌ప్రైజ్ ద్వారా వచ్చిన కోట్ల రూపాయల మొత్తాన్ని నిర్వాసితులకు, నర్మదా బచావో ఉద్యమానికి విరాళంగా ఇచ్చింది. ఆందోళనకు తన మద్దతు ప్రకటించింది.

గత సంవత్సరం 'ర్యాలీ ఫర్ వ్యాలీ' పేరుతో మధ్యప్రదేశ్‌లోని కత్రాణ గ్రామం నుంచి నర్మదా సత్యాగ్రహం వరకు యాత్ర జరిపిందామె. ఆమెకు పర్యావరణం అంటే ప్రాణం. ప్రకృతి అంటే ప్రేమ. పోఖ్రాన్-2 పరీక్షలు ఆమెను కలవరపెట్టాయి. న్యూక్లియర్ ప్రభావం గురించి 'ఎండ్ ఆఫ్ ఇమాజినేషన్' అనే పుస్తకం రాసింది. ఆకలి కేకల ప్రపంచాన్ని వదలి అణ్వాస్త్రాల కోసం ప్రాకులాడ్డాన్ని ఆమె విమర్శించింది.

అన్నీ నిజాలే

అమె దృష్టంతా ఇప్పుడు నర్మదా ఆందోళనపైనే వుంది. ఆనకట్టలకు, అభివృద్ధికి అసలు ఏ మాత్రం సంబంధం లేదంటుంది.

ఇదంతా పెద్దపెద్ద రాజకీయ నాయకులు, కాంట్రాక్టర్ల జేబులు నింపుకోవడానికి పనికొస్తుందే తప్ప పేద ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడకపోగా, పర్యావరణానికి తీవ్ర విఘాతం కల్గిస్తున్నట్లు ఆమె ఆవేశంగా ఎగసిపడుతుంది.

కుటుంబ హింస కారణంగా స్త్రీలు పడే బాధల్ని కూడా ఆమె ఒక్కటొక్కటిగా మనముందు పెడుతుంది. సోదరుడైనా, భర్త అయినా, తండ్రి అయినా, కొడుకైనా మహిళలను హింసించే విషయంలో ఒక్కటేనంటుంది. ఈ విధమైన కుటుంబ హింస నుంచి బయటపడాలంటే మహిళలంతా ఎవరి కాళ్లపై వారు నిలబడి మగవాడ్ని తమ జీవితంలోంచి బహిష్కరించాలని చెబుతుంది. తన జీవితాన్నే అందుకు ఉదాహరణగా చూపిస్తుందామె.

తన జీవితంలో ఇంత వరకు ఒక్క మగాడికి కూడా చోటు లేదని, చివరికి తన తండ్రిని కూడా బహిష్కరించినట్లు, తనకెప్పుడూ మగాడి అవసరం కలగలేదని, మగవాళ్లకు ఆడవాళ్ల అవసరం తప్పనిసరి అవుతుందేమోగానీ, ఆడవాళ్లకు ఏ మగాడి తోడూ అవసరం లేదని ఉద్బోధిస్తుంది.

ఆమె మాటలు మొదట ఆశ్చర్యాన్ని కల్గించవచ్చు గానీ లోతుగా వెళ్లి ఆలోచిస్తే వాస్తవమేననిపిస్తుంది. స్త్రీలకు పెళ్లే సర్వస్వం కారాదు.

ఆ విధంగా ఆడవాళ్లంతా మగవాళ్లపై ఆధారపడుతున్నందువల్లే పురుషాధిక్యత పెరిగిపోతోందని, ఇదే కుటుంబ హింసకు పునాది అవుతోందని ఆమె అభిప్రాయపడుతుంది.



'సభలకు సమావేశాలకు నేను ఎప్పుడు వెళ్లను' అని ఖచ్చితంగా తేల్చి చెప్పే అరుంధతీరాయ్ ఊహించని రీతిలో అంతర్జాతీయ మహిళాదినోత్సవాన్ని పురస్కరించుకొని అనంతపురంలో మహిళా వేదిక ఆధ్వర్యంలో మార్చి 1వ తేదీన జరిగిన భారీ ర్యాలీలో పాల్గొనడంతోపాటు, వివిధ మహిళాసంఘాలు ఏకమై నిర్వహించిన బహిరంగ సభకు కేరళ సంప్రదాయక వ్యవహార శైలిలో ముఖ్య అతిథిగా విచ్చేసి ప్రసంగించింది.

ఆ తర్వాత రోజు 'నర్మదా మెసేజ్ టు రాయలసీమ' కోణంలో సాగిన చర్చా వేదికలో పాల్గొంది. పలు వివాదాస్పద అంశాలపై తన అభిప్రాయాల్ని సూటిగా వెల్లడించారామె. సుదీర్ఘంగా తన జీవిత పోరాటాన్ని ఆవిష్కరించింది. ఆమె మాటల్లోనే ఆమె పోరాట జీవితం ఇలా ఉంది.

అమ్మే నా గురువు

"జీవితం ఒక పెద్ద అగ్నిపరీక్ష. నేనెన్నో కష్టాలు పడ్డాను. తాగుబోతు తండ్రి నుంచి నేనూ, మా కుటుంబం ఎంతో హింసను అనుభవించాము. ఒక వైపు పేదరికం, మరో వైపు వేధింపుల మధ్య నా తల్లి ఎలా సంఘర్షణకు లోనైందో నేనిప్పటికీ మరచిపోలేను. ఆమె మాకోసం ఎంతో కష్టపడింది. ప్రతిరోజూ ఈ విధంగా ఆమె ఎంతకాలమని వేధింపులకు గురికాగలదు?

అందుకే ఓ రోజు అలాంటి భర్త నీడలో వుండడం కంటే ఎటైనా వెళ్లి బతకటమే ఉత్తమమని భావించింది. అయినా ఎక్కడికి వెళ్లాలి?

బతకడానికి ఎక్కడో ఒక చోటికి వెళ్లే తీరాలి. తప్పదు. తాగుబోతు భర్తను నమ్ముకుని బతకడం సాధ్యం కాని పని. అతడు పెట్టే హింసల్ని భరించడం మరీ కష్టం. అతడ్ని వదిలి ఇల్లు విడిచి వెళ్లిపోవడానికి నిర్ణయించుకుంది.

అవును... అతడ్ని వదిలి ఒంటరిగా జీవించాలి. ఓ రోజు తన ఇద్దరు పిల్లలతో ఇల్లు విడిచింది. ఎక్కడికి వెళ్లాలి? మళ్లీ అదే ప్రశ్న. పురుషాధిక్యత లేని ప్రపంచం కావాలి. వుంటుందా? చివరికి కేరళలోని ఓగ్రామం చేరుకున్నాం. అక్కడే గడిచింది నాబాల్యం. తల్లిచాటు కూతుర్ల మొదట్లో వుండేదానిని ఆ తర్వాత ఆలోచించడం నేర్చుకున్నాను. అమ్మబడి చెప్పుంది. పిల్లల్ని ప్రోగుచేసి విద్యను నేర్పిస్తుంది. పాఠాలు చెప్పడం అంటే అమ్మకు ఇష్టం. చాలా చక్కగా కథలు, కథలుగా విద్యార్థులను ఆకట్టుకునే విధంగా చదువు చెప్పేది.

నా గురువు కూడా అమ్మే. ఆమెను ఆదర్శంగా తీసుకునే నన్ను నేను తీర్చిదిద్దుకోవటం నేర్చుకున్నాను. అమ్మనుంచే అభిప్రాయాలు, భావాలు నాలో ఏర్పడ్డాయి- అడ్డదిడ్డంగా మాట్లాడటం కాకుండా ముక్కుసూటిగా వుండడం, నచ్చినపనే చేయడం నాకిష్టం. ఎవరి

సంతోషం కోసమో మనం మన భావాల్ని చంపుకొని వారికి అనుగుణంగా వుండాలని అనుకోను. బహుశా నాలో ఎక్కువ మందికి నచ్చని అంశం ఇదేననుకుంటాను.

మా అమ్మ కూడా అచ్చం నాలాగే చేస్తుంది. కావాలంటే ఒక విషయం చెప్తాను చూడండి. నాకు చిన్నప్పటినుంచి కలల్లో బతకడం కాకుండా వాస్తవంలో జీవించడం నేర్పింది. 'నువ్వు పెళ్లి చేసుకోవద్దు' అని నూరిపోసింది.

## మగాడి అవసరం వద్దు

ఏ తల్లి అయినా తన కూతురికి ఇలాంటి మాట చెప్పగలదా? మా అమ్మ నాతో చెప్పింది. ఒకటీ రెండు సార్లు కాదు... కొన్ని వందల సార్లు. మన దేశంలో ఆడపిల్లకు పెళ్లే సర్వస్వం. పెళ్లి చేసి ఆమెను అత్తగారింటికి కోడలుగా పంపడమే ఆడపిల్లల తల్లిదండ్రుల లక్ష్యం. పెళ్లి అమ్మాయి జీవితంలో చివరి మెట్టు. ఒక మగాడి నీడలోకి చేరుకోవడం ఈ పెళ్లి పరమార్థం.

ఏమిటి? మగవాడి అండలేకుండా ఆడది జీవించలేదా? మగవాడు అవసరమా? లేదు. మగవాడి అవసరం లేకుండా బతికి చూపించాలి.

అమ్మ చెప్పినట్లు పెళ్లిని ప్రక్కన పెట్టేశాను. అసలు చిన్నప్పటి నుంచి కూడా ఆ రకమైన ఆలోచనలు ఏవీ నాలో లేవు. మగవాడి నుంచి ఎంత నరకాన్ని అనుభవించాలో అంతకు రెట్టింపు హింసను. మా కుటుంబం అనుభవించింది. అమ్మ అందుకే నాలో చిన్నప్పటినుంచి 'పెళ్లి నీ జీవితంలో లేదు' అంటూ హెచ్చరిస్తూ వచ్చింది. ఈ దేశంలో ఒక కూతురికి ఈ రకమైన హెచ్చరికలు చేసిన మొదటి చివరి తల్లి మా అమ్మనే అనుకుంటాను. ఆడపిల్లలందరికీ- తనకు చేతనైనంత వరకూ చదువు మా అమ్మ చెప్పించింది. మీకు ఇంతకంటే నేనేం ఇవ్వగలను? కట్నాలు, కానుకలు ఇచ్చి పెళ్లి చేసే పరిస్థితుల్లో నేనులేను. మీకిష్టమైనట్లు చదువుకోండి. చదువునే నమ్ముకోండి. చదువు మిమ్మల్ని తీర్చిదిద్దుతుంది అంటూ సర్వం చదువేనని మా అమ్మ ఉపదేశించేది.

చివరికి ఆమె మాటే నెగ్గింది. చదువు నాకు ఆధారమయ్యింది. నిజానికి మన దేశంలో అమ్మాయిలందరికీ వారివారి జీవితాల్ని నిర్మించుకోడానికి చదువే ఏకైక పరిష్కారమార్గం. దేశంలో మహిళలపై వివిధ రూపాల్లో జరుగుతున్న హింసను ఎదుర్కోవడానికి చదువు తప్పనిసరి. అసలు మన కాళ్లపైన మన నిలబడి బతకగలిగినప్పుడు మగవాడి అవసరం ఎందుకు వస్తుంది. మనం మగవాళ్లనే ఆధారంగా చేసుకోవడం వల్లనే వారి హింస మనకు శాపంగా మారుతోంది. సోదరుడైనా, భర్త అయినా, తండ్రి అయినా, కొడుకైనా ఆడవారిని హింసించే విషయంలో మగవాళ్లంతా ఒకటే. కుటుంబానికి యజమానిగా అతడు పెట్టే హింసను ఎందుకు భరించాలి?



## జీవితం అందమైనది

ఆడవాళ్లు యజమానులుగా వున్న కుటుంబాలు ఎన్నో ఇంతకంటే అభివృద్ధి చెందాయి. చెందుతున్నాయి. కాదనగలరా? స్త్రీ లేకుండా పురుషుడు వుండలేకపోవచ్చు. కానీ పురుషుడు లేకుండా స్త్రీ తప్పకుండా వుండగలదు.

ఇందుకు నా జీవితమే ఉదాహరణ. ఆడవారి అభివృద్ధిని కాలరాయడానికి, వారి ప్రగతిని అడ్డుకోవడానికి ముందుగా ప్రయత్నించేది పురుషుడే. మహిళలంతా చదువుకొని తమ కాళ్లపై తాము నిలబడగలిగితే పురుషులతోపాటు సమాన గౌరవాలు అవే వస్తాయి. సమాజంలో ఈనాడు వుంటున్న వ్యత్యాసాలన్నీ కనుమరుగవుతాయి.

అలా కాకుండా పురుషుడిపైనే ఆధారపడినంతకాలం ఈ హింస, నరకయాతన ఇలాగే కొనసాగుతూ వస్తుంది. మనం మన వ్యక్తిత్వాన్ని చంపుకోకుండా కాపాడుకోవాలి. ఇంతకీ స్త్రీ పెళ్లి చేసుకొని ఏం చేస్తుంది? పనిమనిషిగా మారుతోంది. పిల్లల్ని కనిపెట్టే యంత్రం అవుతోంది. ఇంట్లోని టి.వి., ఫ్రిజ్, కూలర్‌లాగానే ఒక భోగ విలాస వస్తువుగా తయారైంది. కుటుంబ పరిచారిక పాత్ర పోషిస్తోంది. సహధర్మచారిణిగా కొనసాగడమంటే ఇదేనా? పురుషులు అండగా లేకపోయినా జీవితం ఆగిపోదు. జీవితం చాలా అందమైనది. ఆశలను యదార్థం చేసుకొని బతుకును చరితార్థం చేసుకోవడం మనలోనే వుంది. మగవాడిని నమ్మడం, మోసపోవడం, హింసను అనుభవించడం మామూలైంది. ఇలా ఎందుకు జరగాలి. తల్లి, చెల్లి, భార్య ఇలా ప్రతి ఆడదీ కుటుంబహింసను ఏదో ఒకరూపంలో అనుభవిస్తూనే వుంది. ఇక్కడ పేద, ధనిక, విద్యావంతుడు, నిరక్షరాస్యుడు అనే తేడాలు లేకుండా కుటుంబహింసను పోషిస్తున్నారు. ప్రస్తుతం అభివృద్ధి పేరుతో మహిళలపై సరికొత్త రీతిలో హింస జరుగుతోంది.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 50 ఏళ్లు అయినా మహిళలకు జరిగిన ప్రయోజనం ఏమిటి? ఇప్పుడు మహిళలంతా తమ హక్కుల కోసం, భవిష్యత్ కోసం పోరాడాల్సిన సమయం వచ్చింది. మా అమ్మ నాతో 'నిన్ను 18 సంవత్సరాల వరకే చదివిస్తాను. అంతవరకే నీ పోషణ భారం వహిస్తాను. ఆ తర్వాత నువ్వు స్వతంత్రంగా బతకాలని చెప్పింది. నేను సరే అన్నాను. పురుషుల అండ లేకుండా మహిళలు ఏదైనా సాధించవచ్చు అని ఖచ్చితంగా చెప్పడానికి నేనే మీకు నిదర్శనం.

జీవితం నడిపినట్లే నడుచుకుంటే గొర్రెలకూ మనకూ తేడా లేదు. మనుషులైనందుకు, శక్తి సామర్థ్యాలు ఉన్నందున జీవితాన్ని మనకు నచ్చిన పద్ధతిలో మలుచుకోవాలి. ఇప్పుడు మనం ఎటువైపు వెళ్తున్నామో, చివరికి సమాజం ఏమైపోతుందో తెలియడం లేదు.

## ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్

మానవ సంబంధాలన్నీ ఆర్థిక విలువలపైనే ఆధారపడుతున్నాయి. పెళ్లి అనే వైవాహిక బంధం కూడా డబ్బుతోనే ముడిపడి పోయింది. కట్నంకోసం ఇల్లునీ, ఇల్లాలినీ వదులుకునేవాడు ఒకడైతే, వారిని హింసించే వారు మరొకరు. అందుకే అమ్మాయి పుట్టగానే చదువు చెప్పించడానికి ప్రాధాన్యత ఇవ్వండి. ఆమె తన ఉపాధిని తాను చూసుకునేలా మార్గం వేయండి. ఆమెకు అండగా నిలబడండి. ఆమె పట్ల ఆదరణ చూపండి. మీ వంతు సహకారం అందించండి.

ప్రపంచంలో బతకడానికి అనేక మార్గాలు వున్నాయి. నీకు ఇష్టమైనది ఏదైనా చదువుకో ఆ రంగంలో రాణించేందుకు ప్రయత్నించు. మగవాడి తోడు అవసరం లేదు. ఆడవాళ్లుగా మనకున్న పరిధి చాలా చిన్నది. ఈ కాస్త పరిధిలోనే ఏదైనా చెయ్యాలి. ఎంతో సాధించాలి. నేను 'గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' పుస్తకాన్ని రాయకముందు చాలా ఇబ్బందులు పడ్డాను. తర్వాత సినిమాల్లోకి వెళ్లాను.

'ఇన్ విచ్ ఎనీ గివ్స్- ఇట్‌దోజ్ వన్స్', 'మాస్సేసాహిబ్' సినిమాల్లో నటించాను. ఈ సినిమాలతో పాటు 'ఎలక్ట్రిక్ మూన్' అనే సినిమాకు కూడా నేనే స్క్రిప్ట్ అందించాను. ఆ తర్వాత 'గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' రచన సాగింది. ఈ రచన కోసం దాదాపు ఐదేళ్లు పట్టింది.

రచన సమయంలో ఇంత పేరు వస్తుందని నేనెప్పుడూ అనుకోలేదు. రచనలో ప్రజల మనోభావాలు ప్రతిబింబించడం వలనే ఇంత పాపులర్ అయ్యిందని భావిస్తున్నాను. 'గాడ్ ఆఫ్ స్మాల్ థింక్స్' ఇప్పటి వరకూ నలభైతొమ్మిది భాషల్లో ప్రచురితమయ్యింది. ఈ రచన వలన వచ్చిన ఆకస్మిక పేరు ప్రఖ్యాతులు, సంపద నన్ను ప్రలోభపెట్టలేక పోయాయి. ఆ రచన బుకర్ ప్రైజ్‌ను గెల్చుకున్నాక కూడా నా జీవన విధానంలో మార్పు ఏమీ రాలేదు. మీడియా ఇచ్చే ప్రచారానికి అడ్డు చెప్పలేం. నాకు అవార్డు రాకముందే బాగుండేది. నాకు నచ్చినట్లు నాపని నేను చేసుకునేదాన్ని. ఆసక్తి లేని అంశాలను వదిలేసేదాన్ని. గుర్తింపు వచ్చాక అలా వుండడానికి వీలు లేకుండా, మౌనంగా చేతులు కట్టుకొని కూర్చోలేక పోతున్నాను. 'పోఖ్రాన్-2' అణుపరీక్షలు నన్నెంతో కలచి వేశాయి. న్యూక్లియర్ ప్రభావం, జరగబోతున్న ప్రమాదాలను విశ్లేషిస్తూ 'ఎండ్ ఆఫ్ ఇమాజినేషన్' పుస్తకం రాశాను. ఇక్కడి పేద ప్రజల ఆకలి కేకల్ని వినకుండా- అణ్వస్త్రాలను తయారు చేయడం ఏమిటి? దానివల్ల - దేశానికిగానీ, పేద ప్రజలకు గానీ కలిగే ప్రయోజనం ఏమిటి?

### పర్యావరణ పరిరక్షణ

అణ్వస్త్రాలు నిజానికి మనకు అవసరమా? ప్రచ్ఛన్నయుద్ధం-ముగిసిన తర్వాత బేరాలు



తగ్గి కలవరపడుతున్న మృత్యు వ్యాపారులైన ఆయుధ ఫ్యాక్టరీల యజమానులకు, చమురు క్షేత్రాల్ని గుప్పిట్లో పెట్టుకొని అంతర్జాతీయ విపణిని శాసించాలనుకుంటున్న పాశ్చాత్య పెట్టుబడిదారీ ప్రభుత్వాలకు, వాటి వెనుక వున్న పారిశ్రామికవేత్తలకు అణ్వస్త్రాలు అవసరం కానీ పేదలతో నిండిన, వారి ఆకలి కేకల ఆర్తనాదాలతో ప్రతిధ్వనిస్తున్న మన దేశానికి అణుపరీక్షలు ఎందుకు చెప్పండి?

అసలు అణ్వస్త్రాలే ప్రపంచం విధ్వంసానికి మూలకారణం అవుతాయి. అణ్వస్త్ర రహిత ప్రపంచం గురించి పుంఖానుపుంఖాలుగా మాటలు వల్లించేవారు ఈ విషయం గురించి మాట్లాడరెందుకు? ప్రజలందరూ ఆకాంక్షించే 'అణ్వస్త్ర రహిత ప్రపంచం' ఇలాగేనా సిద్ధించేది? అణ్వాయుధాల గుట్టలే తమ దేశాలకు అసలైన రక్షణ కవచాలు అనే సిద్ధాంతాన్ని అగ్రరాజ్యాలు ఇప్పటికే పాటిస్తున్నాయి. దీని వలన పర్యావరణానికి భూగర్భంలో సంభవించే ప్రకంపనలకు వాటిల్లే ప్రమాదాన్ని ఎవరూ గుర్తించడం లేదు.

అణుధార్మిక వ్యర్థ పదార్థాల వలన సృష్టించబడే కాలుష్యం సామాన్యమైనది కాదు. ప్రకృతిని, మనిషిని సమూలంగా నాశనం చేసే వరకూ అవి విశ్రమించవు. ఈ పరిణామాలను, ప్రభావాలను దృష్టిలో వుంచుకుని రాయబడిన పుస్తకమే 'ఎండ్ ఆఫ్ ఇమాజినేషన్'. స్పందించి రాసిన రచన.

రచయితలు సమాజంలోంచే వస్తారు. తమ ఉనికికి కారణమైన సమాజ అభివృద్ధికి తమ వంతు కృషి  చేయడం కనీస కర్తవ్యం. ఆ ఉద్దేశ్యంతోనే నేను ప్రకృతి పరిరక్షణ కోసం, పర్యావరణ సమస్యలపై యుద్ధం ప్రకటిస్తూ నడుంబిగించాను.

ముందుగా ఉత్తర కేరళలోని కోజిక్కోడు పక్కన చాలియార్ నదిని పరిరక్షించడం కోసం సాగుతున్న ఉద్యమం గురించి తెలిసింది. అక్కడ నది పరిరక్షణ కోసం స్థానికులు ప్రభుత్వంతో చేస్తున్న పోరాటంలో నేను కూడా పాల్గొనాలని నిర్ణయించుకున్నాను. ప్రజలు సంతోషించారు.

అప్పుడే ఒక నిర్ణయం తీసుకున్నాను. పర్యావరణ పరిరక్షణ కోసం, పేదప్రజల అభ్యున్నతి కోసం మనం పాటుపడాలి. వారికి అండగా నిలబడాలి. ఈ సమయంలో నర్మదానది తీరాన సాగుతున్న ఉద్యమం గురించి అధ్యయనం చేశాను. వెళ్ళి అక్కడి ఆదివాసీలను కలుసుకొని వారి కష్టాలు విన్నాను. వారి కన్నీళ్లను తుడవడానికి ఏదో ఒకటి చేయాలనిపించింది.

### 'నర్మదా బచావో'

ఆ ఉద్దేశ్యంతోనే నర్మదాబచావో ఉద్యమంలో పాలుపంచుకుంటూ 'గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' నవలకు బుకర్ ప్రైజ్ ద్వారా వచ్చిన నగదు కోట్ల రూపాయల మొత్తాన్ని ఆందోళనకు

సమర్పించాను. నిజానికి నర్మదా బచావో ఆందోళన ద్వారా నేనెంతో స్ఫూర్తి పొందాను. ఆదివాసీల ఆవేదన నేను అర్థం చేసుకోగలను. వారిప్పుడు నిర్వాసితులు. వారికిప్పుడు సాయం చేసే చేతులు కావాలి. వారి జీవితాన్ని కాలరాయడానికి ప్రభుత్వానికి ఎవరు అధికారం ఇచ్చారు?

అభివృద్ధి పేరుతో వినాశనం సృష్టిస్తున్నారు. నర్మదా నదిపై కొనసాగుతున్న బహుళార్థ సాధక పథకాలైన నర్మదాసాగర్, సర్దార్ సరోవర్ ప్రాజెక్టుల వలన పర్యావరణానికి తీవ్ర ముప్పువాటిల్లుతోంది. ఆదివాసీల సంస్కృతి, చరిత్ర కనుమరుగవుతోంది. ఎంతో మంది ఆదివాసీలు నిరాశ్రయులవ్వడమే కాకుండా కొన్ని వేల హెక్టార్ల అటవీ భూములు నదీగర్భంలో కలిసిపోతున్నాయి.

ఎన్నో వందల గ్రామాలు నట్టేట మునిగిపోయాయి. తరతరాలుగా వస్తున్న ప్రాచీన ఆదివాసీల సంస్కృతీ అంతరించి పోతోంది.

నర్మదా పరీవాహక ప్రాంతంలోని అమాయక ఆదివాసీలపై పెత్తందార్లయిన భూస్వాముల, కాంట్రాక్టర్ల అమానుష ధోరణి, రాజకీయవేత్తల ఘరానా దోపిడీ, అధికార్ల అణచివేత వారిని జలగల్లాగా పట్టిపీడిస్తున్నాయి. ఈ నాగరిక సమాజం ఆదివాసుల్ని పీల్చిపిప్పి చేస్తోంది.

వారి సర్వస్వాన్ని దోచుకుంటోంది. ఈ ప్రాజెక్టు కోసం మొదట్లో కొంతమేరకు ప్రపంచబ్యాంకు నిధులందించింది. ఆ తర్వాత 'నర్మదా బచావో ఆందోళన్' మొదలు కావడంతో బ్యాంకు అధికారులు కమీషన్ వేశారు.

కమీషన్ నివేదిక ప్రకారం పర్యావరణానికి ముప్పు వాటిల్లుతోందని వెల్లడి కావడంతో ప్రపంచ బ్యాంకు నిధుల్ని ఇవ్వడం మానేసింది. 1985లో ప్రపంచ బ్యాంకు అంచనాల ప్రకారం రు. 13.640 కోట్లుగా వున్న ప్రాజెక్టు వ్యయం 1994 నాటికి 34 కోట్లకు చేరుకోవడం కూడా ప్రపంచ బ్యాంకు నిధుల్ని ఆపివేయడానికి ఒక కారణమైంది.

## పొంచివున్న ప్రమాదం

నర్మదా ఆనకట్ట వల్ల వచ్చే మొత్తం విద్యుత్ 523 మెగావాట్లు, నర్మదానదీ పరివాహక ప్రాంతంలో మునిగిపోయే మొత్తం అటవీ వైశాల్యం 54,000 హెక్టార్లు. భారత ప్రభుత్వ పర్యావరణ శాఖ అంచనాల ప్రకారమే నష్టం 40,000 కోట్లు.

ఇంత వరకూ ఆ ప్రాంతాన్ని సందర్శించిన ఎంతో మంది అధికారులు ఆనకట్ట నిర్మాణం వలన లాభం కంటే నష్టమే ఎక్కువని అంచనా వేశారు. ఈ ప్రదేశం కూడా భూకంపాలు రావడానికి అనుకూలమైందని తేలింది.

నర్మదా వ్యాలీ ప్రాజెక్టు 30 పెద్ద, 135 మధ్య తరహా, 3000 చిన్న డ్యాముల కలయికతో



కూడుకున్నది. ఇక్కడున్న రెండు పెద్ద డ్యాములు సర్దార్ సరోవర్, నర్మదాసాగర్. దాదాపు 10,000 గ్రామాలు నర్మదా పరీవాహక ప్రాంతంలో ముంపుకు గురవుతున్నాయి. సర్దార్ సరోవర్ ప్రాజెక్టు ఎత్తును 455 అడుగుల ఎత్తునుంచి 420కి తగ్గించినట్లయితే 90శాతం ప్రజలను ముంపుకు గురికాకుండా రక్షించుకోవచ్చు. కానీ ఇవేవీ ప్రభుత్వం పట్టించుకోవడం లేదు.

నర్మదానదీ పరివాహక ప్రాంతంలో ఆనకట్టల వలన సాగుదల అయ్యే భూమి మొత్తం 1,38,000 హెక్టార్లు. అయితే అదే ఆనకట్ట వలన మునిగిపోయే భూమి మొత్తం 1,38,000 హెక్టార్లు. సమానంగా వుంది. మన దేశంలోను, ప్రపంచంలోను నిర్మించిన డామ్‌లలో దాదాపు 10వ వంతు విఫలమయ్యాయి. అనేక డామ్‌లు పగిలిపోయాయి.

భూగర్భంలో పగుళ్ళు, భూగర్భంలోని రాతి పగుళ్ళు, భూకంపాల తీవ్రత, డామ్ రూపకల్పనలోని తప్పులు, డామ్ భద్రత, జలాశయం నిండడం వల్ల కొండచరియలు విరిగిపడే ప్రమాదం, నీరు పొంగిపొర్లడంతో సిమెంటులైను, రాళ్ళు, గులకరాళ్ళు, ఇసుకతో డామ్ బాంబులా పేలిపోయే ప్రమాదం పొంచి వుంది.

ఈ రోజు ప్రపంచంలో మనం చూస్తున్నది అభివృద్ధికీ, పర్యావరణానికీ మధ్యన యుద్ధం కాదు. వినాశానికీ, జీవితానికీ మధ్య యుద్ధం.

నర్మదా ప్రాజెక్టు నిర్మించడం ఆర్థికంగా, సామాజికంగా, పర్యావరణ దృష్ట్యా, అభివృద్ధి దృష్ట్యా కూడా మంచిది కాదు. ప్రభుత్వాలు ఇలాంటి ప్రాజెక్టులు చేపట్టి పొలాలకు నీరు, పరిశ్రమలకు విద్యుత్ అందించడానికి కృషి చేస్తుంటే పర్యావరణ ఉద్యమకారులు అర్థంపర్థం లేని గొడవలతో ప్రగతికి అడ్డువస్తున్నారని కొందరు భావిస్తున్నారు. నర్మదా ప్రాజెక్టు వివాదంలో అధికారులు, నిపుణులు సత్యాలను ఎలా సమాధి చేశారో తెలుసుకుంటే మీరు కూడా పోరాటంలో భాగం అవుతారు. ఆధివాసీల పట్ల ప్రేమ ఆప్యాయతలను పెంచుకుంటారు.

## నిజమైన శత్రువు

ఆదివాసీలను వారి స్థలాలనుంచి ఖాళీ చేయించి నిర్మిస్తున్న ఈ ప్రాజెక్టు గుజరాత్‌లోని 1.8 మిలియన్ల హెక్టార్లు, రాజస్థాన్‌లోని 75వేల హెక్టార్లను సాగులోకి తేవడంతోపాటు 1450 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చెయ్యాలనేది ప్రభుత్వ లక్ష్యం. వీటిలో ఏ ఒక్కటీ నెరవేరలేదు. ఆదివాసీల సంస్కృతీ, జీవన విధానం పూర్తిగా మారుతోంది. ఆనకట్ట నిర్మాణం వలన వృక్ష సంపద నాశనమై వాతావరణం దెబ్బతింటోంది. డామ్ నిర్మాణం భద్రతకు భంగకరమే కాకుండా నిర్వాసితులకు పునరావాసం కూడా కల్పించబడలేదు. ఆదివాసీల పరిస్థితి దయనీయంగా తయారైంది. ప్రకృతి ఒడిలో పెరిగిన ఆదివాసీలకు నీరు, వంటచెరకు, పశువుల మేత అన్నీ అక్కడే లభించేవి. ఇప్పుడు వారు వారి ప్రాంతాల్ని పోగొట్టుకోవడం

ద్వారా ఎన్నో ఇబ్బందులు పడాల్సి వస్తోంది.

ఇక్కడి నేల, నీరు, అడవులను అధికారులు తమ గుప్పిట్లోకి తెచ్చుకుంటున్నారు. అడవులను కాంట్రాక్టర్లు కనుమరుగు చేస్తున్నారు. మట్టి, నీరు, గాలి ఇవే జీవించడానికి ఆధారాలు.ఒక్కసారి ఇవి లేని ప్రపంచాన్ని ఊహించుకోండి. అప్పుడు తెలుస్తుంది వీటి ఆవశ్యకత ఎంతో... ఇవి లేకుంటే జీవితం ఎంత భయానకంగా ఉంటుందో. భారీ ప్రాజెక్టులు కట్టేబదులు చిన్న చిన్న ప్రాజెక్టులు కట్టవచ్చు కదా. ప్రభుత్వం ఇప్పటికీ రూ.7500 కోట్లు ఖర్చుపెట్టామని గొప్పలు చెప్తోంది. ఇంకా 35వేల కోట్ల రూపాయలు ఖర్చు చేయాల్సి వుంది. కానీ ఎంత మందికి ప్రయోజనం జరిగింది? ఎన్ని భూములకు నీరు అందించగలిగారు? ఇవే నేను అడిగే ప్రధాన ప్రశ్నలు.

అభివృద్ధి పేరుతో పర్యావరణానికి జరుగుతున్న హింసను జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఈ పెద్ద డాముల వలన ఎవరికి లాభం? గత 50 ఏళ్ళ కాలంలో విద్యుత్ ఉత్పత్తి 20రెట్లు పెరిగిందని చెప్తున్నారు. అయితే దేశంలో అనేక గ్రామాలకు ఇంకా విద్యుత్ సౌకర్యం లభించలేదు. వీటినిబట్టి మనకు నిజమైన శత్రువు ఎవరో అర్థమౌతూనే ఉంది.

### ఆహార భద్రత ఏది?

ముందుగా వీరు చెట్లని నరికేస్తారు. పీల్చే గాలిని కలుషితం చేస్తారు. ఆకాశాన్ని కూడా వదిలిపెట్టరు. డ్యాములు, ప్రాజెక్టులు నిర్మించేస్తారు. ఇవన్నీ మాకు అవసరం లేదని మీరు తేల్చి చెప్పండి. మాకు మా చెట్లే కావాలి. మాకు మా గాలే కావాలి. మాకు మా ఆకాశమే కావాలి అని నినదించండి. మీరిప్పుడు మౌనంగా ఉంటే దురాక్రమణ విస్తరిస్తూ వస్తుంది. మీ జీవితాల్ని కూడా కబ్జా చేసేస్తారు.

మీ ఊళ్లో చెట్లు నరికే వారిని క్షమించనే వద్దు. నిలదీసి ప్రశ్నించండి. దేశంలో ఉత్పత్తి అయ్యే మొత్తం ఆహారధాన్యాలలో కేవలం 12శాతం మాత్రమే పెద్ద ప్రాజెక్టుల కింద పండుతున్నాయి. మిగిలినవన్నీ భూగర్భజలాల వలనే పండుతున్నాయి. పైగా ఏటా ఉత్పత్తి అయ్యే మొత్తం ఆహారధాన్యాలలో పదిశాతం ఎలుకల పాలవుతున్నాయి.

1951లో 50 మిలియన్ల ఆహారధాన్యాల ఉత్పత్తినుంచి ప్రస్తుతం 200 మిలియన్ల ఉత్పత్తికి చేరుకున్నా దారిద్ర్యరేఖకు దిగువనున్న ప్రజలకు సరిపడేంత పంపిణీ చేయడం లేదు.

గుజరాత్‌లో ఎడారి ఛాయలు కనిపించే కచ్, సౌరాష్ట్ర జిల్లాలకు నీరు అందించేందుకు నర్మదా ప్రాజెక్టు ఉద్దేశ్యమని అధికారులు చెప్తున్నారు. కానీ ఇప్పటి వరకు మధ్య గుజరాత్ వరకూ నీళ్ళు చేరాయి. కచ్ ప్రజలకు ఇంతవరకూ నీళ్ళు చేరలేదు. సౌరాష్ట్రలోని 1.8శాతం



మాత్రమే ఇప్పటి వరకూ లాభపడ్డారు. మిగిలిన ఉత్పత్తులన్నీ నదీ జలాలు, కాలువ, వర్షాధారంగా పండుతున్నవేనని గమనించాలి.

ప్రపంచంలోని భారీ ప్రాజెక్టుల నిర్మాణంలో మన దేశం మూడవస్థానంలో వుంది. ఇప్పుడున్న 3600 పెద్ద డ్యాములలో, 3300 స్వాతంత్ర్యం వచ్చిన తరువాత నిర్మించినవే. మన దేశంలోని డామ్‌లు ఆధునిక దేవాలయాలుగా, ఆకలి, పేదరికం పారదోలేందుకు నిర్మించినవిగా పాఠ్యపుస్తకాలలో బోధనాంశాలుగా చేర్చబడ్డాయి. అయితే ఇవి మనకు ఆహార భద్రతనిస్తున్నాయా?

### ఎవరైనా మాట్లాడండి

1990లో మధ్యప్రదేశ్‌లో చార్గిడ్యాం నిర్మాణం పూర్తి అయ్యింది. ముందు ప్రణాళిక వేసుకున్న దానికంటే బడ్జెట్ 10 రెట్లు పెరిగింది.

మూడింతలు పరీవాహక ప్రాంతాలు ముంపుకు గురయ్యాయి. ముంపుకు గురైన ప్రాంతం మేర సాగు భూములకు కూడా ఈ డామ్ నీరందించలేకపోయింది. నర్మదా ప్రాజెక్టు నిర్మాణంలో నిర్వాసితులైన ఆదివాసీలకు పునరావాసం కల్పిస్తామని వట్టిమాటలు చెప్పారు.

ఇంత వరకూ ఒక గ్రామ ప్రజకు కూడా ప్రభుత్వం పునరావాసం కల్పించలేదు. నర్మదా నది వెంబడి. చెక్కర కర్మాగారాలు నిర్మించబోమని హామీ ఇచ్చారు. కానీ ఇప్పటికే 14 చక్కెర కర్మాగారాలు నిర్మించారు. అందులో చిమన్‌భాయి పటేల్ కర్మాగారం కూడా ఒకటి ఉంది. నీటిపారుదల రంగానికి కేటాయిస్తున్న మొత్తం నిధులలో 85శాతం నిధులను నర్మదా ప్రాజెక్టుకు గుజరాత్ ప్రభుత్వం మళ్ళిస్తోంది. ఇంత భారీమొత్తం ఖర్చుచేసినా ఒరిగిందేమీ లేదు. ఆదివాసీలు అది గ్రహించారు. దానినుంచి పుట్టిందే నర్మదా బచావో ఆందోళన్.

ఈ ఆందోళన్ వెనుక విదేశీయుల హస్తం ఏమీ లేదు. దేశంలో అభివృద్ధి జరగకుండా విదేశీయులు ఆందోళనను ప్రోత్సహిస్తున్నారని వస్తున్న ఆరోపణలలో వాస్తవం లేదు. ఆందోళనకారుల్ని సి.ఐ.ఎ. ఏజెంట్లుగా గుర్తించడాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. పోరాటవీరుల్ని విదేశీ శక్తులుగా, ఏజెంట్లుగా ముద్రవేసి అభివర్ణించడం శోచనీయం.

పాలకవర్గాలు అభివృద్ధి పేరుతో ఇలాంటి హింస కొనసాగిస్తున్నారు. ముంపుకు గురైన వారికోసం ఇంతవరకు ఏం చెయ్యలేకపోయారు.

దేశంలోని ధనికవర్గాలకు చెందిన ఐదువందల కుటుంబాల ఆస్తులను స్వాధీనం చేసుకుంటే ప్రజాస్వామ్యాన్ని హత్య చేశారని పతాక శీర్షికల్లోకి ఎక్కుతారు. ఇప్పుడు ఆదివాసీల ఆస్తుల్ని, సంపదల్ని స్వాధీనం చేసుకుంటే ఎవ్వరూ మాట్లాడరెందుకు? అధికంగా భూగర్భజలాలను తోడడం, విచక్షణారహితంగా చెట్లను నరకడం తదితర కారణాల వల్ల కచ్

జిల్లా ఎడారిగా మారింది.

ఇప్పుడు అదే కచ్‌జిల్లాలను సస్యశ్యామలం చేస్తామని చెబుతూ నర్మదానది వెంబడి ఉన్న అనేక చెట్లు నరికివేయడం అభివృద్ధి అనిపించుకుంటుందా? పర్యావరణ పరిరక్షణ కోసం ఆందోళన చేయడం ద్వారా ప్రజాస్వామిక హక్కులను కాపాడుకోవాలి. నర్మదా ఉద్యమం దేశ ప్రజలందరికీ సంబంధించినది.

### విజయం సాధించాం

ఒకరకంగా చెప్పాలంటే టైంబాంబు ఇది. భారతీయ సంస్కృతికి ముప్పుతెస్తోంది. మనిషి మనుగడతో ముడిపడుతున్న పర్యావరణాన్ని పరిరక్షించడం ప్రజలందరి బాధ్యత. మన హక్కుల్ని కాపాడుకోవాలి. ఆనకట్టలు ఆధునిక దేవాలయాలు, అభివృద్ధికి సోపానాలు అంటున్నారు. ప్రకృతిని, ప్రజల్నీ నాశనం చేసే ప్రాజెక్టులు దేవాలయాలా? చెప్పండి.

ప్రపంచ బ్యాంకునే పునరాలోచించుకునేలా చేసిన ఈ ప్రజా ఉద్యమం గిరిజనుల హక్కుల పోరాటంలోనూ విజయం సాధించాలనే లక్ష్యంతోనే సాగుతోంది. దేశ అభివృద్ధి కార్యక్రమాల కోసం ఆదివాసీలు, దళితులు, రైతులు త్యాగాలు చేస్తుండగా నగరాల ప్రజలు, పారిశ్రామికవేత్తలు ఆ త్యాగాన్ని అనుభవిస్తున్నారు. ఇదేనా న్యాయమంటే? స్వాతంత్ర్యం లభించి యాభై సంవత్సరాలు దాటుతున్న పరిస్థితుల్లో కూడా అభివృద్ధి పేరుతో తమ ఇళ్లను వీడి వెళ్ళాల్సిన దుస్థితి వస్తోంది.

ఇప్పటి వరకూ మనం 3700 ఆనకట్టలు నిర్మించాం. అయినా ఈ రోజుకి 35కోట్లకు పైగా ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువనే ఉన్నారు. వీళ్ళలో ఎక్కువ మంది గ్రామాల్లోనే ఉన్నారు. కబ్బూర్ జిల్లాలో పాత్తన్‌పార గ్రామస్థులు సొంతంగా విద్యుత్ తయారు చేసుకుంటున్నారు.

ఆల్వార్‌లో నీటిపారుదలకు గ్రామస్థులు కొత్త పథకాలు తయారు చేసుకున్నారు. ఇవన్నీ ప్రశంసించదగ్గవే. నీటిపారుదలకు, విద్యుదీకరణకు ఇవి మరో పరిష్కార మార్గాలు కావా?

ఎంతో ఉన్నతమైన ఆశయాలతో నిర్మితమైన ఆనకట్టలన్నీ ప్రయోజనాలను ఇవ్వకపోగా రాజకీయ పార్టీలకు, కాంట్రాక్టర్లకు, ఇంజనీర్లకు ఉపయోగపడుతున్నాయి. అందుకే నా నవల 'గాడ్ ఆఫ్ ది స్మాల్ థింగ్స్'కు బుకర్ ప్రైజ్ ద్వారా వచ్చిన కోట్ల మొత్తాన్ని ఆదాయపన్ను శాఖకు అప్పగించి మరిన్ని ప్రాజెక్టులకో, అణుపరీక్షలు నిర్వహించడానికో బదులు తమ ఉనికి కోసం పోరాడుతున్న నర్మదా బచావో ఆందోళనకారులకు అందించాను.

దేశం ఈ రోజు పేదలతో నిండి పోతోంది. మన పేదరికం ఎంతో సంపన్నమైంది. మన పేదరికం డబ్బు పుట్టిస్తుంది. మన పేదరికం మన పేదల్ని ఇంకా ఇంకా పాతాళానికి లాక్కెళ్తోంది. పేదరికం చుట్టూ ఉన్న వ్యూహాలే పెద్దల పెద్దరికాన్ని నిలబెడుతున్నాయి.



నర్మదా బచావో ఆందోళన ద్వారా మేమెంత విజయాన్ని సాధించాం. ప్రకృతికి ముప్పు వాటిల్లే ఏ కార్యక్రమాకి శ్రీకారం చుట్టినా ప్రజలు ఎదురు తిరిగి ప్రశ్నించే స్థాయికి తీసుకెళ్ళాం.

### పోరాటం నాకిష్టం

నర్మదా సమస్య మీకెందుకు అని నన్ను ప్రశ్నించవచ్చు. నేనొక రచయిత్రిని. పోరాటం జరపడం నాకిష్టం. పేదప్రజల పక్షాన, పర్యావరణ పరిరక్షణ కోసం నేను ఈ ఉద్యమంలోకి వచ్చాను.

నా నవల 'గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' యాభైలక్షల కాపీలు అమ్ముడైంది. నా జీవితానికి ఎలాంటి ఇబ్బంది లేదు. రచయిత్రిగా చైతన్యవంతురాలిగా ఉండి మౌనంగా ఉండలేక పోతున్నాను. ప్రభుత్వంతో పోరాటం జరపడమంటే ఎవ్వరికైనా జంకే.

అందుకే ఎక్కువ మంది మేధావులు, రచయితలు ఉద్యమాలకు దూరంగా ఉంటారు. కానీ నేనలా ఉండలేను. నా కొత్త పుస్తకం 'ది గ్రేటర్ కామన్ గుడ్' (The Greater Common Good) నర్మదా వ్యాలీలో ఆదివాసీలతో కలిసి మేం సాగించిన ఉద్యమంకు సంబంధించిన వ్యాసాల సంపుటి. నాకిప్పుడు పేరు ప్రఖ్యాతులు, కావలసినంత డబ్బు లభించాయి.

రచనా రంగంతోనే కాకుండా పర్యావరణ ఉద్యమంలో పాలుపంచుకోవాలనే ఉద్దేశ్యంతోనే నర్మదా బచావో ఉద్యమంలో పాల్గొంటున్నాను. గత ఏడాది 'ర్యాలీ ఫర్ వ్యాలీ' యాత్రలో పాల్గొన్నాను. మధ్యప్రదేశ్‌లో కత్రాణ గ్రామం నుంచి ఆరుగంటలు అడవి ద్వారా ప్రయాణించి నదిలో రెండు గంటలు ప్రయాణించి నర్మదా సత్యాగ్రహం జరిగే చోటుకు చేరుకున్నాం.

నా కొత్త పుస్తకంలో ఈ అంశాలన్నీ వివరంగా ఉంటాయి. రచయితకు సామాజిక బాధ్యత కూడా ఉండాలి. కాదంటారా? కృతజ్ఞతలు.



ఏదైనా సరే ముక్కుసూటిగా మాట్లాడడం ఆమె కిష్టం. అనైతికంగా, అమానుషంగా, అన్యాయంగా పర్యావరణంకు జరుగుతున్న ముప్పును ప్రశ్నించడమే ఇప్పుడు ఆమె పోరాటం. సరదాగా, ఆవేశంగా, ఆవేదనగా ధారాళంగా మాట్లాడే అరుంధతీరాయ్ అంతరంగ ఆవిష్కరణ ఇది.

*మే 2000*

**స్వాతి మాస పత్రిక**

## ఆడజన్మకు ఎన్నిశోకాలో...

### అంగట్లో సరుకులైన అందమైన బతుకులు

ఏదో కారణం చూపి అమ్మాయిలను మోసం చేసి వేశ్యాగృహాలకు అమ్ముతున్న సంఘటనలు ఈ మధ్యకాలంలో ఎన్నో వెలుగులోకి వచ్చాయి. ముంబాయిలోని ఫ్యాన్సీ షాపుల్లో, ప్రైవేటు కార్యాలయాల్లో లేదా వంటపని కోసం అంటూ రకరకాల కారణాలు చూపి ఇద్దరు మహిళలను నెల్లూరు నుంచి తీసుకెళ్ళి ముంబాయి వ్యభిచార గృహాలకు అమ్మివేయగా వారు అక్కడినుంచి తప్పించుకుని చాకచక్యంగా బయటపడిన సంఘటన సంచలనం రేపింది. అలాగే దుండగులు చేతిలో దారుణంగా సామూహిక అత్యాచారానికి గురై చివరకు ముంబాయిలోని వేశ్యాగృహానికి తరలిపోయి నికృష్ట జీవితం గడుపుతున్న కడపజిల్లాకు చెందిన ఓ యువతిని పోలీసులు రంగప్రవేశం చేసి ఎట్టకేలకు విముక్తి కల్గించడంతో కథ సుఖాంతమయింది. ఈ విధంగానే ముంబాయి వేశ్యావాటిక నుంచి తప్పించుకుని 16 సంవత్సరాల శాంతి అనే అమ్మాయి పోలీసుల వద్దకు చేరింది. ఉపాధి కోసం గల్ఫ్ దేశాలకు వెళ్తున్న సీమ యువతులు పలు రకాల చిత్రహింసలు, లైంగిక వేధింపులకు గురవుతున్నట్లు ఎన్నెన్నో గాథలు, కన్నీటి కెరటాల్లా ఒక్కొక్కటిగా వెలుగులోనికి వస్తున్నాయి. గత ఏడాది వేశ్యావృత్తిలోనికి దింపేందుకు ఏలూరులో యువతులను భారీ ఎత్తున వేలం వేసినట్లు వచ్చిన వార్తలు పెద్ద దుమారాన్నే లేపాయి. జాతీయస్థాయిలో వివాదం రేగింది. సంఘటన నిజానిజాలు, పూర్వాపరాలపై రాష్ట్రప్రభుత్వం నుంచి సమగ్రమైన నివేదిక తెప్పిస్తామని రాజ్యసభ స్పష్టం చేయాల్సి వచ్చింది. రాష్ట్రంలో మూడుపువ్వులు, ఆరు కాయల్లా సాగిపోతున్న అమ్మాయిల వ్యాపారంపై సవివరమైన వ్యాసం ఇది. వారి కన్నీళ్ళను పట్టించుకోండి. వారి జీవన వ్యథను వినండి.

కడప జిల్లా ప్రొద్దుటూరు పట్టణ హైదర్‌ఖాన్ వీధికి చెందిన ఓ యువతికి తల్లిలేదు. సవతి తల్లి రాచి రంపాన పెట్టేది. బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకుంది. చావడానికి వెళ్తున్న యువతిని సుబ్బిరెడ్డి కొట్టాలకు చెందన శీను, వెంకటరమణ, వీరయ్య, దేవదాసు, జియన్నలు అనుసరించారు. ఆమెను వాటర్‌ట్యాంకు దగ్గర దారుణంగా అత్యాచారం చేశారు. యువతి ఫిర్యాదు మేరకు కేసు నమోదు అయింది. అత్యాచారానికి గురైన యువతి ఇల్లు వదిలి వెళ్ళింది. కడపకు చేరినప్పుడు అక్కడ ఆమెకు సుందరి అనే నపుంసకుడు పరిచయమయ్యాడు. ముంబాయిలో పని ఇప్పిస్తానని చెప్పి పరిచయస్తుల ద్వారా రసూల్‌బీ అలియాస్ దీప అనే వేశ్యాగృహం నిర్వాహకురాలికి విక్రయించాడు. అక్కడ ఆమె వేశ్యాగృహంలో బాధలు పడసాగింది. ఇంతలో అత్యాచారం కేసు విచారణకు వచ్చింది.



ఫిర్యాది అయిన యువతి లేకపోవడంతో కేసు వాయిదా వేస్తూ వచ్చారు. చివరకు ఎలాగైనా సరే ఆమెను పట్టుకురావాలని వారంట్ జారీకావడంతో పోలీసులు రంగప్రవేశం చేసి ముంబాయి వేశ్యాగృహం నుంచి ఆమెకు విముక్తి కల్గించారు.

నెల్లూరులో సెల్వీ అనే మహిళ స్థానిక టెక్కిమిట్టలోని బైరాగిమఠం మల్లెతోట దగ్గర నివాసం ఉండేది. నిప్పో సెంటర్‌లో నివాసం ఉంటున్న మహిళాకాంగ్రెస్ నాయకురాలుగా చెప్పుకునే ఓ మహిళ, సిండికేట్ బ్యాంకు సమీపంలో పలహారశాల పెట్టుకుని వున్న మరో మహిళ కలిసి సెల్వీని, ఆమె అక్కను ముంబాయికి తీసుకెల్తామని చెప్పారు. అక్కడ వంటపనిలో చేర్పిస్తామని నెలకు నాలుగువేలు జీతం ఇప్పిస్తామని చెప్పి నమ్మించి ముంబాయికి తీసుకెళ్ళారు. అక్కడికి వెళ్ళిన తర్వాత వేశ్యాగృహానికి విక్రయించారు. అక్కడ గదిలో సుమారు ఇరవైమందికి పైగా మహిళలు ఉండడం, వారి వద్దకు మగవారు వస్తూపోతూ వుండడం చూసి విషయం గ్రహించిన సెల్వీ, ఆమె అక్కలు ఎదురుతిరిగారు. వేశ్యాగృహ నిర్వాహకులు దౌర్జన్యానికి దిగారు.

ఒక రోజంతా భోజనం పెట్టలేదు. ముందుగానే పదివేలు అడ్వాన్స్ కూడా ఇస్తామని చెప్పారని అయితే వారితో గొడవపడి అక్కడి నుంచి పరారై వచ్చినట్లు బాధితులు వెల్లడించారు. అక్కడ నెల్లూరుకు చెందిన చాలా మంది వున్నట్లు వారు తెలిపారు. నెల్లూరులోని ఓ నర్సింగ్‌హోంలో పనిచేస్తున్న షాహిదా అనే అమ్మాయిని కూడా ఎవరో ముంబాయికి తీసుకెళ్ళారని, ఆ అమ్మాయి ఆచూకీ ఇంతవరకూ లేదని, నెల్లూరు ప్రాంతం నుంచి ఈ విధంగా చాలామంది అమ్మాయిల్ని వ్యభిచార గృహాలకు అమ్మేస్తున్నారని బాధితులు పాత్రికేయులకు వివరించారు. ఇలాగే చిత్తూరు, కడప జిల్లాల సరిహద్దులో కడప జిల్లాలోని పింఛా ప్రాజెక్టుకు ఐదు కిలోమీటర్ల దూరంలో వున్న సుగాలీతండా జిల్లెలమందలో అమ్మాయిల్ని వ్యభిచార కూపంలోకి దింపుతున్న వార్తలు గుప్పుమన్నాయి. పధ్నాలుగు, పదిహేనేళ్ళకే ఒక్కొక్క ఇంటినుంచి ఇద్దరు, ముగ్గురు చొప్పున వ్యభిచారం చేయడానికి వెళ్తుంటారు. ఇలా ఇప్పటికే ఈ తండానుంచి 150 మంది అమ్మాయిలు పూనా, ఢిల్లీ, ముంబాయి రెడ్‌లైట్ ఏరియాలకు చేరుకున్నారు.

తూర్పుగోదావరి జిల్లాలో వ్యభిచారానికి పేరుగాంచిన పెద్దాపురంలో కాంట్రాక్టు పద్ధతిపై వ్యభిచారం సాగుతోంది. ఇతర రాష్ట్రాల నుంచి వచ్చే బ్రోకర్లు కాకినాడ, పెద్దాపురం, సామర్లకోట, కోనసీమలోని మామిడికుదురు మండలంలోని మొగిలికుదురు స్థానిక బ్రోకర్లతో లావాదేవీలు కొనసాగిస్తున్నట్లు పోలీసులు గుర్తించారు. ఆ తర్వాత ఉపాధి పేరుతో ఆశచూపి ముంబాయి వంటి పట్టణాల్లో వ్యభిచార గృహాలకు అమ్మాయిల్ని చేరవేసి సొమ్ము చేసుకునే ముఠాలను పోలీసులు పట్టుకున్నారు. నిందితుడు గుర్రాల ఏసు నిర్బంధం నుంచి బోగడరాణి, బంధంకుమారి, షేక్‌సుల్తానా అనే అమ్మాయిల్ని విడిపించి వారివారి ఇళ్లకు చేర్చారు. ఈ

ముగ్గురమ్మాయిల్ని బంధించి దళారుల్ని తీసుకొచ్చి బేరసారాలు సాగించడం, ఏం జరుగుతోందని అమ్మాయిలు ఆక్రోశించినప్పుడు 'మిమ్మల్ని వ్యభిచార గృహాలకు అమ్మివేస్తున్నానని' అతను చెప్పడంతో చిన్ని అనే అమ్మాయి తప్పించుకుని వెళ్ళి పోలీసులకు సమాచారం అందించడంతో ఈ వ్యభిచార ముఠాను పట్టుకున్నారు. విశాఖపట్నంలో ఏడాదికి వందమందికిపైగా అమ్మాయిలు కనపడకుండా పోతుండడం వెలుగులోకి వచ్చింది. పోర్టుకు వచ్చే విదేశీ నౌకల్లోకి అమ్మాయిలను పంపించి వారి నుంచి ఎక్కువ మొత్తంలో విదేశీ కరెన్సీని సంపాదించే ముఠాలవారు సెల్‌ఫోన్లును, ఫ్యాక్స్ వంటి సౌకర్యాలను ఏర్పాటు చేసుకున్నట్లు గుర్తించారు. 'మాలినీ గ్రూప్' పేరుతో ఈ ముఠా నడుస్తున్నట్లు దీనివల్లనే మధురవాడ, గాజువాక, హెచ్.బి.కాలనీ, ఎంవిపి కాలనీ, సీతమ్మధార ఏరియాలు రెడ్‌లైట్ ఏరియాలుగా మారుతున్నట్లు కనుగొన్నారు. వరంగల్ జిల్లాలోని వంగపాడు, హసన్‌పర్తి, సిద్ధాపురం గ్రామాల్లోకి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి దౌల్తాబాద్ లాంటి ఇతర ప్రాంతాల నుంచి ఐదేళ్ళలోపు ఆడపిల్లలను ఖరీదుచేసి తీసుకొస్తున్నట్లు విచారణలో తేలింది. యువతులను కాంట్రాక్టు పద్ధతిపైన తెచ్చుకోవడం కంటే చిన్నపిల్లప్పుడే తెచ్చుకొని శిక్షణ ఇవ్వడం ద్వారా వారు శాశ్వతంగా తమ గుప్పిట్లోనే వుంటారనే ఉద్దేశ్యంతో ఈ రకమైన వ్యాపారం సాగిస్తున్నట్లు అంచనా. జాతీయ మహిళా కమిషన్ సహకారంతో 'అవేర్' సంస్థ ఆంధ్రప్రదేశ్‌లో వేశ్యావృత్తి అనే అంశంపై పరిశోధనలు జరిపింది. శ్రీకాకుళం నుంచి నెల్లూరు వరకూ పదకొండు జిల్లాల్లో వున్న 28 ప్రాంతాల్లో వేశ్యల జీవితాలను అవేర్ విశ్లేషించింది. గుంటూరు జిల్లాలోని చిలకలూరిపేట చెన్నై-కలకత్తా ఐదవ నంబరు జాతీయ రహదారిలో వ్యభిచార నెట్‌వర్క్ బయటపడింది. గోదావరి, కృష్ణా జిల్లాలతో పాటు హైదరాబాద్, చెన్నై నగరాల నుంచి కూడా కాంట్రాక్టు పద్ధతిన వస్తున్నట్లు తెలుస్తోంది. పట్నంలోని ఇరవైమూడు భారీ భవనాల్లో ఈ తంతు కొనసాగుతున్నట్లు, ఈ భవనాల్లో అండర్‌గ్రౌండ్‌లు కూడా ఉన్నట్లు తెలుస్తోంది. మహబూబ్‌నగర్‌కు చెందిన కార్మిక విముక్తి సంఘం 'మెహందీ'లో జరుగుతున్న వ్యభిచారంపై హైకోర్టుకు ఫిర్యాదు చేయడంతో పోలీసులు రంగంలోకి దూకి ఇరవైఅయిదు మంది అమ్మాయిల్ని అరెస్టు చేశారు. వీరిలో నలుగురు మైనర్ బాలికలు ఉన్నారు.

*28 ఫిబ్రవరి, 2000*

*ఆంధ్రభూమి దినపత్రిక*



# కష్టాల కొలిమిలో కాలుతున్న గులాబీలు

గల్ఫ్ కష్టాలు, కన్నీళ్లు, మోసాలు జీవితాన్ని కోల్పోవడం, వేధింపులతో సహజీవనం ఇవన్నీ గల్ఫ్ దేశాలకు బతకడం కోసం వెళ్లే మహిళలకు మామూలు విషయాలు. గల్ఫ్ దేశాల్లోని షేక్‌లు మన దేశ యువతులపై అత్యాచారాలు, లైంగిక వేధింపులకు పాల్పడుతూ ఇళ్ళలో బందీలుగా వుంచుతున్నట్లు విచారణలో వెల్లడైంది. షేక్‌ల దారుణాలను అడ్డుకుంటే బాధితులపై ఏదో ఒక నేరం మోపి జైళ్ళకు పంపుతున్నారు. వ్యభిచార నేరం కింద ఆ దేశ పోలీసుల హస్తాల్లో మన దేశానికి చెందిన యువతులు ఏళ్ల తరబడి జైళ్లలో కాలం వెళ్లదీస్తున్నట్లు తెలుస్తోంది. ఈ మధ్యనే కువైట్‌లోని ఒక సేట్ చేతిలో దారుణ హత్యకు గురైన చిత్తూరు జిల్లా పెద్దమండ్యం మండలం శివపురంకు చెందిన 30 సంవత్సరాల పావులమ్మ హత్య ఉదంతం వెలుగులోకి వచ్చింది. దీనిని కువైట్‌లోని భారత రాయబార కార్యాలయ అధికారులు కూడా ధృవీకరించారు. హత్యలు, ఆత్మహత్యలు, అనారోగ్యం కారణంగా గల్ఫ్ దేశాల్లో మరణిస్తున్న మన దేశస్థుల మృతదేహాలను కూడా ఇక్కడి బంధువులకు పంపకుండా మాయం చేస్తున్నట్లు తెలుస్తోంది.

మన రాష్ట్రానికి చెందిన సుమారు 30 మంది యువతులు గల్ఫ్ దేశాలకు వెళ్లి తిరిగిరాని ఖాతాలో వున్నారు. ఉపాధి కోసం గల్ఫ్ దేశాలకు వెళ్లిన యువతులను వేశ్యాగృహాల్లో నిర్బంధించి పలు రకాల చిత్రహింసలకు గురిచేస్తున్నారు. వేశ్యాగృహాల యమకూపాలలో చిక్కుకుని పలురకాల సుఖవ్యాధులకులోనై చివరకు గల్ఫ్ దేశాల ప్రభుత్వాలచే బహిష్కరణకు గురై అక్కడి పోలీసుల ద్వారా కొంతమంది యువతులు మన రాష్ట్రం చేరుకున్నారు. గల్ఫ్ దేశాల్లోని కొందరు వ్యక్తులు రోజుకు 18 గంటలు మన దేశ యువతులచే వ్యభిచారం చేయిస్తున్నట్లు తెలుస్తోంది.

"కువైట్‌లోని చీకటి గదిలో బంధించి చిత్రహింసలు పెడుతున్నారు. శరీరం మొత్తం కుళ్ళబొడుస్తూ ఆనందిస్తున్న షేక్‌ను చూస్తే భయమేస్తోంది" అంటూ శివపురానికి చెందిన పావులమ్మ ఆడియో క్యాసెట్‌ను తన భర్త వెంకటరమణారెడ్డికి పంపింది. రాయచోటి (కడపజిల్లా)కి చెందిన ఏజెంట్ నన్ను కువైట్‌లోని మహ్మద్‌ఫర్వానీసా అలీ ముషారి సాదియక్ అనే షేక్ ఇంట్లో పనికి పంపాడు. షేక్ రోజూ నన్ను చిత్రహింసలు పెడుతున్నాడు. దీన్నిబట్టి చూస్తే రాయచోటి ఏజెంట్ నన్ను షేక్‌కు అమ్మేశాడేమో అనిపిస్తోందని పావులమ్మ తను పంపిన వీడియో క్యాసెట్‌లో ఆవేదన వ్యక్తం చేసింది.ఈ క్యాసెట్ వచ్చిన రెండు నెలల తర్వాత కువైట్ నుంచి ఒక యువతి పావులమ్మ హత్యకు గురైన విషయాన్ని ఆమె భర్త వెంకటరమణారెడ్డికి ఉత్తరం రాసింది. పావులమ్మను షేక్ హత్య చేసి దానిని ఆత్మహత్యగా చిత్రీకరించేందుకు అతని ఇంట్లోని ఒక గదిలోని ఫ్యాన్‌కు ఉరివేశాడని ఉత్తరం ద్వారా తెలియ

జేసింది. ఆ తర్వాతనే కువైట్ దేశ రాయబార కార్యాలయం నుంచి ఇక్కడి ఆమె బంధువులకు పావులమ్మ మరణం గురించి అధికారిక సమాచారం అందించింది.

సుమారు రెండువందల మందికి పైగా మన రాష్ట్రం, కేరళ, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలకు చెందిన యువతులు దుబాయిలోని వివిధ జైళ్లలో బందీలుగా వున్నట్లు విచారణలో వెల్లడైంది. మన రాష్ట్రానికి చెందిన దాదాపు నలభైమంది యువతులకు దుబాయ్ కోర్టులు వ్యభిచార నేరం కింద ఆరు నెలల నుంచి మూడు సంవత్సరాల వరకు జైలు శిక్షలు విధించినట్లు వెల్లడవుతోంది. ఇటీవల చిత్తూరు జిల్లకు చెందిన అయిదుగురు యువతులు మన రాష్ట్రానికి గల్ఫ్ నుంచి వెనుతిరిగి వచ్చారు. వీరితోపాటు కరీంనగర్, నెల్లూరు, కడప, అనంతపురం జిల్లాలకు చెందిన ఏడుగురు యువతులు దుబాయ్‌లోని వేశ్యాగృహం ముఠా చేతుల్లోంచి పోలీసులనుంచి తప్పించుకుని వచ్చారు. వీరికి మదనపల్లికి చెందిన 'వేకప్' సంస్థ ఆశ్రయం కల్పించింది. తప్పించుకొని వచ్చిన యువతులు పలు ఆసక్తికరమైన అంశాలను పోలీసుల విచారణలో వెల్లడించారు.

మదనపల్లి పట్టణం కృష్ణానగర్‌కు చెందిన కృష్ణమ్మ, ఆమె తమ్ముడు ఆనంద్, ఆమె అక్క రెడ్డమ్మ, వీరి స్నేహితులు కృష్ణమూర్తి, లక్ష్మీదేవి కలిసి ఉద్యోగం ఇప్పిస్తామని చెప్పి దుబాయ్ లోని వేశ్యాగృహానికి అమ్మేసినట్లు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఈ యువతులను ముమ్ముట్టి, మణిలాల్ అనే వ్యక్తులు దుబాయ్‌లో ఢిల్లీ దర్బార్ ఏరియాలోని సలాల్ హోటల్‌లో తమతో వ్యభిచారం చేయించినట్లు ఫిర్యాదులో తెలియజేశారు. ఇదిలా వుండగా ఉపాధి కోసం కువైట్ వెళ్లి అనుకోని పరిస్థితుల్లో ఈజిప్టులో చిక్కుకుపోయిన పులిమాల బేబి ఉదంతం మరొకటి బయటపడింది. కడప జిల్లా చిట్వేలి మండలం తిమ్మయ్యగారి పల్లెకు చెందిన పులిమాల బేబి ఉపాధి కోసం 1989లో కువైట్ వెళ్ళింది. వెళ్లిన ఏడాదికే గల్ఫ్ యుద్ధం సంభవించింది. పరిస్థితి అల్లకల్లోలంగా మారడంతో బేబి వెళ్లిన ఇంటి యజమానురాలు ఈజిప్టు దేశస్తురాలు కావడంతో వీసా, పాస్‌పోర్టు పోగొట్టుకున్న బేబి తన యజమానితో కైరో వెళ్లిపోయింది. ఆ తర్వాత ఏ ధృవీకరణ పత్రాలు లేకపోవడంతో ఇండియా రాలేకపోయింది. తన కష్టాల్ని వివరిస్తూ తల్లిదండ్రులకు ఉత్తరం రాయగా వారు అష్టకష్టాలు పడి ఎనిమిదేళ్ళ నిరీక్షణ తర్వాత మళ్లీ ఆమె ఇంటికి చేరింది. ఇలాగే ఎందరో యువతులను ఆదుకోవాలి. అండగా నిలవాల్సిన అవసరం వుంది.

### ఏలూరు వ్యవహారం

ఏలూరులో యువతులను వేలం వేసిన వ్యవహారాన్ని పరిశీలిస్తే 16 నుంచి 30 సంవత్సరాల వయసు కలిగిన యువతులను వివిధ ప్రాంతాలనుంచి తీసుకొచ్చి ఈ వేలం



పాటలు నిర్వహిస్తున్నట్లు, పది నుంచి పదమూడు వేల రూపాయల వరకు ఒక్కొక్క అమ్మాయి ధర పలుకుతున్నట్లు విచారణలో వెల్లడైంది. ఒక వేశ్యా గృహం యజమాని వేలం పాటలో కొనుగోలు చేసిన అమ్మాయిని ఏడాదిపాటు వారి దగ్గరే ఉండి వ్యభిచారం కొనసాగించి ఆ గడువు పూర్తయ్యాక మళ్లీ మొదటి యజమానికే అప్పగిస్తారు. నిడదవోలు, వేల్పూరు, తణుకు, తాడేపల్లిగూడెం కేంద్రాలలో అమ్మాయిల కొనుగోలు వేలంపాటలు జరిగినట్లు వార్తలు వచ్చాయి. ఈ విషయం అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ తీవ్ర సంచలనం సృష్టించింది. కృష్ణా, ఉభయగోదావరి జిల్లాల్లో వేశ్యాగృహాలు నిర్వహించే యజమానులను గుర్తించి వెంటనే అరెస్టు చేయాల్సిందిగా ఆదేశాలు జారీ అయ్యాయి. చివరికి ఈ వేలంపాటలపై పశ్చిమగోదావరి జిల్లా కలెక్టర్ స్వయంగా రంగంలోకి దిగి కేసును పరిశీలించారు. తాడేపల్లిగూడెంకు చెందిన రమణ అనే వ్యక్తి గత కొన్ని నెలల క్రితం ఏలూరు నుంచి నలుగురు యువతులను వ్యభిచార వృత్తిలో భాగంగా ముంబాయి పంపగా, అక్కడున్న వారు ఆ మహిళలకు డబ్బులివ్వకుండా వేధిస్తుంటే నలుగురు మహిళల్లో ఒకరు ఈ విషయాన్ని వివరిస్తూ ఉత్తరం రాశారు. ఆ లేఖ ఆధారంగావార్డు కౌన్సిలర్ కోలపల్లి ఉమాశంకర్ తదితరులు ముంబైకి వెళ్లి ఆ మహిళలను తీసుకువచ్చారు. రమణ ముంబైకి తీసుకువెళ్ళిన కె.మంగ, కె.కనక, కె.పద్మ, కె.జగన్మోహిని అక్కడ ఎదుర్కొన్న సమస్యలను చెప్పుకున్నారని, జగన్మోహిని ముంబై పోలీసుల సహకారంతో ఏలూరు చేరుకుందని, ఈ దగాకు కారణమైన రమణ నుంచి నష్టపరిహారంగా పదివేల రూపాయల జరిమానాను పెద్దల సమక్షంలో నిర్ణయించినట్లు విచారణలో తేలింది. ఇదిలా సాగుతుండగా తూర్పుగోదావరి జిల్లాలో మరొక సంఘటన గుప్పుమంది. మహారాష్ట్ర, గోవా ప్రాంతాలకు రాజమండ్రి, సామర్లకోట ప్రాంతాల నుంచి యువతులను సరఫరా చేస్తున్నారని వార్తలొచ్చాయి. ఇక బాలికల వ్యభిచారం విషయానికి వస్తే ఈ రకమైన చైల్డ్ ప్రాస్టిట్యూషన్ ప్రపంచవ్యాప్తంగా జరుగుతోంది. ఇలా ఏటా పది లక్షలమంది బాలికలు వ్యభిచారకూపంలోకి వెళ్లిపోతున్నారు. యూనిసెఫ్ నివేదిక ప్రకారం ఆసియా దేశాలలో పదిలక్షలకు పైగా బాలికలు ఈ వృత్తిలో వున్నారు. బ్రెజిల్‌లో సుమారు ఐదులక్షల మంది బాలికలు వ్యభిచారం చేస్తుండగా, పాకిస్తాన్‌లో 40వేల మంది, ఫిలిప్పీన్స్, థాయ్‌లాండ్‌లో రెండు లక్షలమంది, జర్మనీలో 50వేల మంది బాలికలు ఈ వృత్తిలో వున్నట్లు నివేదికలు తెలియజేస్తున్నాయి. అన్నెం పున్నెం ఎరుగని బాలికల శీలాలతో వ్యభిచారం చేస్తున్న దేశాలలో అమెరికా అగ్రస్థానంలో వుంది.

*29 ఫిబ్రవరి, 2000*
ఆంధ్రభూమి దినపత్రిక

## చీకటి వెనుక చితికి పోతున్న జీవితాలు

అభద్రత, అవమానం అదే వారి జీవితం. వారి శిథిల దేహాల్లో, శూన్య దృక్కుల్లో ఎప్పటికి వెలుగులు ప్రసరించేను? పుణ్య భూమిలో పూసిన కొన్ని పూలు ఈ చీకటి కోణాల్లో చిక్కి రోజూ నలిగిపోతుంటాయి. మళ్ళీ తెల్లారేపాటికి ముఖానికి చిరునవ్వుల రంగులు పులుముకొని ఆశగా ఎదురుచూస్తూ చీకటివెనకే తమ జీవితాల్ని సమాధి చేసుకుంటున్నాయి. దేశంలో వ్యభిచారిణులుగా మారుతున్నవారిలో దాదాపు 40శాతం మంది పద్దెనిమిదేళ్ళ వయసు కూడా రాకముందే ఈ వృత్తిలోకి దిగుతున్నారు. బాలికల వ్యభిచారంపై కేంద్ర సలహా సంఘం సమర్పించిన యాక్షన్ నివేదిక ఈ విషయం వెల్లడించింది.

ఆరు నగరాలలో వ్యభిచారం విచ్చలవిడిగా సాగుతోందని అందులో మొదటి స్థానంలో ముంబాయి, రెండవ స్థానంలో కలకత్తా, మూడవ స్థానంలో ఢిల్లీ, నాలుగో స్థానంలో చెన్నై, ఐదోస్థానంలో బెంగుళూరు, ఆరవ స్థానంలో హైదరాబాద్‌లు ఉన్నాయి. ఈ నగరాలలో 70వేల మంది నుంచి లక్ష మంది వరకూ పడుపు వృత్తిలో జీవనం సాగిస్తున్నారని నివేదిక పేర్కొంది. వేశ్యలలో 15శాతం మంది పదిహేనేళ్ళ లోపు వయసు వారని, 24.5 శాతం మంది పదహారు, పద్దెనిమిదేళ్ళ వయసులోపు వారని తెలిసింది. 44శాతం కేసుల్లో దుర్భర దారిద్ర్యమే ఈ వృత్తిలో దిగడానికి కారణమని, భర్త ఒదిలిపెట్టడం వలన 24.5 శాతం మంది, ఎవరితోనైనా మోసపోవడం వల్ల 11.9 శాతం మంది, వ్యభిచారులుగా మారినట్లు తేలింది.

అపహరణకుగురై ఆ తరువాత వ్యభిచార కూపంలోకి దిగబడిపోయిన వారు 2.25 శాతం మేరకు ఉన్నారు. తమకు తెలిసిన బాలికలు ఈ వృత్తిలోకి దిగి బాగా సంపాదిస్తూ, తమ కుటుంబాలకు కూడా డబ్బు పంపించడాన్ని గమనించి కొంతమంది బాలికలు పడుపు వృత్తిలోకి దిగుతున్నట్లు సర్వేలో వెల్లడైంది.

పెద్దపెద్ద నగరాల్లో ఉన్న వేశ్యలలో 86శాతం మంది ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడు, పశ్చిమబెంగాల్, మహరాష్ట్ర, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలవారే కావడం విశేషం. వేశ్యలలో 84.36శాతం మంది హిందువులు, 10.86శాతం మంది ముస్లింలు, 0.5శాతం మంది క్రిస్టియన్లు అని సర్వే వెల్లడించింది. సాంఘిక ఆచారాలు, కుటుంబ సంప్రదాయాల కారణంగా దేశంలో వ్యభిచారం కొనసాగుతోందని, దానిని అరికట్టడానికి తగిన చర్యలు చేపట్టాలని వ్యభిచారంపై ఏర్పాటైన కేంద్ర సలహా సంఘం కోరింది. సమ్మతించకపోయినా, సమ్మతించినా 16ఏళ్ళలోపు బాలికలతో లైంగిక కార్యకలాపాల్లో పాల్గొనడాన్ని అత్యాచారంగానే పరిగణించాల్సి ఉంటుందని, అలాంటి సందర్భాలలో దోషులకు యావజ్జీవ ఖైదు విధించవచ్చు. భారత్‌లో 94.6శాతం మంది మన దేశానికే చెందిన వేశ్యలుండగా, 2.6శాతం మంది నేపాలీలు, 2.7శాతం మంది బంగ్లాదేశీయులు వ్యభిచార వృత్తిలో వున్నారు. వ్యభిచారిణుల్లో కేవలం 1.6శాతం మంది మాత్రమే వివాహితులు కాగా మిగతావారు అవివాహితులు, విడాకులు పొందిన వారు, విడిపోయినవారు, వితంతువులు వున్నారు. వ్యభిచార వృత్తిని వదిలేయాలని 44శాతం మంది భావిస్తున్నారు. ప్రత్యామ్నాయం లేనందున ఈ వృత్తిలో కొనసాగుతున్నట్లు 3శాతం మంది స్పష్టం చేశారు. తమ పిల్లలు చదువుకోవాలని, తమకు దూరంగా ఉండి వారు బాగుపడాలని వేశ్యలు కోరుతున్నారు.

ఆర్థిక దుస్థితి వల్ల జీవించడానికి మరే ఇతర ప్రత్యామ్నాయం లేకపోవడం వలనే కొన్ని సందర్భాలలో సొంత కుటుంబ సభ్యులే తమ పిల్లలను వేశ్యా వృత్తిలోకి దింపుతున్నారు. ఈ వృత్తిలోకి దిగిన మహిళల్లో 65.6శాతం మందికి పిల్లలున్నారు. వ్యభిచారులుగా ఈ వృత్తిలోకి దిగిన మహిళలు కొంతకాలంవరకే ఆకట్టుకోగలుగుతారు. వయసు పైబడిన, అందం వాడిపోయిన, ఆరోగ్యం దెబ్బతిన్న వారి బతుకు దుర్భరంగా మారుతుంది. గత్యంతరం లేని అలాంటి పరిస్థితుల్లో మనసు చంపుకుని కన్న బిడ్డల్నే ఈ వృత్తిలోకి దింపాల్సి వస్తోంది. యువతులను, బాలికలను వ్యభిచార వృత్తిలోకి వెళ్ళకుండా నిరోధించేందుకు అలాంటి ప్రాంతాల్లో అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టాలని ప్రభుత్వం భావిస్తోంది. ప్రభుత్వేతర సంస్థలు, సాంఘిక సేవా కార్యకర్తలతో సలహా మండలిని కూడా ఏర్పాటు చేయాల్సి వుంది.

ఉద్యోగాలు ఇప్పిస్తామని, సినిమాలలో ఛాన్సులిప్పిస్తామని ప్రలోభపెట్టి యువతులను వ్యభిచార గృహాలకు తరలిస్తున్న ముఠాల కార్యకలాపాలకు ఎవరూ అడ్డుకట్ట వేయలేకపోతున్నారు. వ్యభిచార వృత్తిలోకి దిగిన యువతులను రక్షించి వారు గౌరవప్రదమైన జీవితం గడిపేందుకు వీలుగా పునరావాసం కల్పించాలని కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందిం చిన పథకాలు ఆచరణకు నోచుకోవడం లేదు.

తల్లిదండ్రులు లేక అనాథలై కొందరు, ఆర్థిక ఇబ్బందుల వలన కొందరు స్త్రీలు వ్యభిచార కూపంలో చిక్కుకుపోతున్నారు. వెయ్యి, ఐదొందల రూపాయల కోసం కూడా స్త్రీలను వ్యభిచార గృహాలకు అమ్మిన సందర్భాలు అనేకం వున్నాయి. వ్యభిచార వృత్తి నుంచి స్త్రీలను కాపాడి స్వగ్రామాలకు తరలించాలని, వారికి ట్రైసమ్ పథకం కింద స్వయంఉపాధి శిక్షణ ఇవ్వాలన్న కేంద్ర గ్రామాభివృద్ధి శాఖ సూచనలను రాష్ట్ర ప్రభుత్వం సక్రమంగా అమలు చేయడం లేదు. వ్యభిచార వృత్తి వదిలిపెట్టిన స్త్రీలకు ఐ.ఆర్.డి.పి. కింద రుణాలు ఇవ్వాలనే ప్రతిపాదన కూడా వుంది. ఈ పథకాల ప్రకారం సాయం పొందేందుకు కొంత మంది స్త్రీలు పోలీసు అధికారుల నుంచి, సాంఘిక సంక్షేమ శాఖ నుంచి గుర్తింపు పత్రాలు పొందినా ఎలాంటి ప్రయోజనం

కనపడకపోవడంతో మళ్ళీ వ్యభిచారాన్నే ఆశ్రయిస్తున్నారు. వ్యభిచారిణుల పిల్లలను రెసిడెన్షియల్ స్కూళ్ళలో చేర్పించాలని, తండ్రి పేరుతో కాకుండా తల్లి పేరుతో ఆ పిల్లలను చేర్చుకోవాల్సి వుంది. చట్టాల అమలు, వ్యభిచారిణులకు పునరావాసం, వారి పిల్లలకు తగిన సౌకర్యాలను పర్యవేక్షించేందుకు సమన్వయ సంఘాలను నెలకొల్పాలని, రాష్ట్రాల ప్రధాన కార్యదర్శుల నేతృత్వంలో ఇలాంటి సంఘాలను ఏర్పరచాలనే ప్రతిపాదనలు వున్నాయి. పడుపు రొంపినుంచి బయటపడ్డ మహిళలకు పునరావాసం కల్పించడంలో భాగంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గడిచిన 30 ఏళ్ళుగా రిమాండ్ హోమ్స్ నిర్వహిస్తున్నాయి.

ఈ రిమాండ్ హోమ్స్‌లో బుట్టల అల్లిక, కొవ్వొత్తుల తయారీ వంటి కార్యకలాపాల్లో శిక్షణ ఇచ్చి ఉపాధి కల్పిస్తున్నారు. ఈ కేంద్రాల్లో వయసులో వున్నవారికే అవకాశాలు కల్పిస్తూ నలభై ఏళ్ళు దాటిన స్త్రీలకు ప్రవేశం కల్పించడం లేదు. పడుపు వృత్తిలోనూ డిమాండ్, సరఫరా సిద్ధాంతం పనిచేస్తుందని జాతీయ మహిళా కమిషన్ పేర్కొంది. భృతి కోసం కుటుంబానికి దూరంగా వెళ్ళి బతికే కార్మికులు వేశ్యా వృత్తికి పోషకులుగా వ్యవహరిస్తున్నారు. యుక్త వయసుగల అవివాహిత యువకులు ఈ వృత్తిని పోషిస్తున్నవారు కావడం విశేషం.

ఈ కామకూపం నుంచి బయటపడిన వేశ్యల పట్ల సమాజం దృష్టి మారదని తెలియజేసే సంఘటనను మహిళా కమిషన్ చైర్‌పర్సన్ తన నివేదిక పరిచయ అధ్యాయంలో వివరించారు. "చాలా కాలం కిందటి విషయం. ఓ అమ్మాయిని పడుపు వృత్తినుంచి కాపాడి మా ఇంట్లో పనికి పెట్టుకున్నాను. ఆ అమ్మాయి ఇంటి పని చూసుకుంటూ కులాసాగా వుండేది. ఒకరోజు కూరగాయల వ్యాపారి ఒకడు ఆ అమ్మాయి ఫలానా చోటునుంచి వచ్చిందని గుర్తుపట్టేశాడు. నాటి నుంచి దాని జీవనం నరకమై, చివరికి మా ఇల్లు విడిచి వెళ్ళిపోయింది. ఇలాంటి సంఘటనలు ఎన్నో...!" అని తన పరిచయ అధ్యాయంలో పేర్కొన్నారు.

1958లో సప్రెషన్ ఆఫ్ ఇమ్మోరల్ ట్రాఫిక్ ఇన్ ఉమెన్ అండ్ గర్ల్ (వ్యభిచార నిరోధక చట్టం)ను మొదట చేసిన తరువాత మరిన్ని సమస్యలను పరిష్కరించేందుకు ఈ చట్టాన్నే 1986లో ఇమ్మోరల్ ట్రాఫిక్ ఇన్ పర్సన్ ఆక్ట్‌గా విస్తృతం చేశారు.

మరో ముఖ్య విషయం ఏమిటంటే వ్యభిచారాన్ని చట్టం ఎక్కడా నిషేధించలేదు. వ్యభిచారాన్ని పూర్తిగా రూపుమాపడం కాకుండా దాని వ్యాప్తిని నిరోధించాలన్నదే ఈ చట్టం ప్రధాన ఉద్దేశ్యం. నియమిత నిబంధనలకు లోబడి, ప్రత్యేకమైన పరిస్థితుల్లో దీనిని అనుమతించారు. దీని వ్యాప్తిని నిరోధించడంలో స్వచ్ఛంద సంస్థల పాత్ర కూడా ఎంతో ఉంది. ముంబాయిలోని ప్రముఖ వ్యభిచార కేంద్రం కామటిపుర మున్సిపల్ స్కూలు ఆవరణలో 1986లో ప్రీతిపట్కర్ అనే మహిళ 'ప్రేరణ' అనే స్వచ్ఛంద సంస్థను ప్రారంభించారు. వారి



ఉపాధి కోసం కృషి చేస్తున్నారు. మన రాష్ట్రంలో తెలంగాణ ప్రాంతంలో జోగినీ వ్యవస్థను తుదముట్టించటం కోసం 'సంస్కార్' అనే స్వచ్ఛంద సేవా సంస్థ ఆధ్వర్యంలో చెల్లి నిలయాన్ని నిజామాబాద్ జిల్లా వర్ని మండలంలో ఏర్పరిచారు. దేవతల పేరుతో ఆడవారిని జోగినీలుగా మార్చి హింసించే దురాచారాన్ని నిర్మూలించడానికిమరిన్ని స్వచ్ఛంద సంస్థలు రాష్ట్రంలో ఏర్పడాల్సిన అవసరం వుంది. వ్యభిచారాన్ని తప్పుపట్టే కంటే ఏఏ పరిస్థితులలో వాళ్ళు ఇలా దిగజారిపోయారో తెలుసుకోవడం ముఖ్యం. వారూ మనుషులేనని వారికి మనసుందని గుర్తించాలి. వారికి ఉపాధి కల్పించి ఆదుకోవడమే అందరి కర్తవ్యం కావాలి. వారిని తోటి మనుషులుగా గౌరవించాలి. ఇతర పౌరులతో సమానంగా వేశ్యల హక్కులనూ గుర్తించాలి. ఇప్పుడు కావలసింది మరిన్ని శాసనాలు కాదు. మరిన్ని సంస్కరణలు. కాదంటారా?

*1 మార్చి, 2000*
*ఆంధ్రభూమి దినపత్రిక*

## తానొక కురుపై... పరులకు పరుపై...
## నడిచే గాయాలుగా మారిన వ్యభిచారులు

'పడుపు వృత్తి' ప్రపంచంలో కెల్లా అతి పురాతనమైన వృత్తి. అది ఎప్పుడు మొదలైయిందో ఎలా విస్తరించిందో చెప్పడం సాధ్యం కాదు. అయితే ఒక అంచనా ప్రకారం ప్రాచీన కాలంలో దేవాలయ ప్రాంగణాలలో నృత్యం చేస్తూ జీవించేవారే నృత్య ప్రక్రియ అంతరించడంతో క్రమక్రమంగా వేశ్యలుగా మారారని- కాలక్రమంలో కొందరు రాజులకు, సుల్తానులకు ఈ పడుపువృత్తి నచ్చక నిషేధం విధించారని చెబుతుంటారు.

అల్లావుద్దీన్ అప్పటి వేశ్యల సంఖ్యను చూసి ఎంతో బాధపడి వేశ్యా వృత్తిని నిషేధిస్తూ శాసనం చేశాడు. వేశ్యలకు నిర్ణీత వ్యవధి ఇచ్చి అప్పటిలోగా పెళ్లి చేసుకుని తీరాలని ఆజ్ఞలు జారీచేశాడు. అల్లావుద్దీన్ తర్వాత అక్బర్ వరకు వచ్చిన రాజులెవ్వరూ ఈ విషయంపై శ్రద్ధ చూపలేదు. అక్బర్ వేశ్యలను సమాజంనుంచి విడదీయదలచి ఊరు చివర వారికి ప్రత్యేకంగా కొంత స్థలం కేటాయించి దానికి 'సైతాన్‌పూర్' అని పేరుపెట్టాడు. ఆ ప్రాంతంలోని వేశ్యల వ్యాపార వ్యవహారాల తనిఖీకి 'దరోగా' పేరుతో పోలీస్ అధికారిని నియమించాడు. వేశ్యల దగ్గరకి వెళ్ళేవారు 'సుంకం' చెల్లించేవారు. వేశ్యాకన్యలను కోరుకునేవారు సుల్తాన్ నుంచి ప్రత్యేక అనుమతి పొందవలసి వుండేది.

ఆ నియమనిబంధనలను వ్యతిరేకించిన అపరాధులకు శిక్షలు కఠినంగా వుండేవి. వేశ్యల్లో సీనియర్లను అక్బరే స్వయంగా విచారించి- వారి పతనానికి కారణమైన ధనవంతులను కఠినంగా శిక్షించేవాడు. ఆ చర్యల వల్ల కొత్తగా ఎవరూ 'వేశ్య'గా మారే అవకాశం లేకుండా పోయింది. ఆ విధంగా అక్బర్ కాలంలో ఈ పడుపు వృత్తి చాలా వరకు తగ్గిపోయింది. అక్బర్ కాలంలో వచ్చిన విదేశీయాత్రికుడు టవర్నియర్ తన రచనల్లో కొత్తగా వేశ్యలు కాదలుచుకున్నవారు ప్రభుత్వానుమతిని పొందవలసి వుండేదని- సైతాన్‌పూర్‌లో 20వేల మంది వేశ్యలు వున్నట్టు పేర్కొన్నాడు.

చరిత్రను వదిలేసి ప్రస్తుత పరిస్థితుల్లోకి వస్తే వ్యభిచరించడానికి కారణం ఎక్కువగా పరిస్థితుల ప్రభావమేనని చెప్పవచ్చు. యువతులను అపహరించో, ఉద్యోగాలిప్పిస్తామని, సినిమాల్లోఛాన్స్ ఇప్పిస్తామని ప్రలోభపెట్టి, ప్రేమపేరుతో మోసంచేసో, అమ్మాయిల అమ్మకం ద్వారానో, బెదిరించో పడుపు వృత్తిలోకి దించుతుంటారు. ఆసియాఖండంలోని ఎనిమిది దేశాల్లో సుమారు 10లక్షల మంది ఆడపిల్లలు వ్యభిచార వృత్తిలో వున్నారు. ఈ విషయంలో 'ఇండియా'దే అగ్రస్థానం. మన దేశంలో సుమారు మూడులక్షలకు పైగానే బాలికలు ఈ



రొంపిలో కూరుకుపోయారు. తైవాన్, థాయ్‌లాండ్‌లలో లక్షమంది చొప్పున వ్యభిచార వృత్తిలో వున్నారు.

రాత్రికి రాత్రే ధనవంతులై స్వర్గసుఖాల్లో మునిగితేలాలన్న దురాశతో తమ కడుపుపంటను కన్నవారే వ్యభిచార కూపంలోకి నెట్టివేస్తున్న దురాచారం థాయ్‌లాండ్‌లో విశృంఖలంగా రాజ్యమేలుతోంది. ఆరుకోట్ల జనాభా వున్న థాయ్‌లాండ్‌లో వేశ్యల సంఖ్య 20లక్షలు. అంటే అక్కడి పరిస్థితి ఎంత దారుణంగా వుందో అర్థమవుతుంది. విలాసాల కోసం స్వయంగా తల్లిదండ్రులే తమ సంతానాన్ని వేశ్యలుగా మారుస్తుండడం ఎక్కువవుతోంది.

మరికొందరు తల్లిదండ్రులు పనిచేసి కుటుంబాన్ని ఆదుకొమ్మని మాయమాటలు చెప్పి తమ సంతానాన్ని బలవంతంగా వేశ్యాగృహాలకు అమ్మివేస్తున్నారు. అక్కడ పది, పదకొండేళ్ళ వయసు రాగానే చిన్నారులను కన్నవారే పనిపేరిట పడుపువృత్తిలోకి దింపటంతో మాట వినని పసికూనలను బెల్టులు, దుడ్డుకర్రలతో ఒళ్ళు చితకబాది విటులు తమ దారికి తెచ్చుకుంటున్నారు. 1991 నోబెల్ బహుమతి పొందిన బర్మాకు చెందిన అంగ్‌శాన్ సుకీ్య ఆ బహుమతి ద్వారా తనకు లభించిన మొత్తం (మిలియన్ డాలర్లు)ను థాయ్‌లాండ్‌లో వ్యభిచార వృత్తి నిర్మూలనకే అప్పగించారు. అయినా ఫలితం లేదు.

### కామాంధపురా

మానవ సమాజ నీతి ప్రకారం వ్యభిచారం నేరం. అది అనాది వృత్తి కూడా. ఆధునిక నాగరికత వ్యాపించేదాకా వేశ్యావృత్తి కులవృత్తిగా వుండేది. ఆసియా ఖండంలోనే అత్యంత పురాతన వేశ్యావాటిక ముంబాయిలోని కామాటిపురా. మొత్తం 14 వీధులుండే అక్కడ దాదాపు ఎనిమిదివేల మంది వేశ్యా వృత్తిలో జీవిస్తున్నారు. ఒక కోటికిపైగా జనాభా వున్న ముంబాయి మహానగరంలో దాదాపు ఒక లక్షా యాభైవేల మంది వేశ్యలున్నారని, వారిలో ప్రతి మూడో వేశ్యకూ 'ఎయిడ్స్' సోకిందని అంచనా.

ప్రతి రోజూ దాదాపు ఐదులక్షల మంది విటులు వీరితో లైంగిక సంపర్కం పెట్టుకోవడం మూలంగా వారికీ 'ఎయిడ్స్' సంక్రమించే పరిస్థితి ఏర్పడింది. ముంబాయి మహానగరంలో పోనాపూర్, బంధూస్ మొదలైన ప్రాంతాలలో సుమారు 800 మంది యువతులను ఈ వేశ్యా వృత్తి నుంచి 1990లో తమిళనాడు పోలీసులు రక్షించడం జరిగింది.

అయితే 1992 నాటికే రెట్టింపు సంఖ్యలో మళ్ళీ ఈ వృత్తిలోకి దింపబడ్డారు. కామాటిపురా చుట్టూ నాలుగు కిలోమీటర్లు విస్తరించిన వేశ్యా వాటికల్లో తెల్లవారింది మొదలు ఇరుకైన పడక గదుల ముందు నిల్చుని విటుల కోసం ఎదురు చూస్తూ వుంటారు. ఒక్కొక్క వేశ్యా నెలకు నలభైవేల రూపాయల నుంచి అరవైవేల వరకూ సంపాదిస్తుంది. ఢిల్లీలో పదివేల నుంచి

పన్నెండు వేల వరకూ వేశ్యలు వుంటే, కలకత్తాలో యాభైవేల నుంచి అరవైవేల వరకూ, చెన్నైలో ముప్పై వేల నుంచి యాభైవేల వరకు, హైదరాబాద్‌లో నాలుగువేల మందికి పైగానే వేశ్యలున్నట్టు అంచనా వేశారు. ఒకప్పుడు దక్షిణ ముంబాయిలోని 'కొలాబో' ప్రాంతం మాత్రమే రెడ్‌లైట్ ఏరియాగా పిలవబడేది. కానీ ఇప్పుడు విస్తృతంగా విస్తరించి పోయాయి ఈ రెడ్‌లైట్ ఏరియాలు. ప్రపంచంలోకెల్లా అతిపెద్ద రెడ్‌లైట్ ఏరియాగా పేరుగాంచిన 'కామాటిపురా' తర్వాతనే హేంబర్గ్, అమర్‌స్టర్‌డామ్, బాంగ్‌కాక్‌లు వస్తాయి.

### దేవుని పేరుతో వ్యభిచారం

తెలంగాణా జిల్లాల్లో వున్న దురాచారం జోగినీ దురాచారం. సాటి మనిషిని మానవత్వంతో పైకి తీసుకురావాల్సింది పోయి మూఢాచారపు రొంపి నుంచి బయటపడనీయకుండా కొంత మంది స్వార్థపరులు ఈ సాంఘిక దురాచారాన్ని పెంచి పోషించారు. నిజాం పాలనలో మొగ్గతొడిగిన జోగినీ దురాచారం ఈనాటి సమాజంలో వ్రేళ్ళు పాతుకుపోయిన మహావృక్షంలా విస్తరించింది. ఎందరో అమాయక స్త్రీల పట్ల శాపంగా మారింది.

వీరి జీవితాలే అంధకారమనుకుంటే వీరు జన్మనిచ్చిన బిడ్డల జీవితాలు మరీ శాపగ్రస్తంగా తయారయ్యాయి. ఈ సమస్య మన రాష్ట్రానికే పరిమితమై లేదు. అన్ని మారుమూల రాష్ట్రాలలో రాజ్యమేలుతోంది. ఇండియన్ హెల్త్ ఆర్గనైజేషన్ వారి సర్వే ప్రకారం కేవలం ఒక్క కర్ణాటక ప్రాంతంలోనే 3వేలకు పైగా దేవదాసీలు వున్నట్లు తేలింది. దేవుని పేరిట వ్యభిచారిణులుగా మార్చబడిన వారు దేశవ్యాప్తంగా 50వేల మందికి పైగానే వుంటారన్నది అంచనా.

"ప్రివెన్షన్ ఆఫ్ ఇమ్మోరల్ ట్రాఫిక్ ఆక్ట్" (1987) వంటి ఎన్ని చట్టాలు వున్నా ఈ దారుణాలను అరికట్టలేకపోతున్నాయి. అప్పుడప్పుడు దాడులు జరిగినా మళ్లీ యథావిధిగా వేలాదిమంది ఎల్లమ్మలకు, గంగమ్మలకు, మారమ్మలకు దేవుని పేరిట వ్యభిచారిణులుగా మార్చబడుతూనే వున్నారు. చివరకు అనేక రోగాలతో కృంగి కృశించి పోతున్నారు.

### ఏ దేశమేగినా ఇదే వరస

మన నాగరికత సమాజానికి నిదర్శనంగా మీరు ఏ దేశం పేరైనా చెప్పండి అక్కడా బాలికల వ్యభిచారం (చైల్డ్ ప్రాస్టిట్యూషన్) జరుగుతోంది. ఈ విధంగా ఏటా పది లక్షల మంది బాలికలు వ్యభిచార కూపంలోకి వెళ్లిపోతున్నారు. అన్నెం పున్నెం తెలియని అమాయక బాలికల శీలాలతో యథేచ్ఛగా వ్యాపారం సాగిస్తున్న దేశాలలో అమెరికా అగ్రస్థానంలో వుంది. యునిసెఫ్ నివేదిక ప్రకారం ఆసియా దేశాలలో 10 లక్షలకు పైగా బాలికలు ఈ వృత్తిలో వున్నారు. బ్రెజిల్‌లో సుమారు ఐదు లక్షల మంది బాలికలు వ్యభిచారం చేస్తుండగా, పాకిస్తాన్‌లో 40 వేలమంది, ఫిలిప్పీన్స్, థాయ్‌లాండ్‌లలో రెండు లక్షల మంది, జర్మనీలో 50



వేల మంది బాలికలు ఈ రంగంలో వున్నట్టు నివేదికలు తెలియజేస్తున్నాయి. ఏదేమైనా ఈ రొంపిలోకి ఒకసారి దిగారంటే మరింక వారు బయట పడడమనేది కలలో మాట. ఇండియన్ రెడ్‌లైట్ ఏరియాల్లో దాదాపు మూడు లక్షల మంది బాలికలు వున్నారు.

### 'ఎయిడ్స్'కి భయపడి

ఎయిడ్స్ వ్యాధి విదేశాల్లో ఎక్కువగా వుండడం చేత భయంతో విదేశీ వ్యక్తులను తిరస్కరించడం ఈ మధ్య కాలంలో ఎక్కువయింది. ఢిల్లీలోని గారిసన్ బాస్టియన్ రోడ్‌లోని వ్యభిచారిణులు తమ వద్దకు యూరోపియన్లు, అరబ్బులు, ఆఫ్రికన్లు, పాకిస్తానీయులు, ఆఫ్ఘనులతో సహా విదేశీయులెవ్వరినీ ఈ ప్రాంతంలోకి రానివ్వకుండా కట్టడి చేశారు.

కొంత మంది సంఘ సేవకులు ఎయిడ్స్ వ్యాధి గురించి ప్రచారం చేసినందు వల్ల వారీ నిర్ణయం తీసుకున్నారు. మన దేశంలోని వేశ్యలు తమ దగ్గరికి వచ్చే వారిని కండోమ్‌లు ధరించమని వత్తిడి చేయడం, విదేశీయులను అసలు దరి చేరనివ్వకపోవడంతో మాజీ సోవియట్‌కు చెందిన వ్యభిచారిణులకు గిరాకీ పెరిగింది. దేశంలోని వ్యభిచారిణుల ప్రతినిధులు గత సంవత్సరం ఢిల్లీలో సమావేశమై విదేశీయులను తిరస్కరించాలని తీర్మానించారు. దేశ వ్యాప్తంగా 25 లక్షల వ్యభిచారిణులు వున్నారని అంచనా.

### 'చట్టాల' మాటేమిటి?

1958లో "సప్రెషన్ ఆఫ్ ఇమ్మోరల్ ట్రాఫిక్ ఇన్ ఉమెన్ అండ్ గర్ల్స్" (వ్యభిచార నిరోధక చట్టం)ను మొదట చేసిన తర్వాత మరిన్ని సమస్యలను పరిష్కరించేందుకు ఈ చట్టాన్నే 1986లో "ఇమ్మోరల్ ట్రాఫిక్ ఇన్ పర్సన్స్ ఆక్ట్‌గా విస్తృతం చేశారు. మరో ముఖ్య విషయం ఏమిటంటే వ్యభిచారాన్ని చట్టంఎక్కడా నిషేధించలేదు. వ్యభిచారాన్ని పూర్తిగా రూపుమాపడం కాకుండా దాని వ్యాప్తిని నిరోధించాలన్నదే ఈ చట్టాల ప్రధాన ఉద్దేశం.

నియమిత నిబంధనలకు లోబడి, ప్రత్యేక పరిస్థితుల్లో దీనిని అనుమతించారు. దీని ప్రకారంగానే కొన్ని రాష్ట్రాలలో వ్యభిచారులకు లైసెన్సులు ఇస్తున్నారు. లైసెన్సులలో తెలియజేసిన స్థలాలలో, తెలియబరిచిన నిబంధనలకు అనుగుణంగా వ్యభిచరిస్తే నేరం కాదు. అయితే బహిరంగ స్థలాలను కఠినంగా నిషేధించారు. 18 సంవత్సరాలు నిండిన యువతి తన భవిష్యత్‌ను నిర్ణయించుకుని ఈ వృత్తిలోకి ప్రవేశించాలంటే లైసెన్స్ నిబంధనలకు లోబడి 'పని' చేసుకోవచ్చు. ప్రభుత్వ నోటిఫికేషన్‌లో పేర్కొన్న నిషిద్ధ ప్రాంతాల్లో కాకుండా వాటికి దూరంగా (దాదాపు 200 గజాలు) జరిగే వ్యభిచార కార్యకలాపాలను చట్టం అంగీకరిస్తుంది.

వ్యభిచార వృత్తి నుంచి స్త్రీలను కాపాడి స్వగ్రామాలకు తరలించాలని, వారికి 'బ్రెసమ్'

పథకం కింద స్వయం ఉపాధి శిక్షణ ఇవ్వాలన్న కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ సూచనలను రాష్ట్ర ప్రభుత్వాలు సక్రమంగా అమలు చేయడం లేదు. వ్యభిచార వృత్తిని వదిలిపెట్టిన స్త్రీలకు ఐ.ఆర్.డి.పి. కింద రుణాలు ఇవ్వాలన్న ప్రతిపాదన కూడా వుంది.

ఈ పథకాల ప్రకారం సాయం పొందేందుకు కొంత మంది స్త్రీలు పోలీసు అధికారుల నుంచి, సాంఘిక సంక్షేమ శాఖ నుంచి గుర్తింపు పత్రాలను పొందినా ఎలాంటి ప్రయోజనం కలగక పోవడంతో వారు మళ్లీ వ్యభిచారాన్నే ఆశ్రయిస్తున్నారు. ఇతర పౌరులతో సమానంగా వేశ్యల హక్కులను గుర్తించాలి. వారూ మనుషులేనన్న భావం రూపొందాలి.

వ్యభిచారాన్ని తప్పుపట్టేకంటే ఏఏ పరిస్థితుల్లో వాళ్ళు ఎలా దిగజారిపోయారో తెలుసుకోవడం ముఖ్యం. చట్టాలు కేవలం వారిని భయపెట్టడానికి శిక్షించడానికే వున్నాయి. అటువంటి వాళ్లను ఆదుకోవడమే అందరి కర్తవ్యం కావాలి. 'వ్యభిచారం'పై సమరం సాగించాల్సిన తరుణం ఆసన్నమైంది.

*20 ఆగస్టు, 1995*

*ఆంధ్రజ్యోతి ఆదివారం*



## భక్తి ముసుగులో... బూతు డ్యాన్సులు

జాతరలు, తిరునాళ్ళు భక్తికి, బూతు డాన్సులకి అనుసంధానంగా మారుతున్నాయి. మొక్కుబడులు చెల్లించుకోవడానికీ, ఇష్టదైవాన్ని కొలవడానికి భక్తి భావంతో వచ్చే జనానికి ఈ బూతు డాన్సులు న్యూసెన్స్‌గా మారాయి. విధిలేక, ఆ పూట గడిచే ఆర్థిక స్తోమత లేక ఇలాంటి రికార్డింగ్ డాన్సులకి సిద్ధపడే డాన్సర్లది ఓ దయనీయ కథ... పది మంది కలిసే ఇలాంటి పవిత్ర సందర్భాలలో- బలహీనతలని సొమ్ము చేసుకుంటున్న నిర్వాహకులు ఆడించిందే ఆటగా సాగుతోంది. భక్తి కాస్తా కనుమరుగైపోయి తిరునాళ్ళంటే రికార్డింగ్ డ్యాన్సులే అన్నంతగా దిగజారాయి.జాతర్లకి, తిరునాళ్ళకి ఒకప్పుడు పౌరాణిక నాటకాలు ప్రదర్శించేవారు. బుర్రకథలు, హరికథలు చెప్పించేవారు. రానురాను ఇవన్నీ తెరవెనుకకి వెళ్ళిపోయాయి. రికార్డింగ్ డాన్సులు మాత్రమే మిగిలాయి. డ్యాన్సర్లు ఎన్టీయార్‌లాగా, ఎయెన్నార్‌లాగా, కృష్ణలాగా, చిరంజీవిలాగా, ప్రసిద్ధ హీరోల అవతారాలు ఎత్తుతారు. ప్రేక్షకులకు సాక్షాత్తూ తమ అభిమాన హీరోలు కళ్ల ముందు ఆడి పాడుతున్న ఫీలింగ్‌ను ఇస్తారు. బహుశా అందుకే రికార్డింగ్ డ్యాన్స్ అంటే అంత క్రేజ్!

### బావలు సయ్యా...!

ఈ హీరోల పక్కన హీరోయిన్లూ వుంటారు. వీరికి మాత్రం ఫలానా శ్రీదేవిలాగా, ఫలానా విజయశాంతిలాగా కనిపించాల్సిన అవసరం లేదు. ఫలానా సౌందర్యనో, ఫలానా రమ్యకృష్ణనో గుర్తుకు తేవాల్సిన అగత్యమూ లేదు. వీరు రాత్రయ్యే కొద్దీ తమను తాము మరిచిపోవాలి. అందాల ఆడబొమ్మలై శరీరాన్ని వీలైనంతగా ప్రదర్శించాలి. అప్పుడు 'బావలు సయ్యా...' లాంటి రికార్డులకి కుర్రకారంతా సైసై అంటూ గాల్లో తేలిపోతారు. మళ్లీ మళ్లీ వన్స్‌మోర్‌లు కొడతారు. డ్యాన్స్‌ను మెచ్చి రూపాయనోట్లు గుచ్చే 'కళాపోసకులూ', అలుసుగా తీసుకుని చెయ్యేసే కామాతురులూ కూడా వుంటారు. రికార్డింగ్ డ్యాన్స్ అన్న తర్వాత ఈ న్యూసెన్స్ అంతా వుంటుంది. చాలా కాలంగా కృష్ణా, గుంటూరు, ఉభయగోదారుల్లో రికార్డింగ్ డ్యాన్సులు నిరాటంకంగా సాగుతూనే వున్నాయి. (గోదావరి జిల్లాల్లో రికార్డింగ్ డ్యాన్సుల కల్చర్ గురించి ఒక సినిమా కూడా వచ్చింది) ఈమధ్య కాలంలో రాయలసీమలోకి ఈ రికార్డింగ్ డ్యాన్సుల కల్చర్ ప్రవేశించింది. కడప జిల్లా లక్కిరెడ్డిపల్లి గంగమ్మ జాతరలోనూ, రాయవరం నాగారపమ్మ జాతరలోనూ రికార్డింగ్ డ్యాన్సుల ముసుగులో భక్తికి బదులు రక్తి పొంగిపొర్లుతోంది. ఎంత చెడ్డా రికార్డింగ్ డ్యాన్సులు కూడా కొంత హద్దుల్లోనే వుండేవి. ప్రస్తుతం రాయలసీమలో రికార్డింగ్ డ్యాన్సుల పేరుతో నడుస్తున్న బూతు డ్యాన్సులలో హీరోలకు ప్రాధాన్యమే లేకుండా పోయింది. రాత్రయ్యే కొద్దీ ఆడ డ్యాన్సర్లు వొంటి మీద దుస్తుల్ని జారవిడుచుకుంటూపోయే ఈ పచ్చిడ్యాన్సుల ముందు సంప్రదాయరికార్డింగ్ డ్యాన్సులే చిన్నబోతాయి.

## గొడవలే గొడవలు

మొక్కుబడులబండ్ల వెంట ఏర్పాటు చేస్తున్న రికార్డు డ్యాన్సులు(?) పోనుపోను శృతిమించిపోతూ అశ్లీలానికి పరాకాష్టగా మారుతున్నాయి. మరోవైపు తాగుబోతులతో జులాయిలతో డ్యాన్సర్లకీ, ప్రజలకీ కూడా ఇబ్బందులు వస్తున్నాయి. ఈ మధ్య రాష్ట్రవ్యాపితంగా జరిగిన జాతర్లలోనూ, తిరునాళ్లలోనూ ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడ్డాయి. గొడవలూ జరిగాయి. ప్రకాశం జిల్లాలోని గుంటి గంగమ్మ తిరుణాళ్లు, యరజర్ల, రామతీర్థం, గుమ్మలంపాడు, తోటవారిపాలెంలలో ఈ డ్యాన్సులు ప్రభుత్వానికి తలనొప్పి తెచ్చాయి. గుంటూరు జిల్లాలో డ్యాన్సుల్ని అడ్డుకున్న పోలీసులపై గ్రామస్తులు దౌర్జన్యానికి దిగిన సంఘటన, ముఖ్యమంత్రి జోక్యం చేసుకోవటం వరకూ వెళ్లింది. కొన్ని చోట్ల నిర్వాహకులు పోలీసులకు లంచాలు ఇచ్చి తమ దారికి తెచ్చుకుంటున్నారనీ, మరి కొన్ని చోట్ల పోలీసులు కూడా డ్యాన్సులను ఎంజాయ్ చేస్తూ గుడ్లప్పగించి చూస్తున్నారని విమర్శలు వున్నాయి.

## వేసిన స్టెప్పే వేసి...

రికార్డింగ్ డ్యాన్సర్లు ఒక్కో సినిమాను పదిసార్లు, ఇరవై సార్లు కూడా చూడాల్సి వస్తుంది. పాటలన్నింటినీ జాగ్రత్తగా పరిశీలిస్తూ హీరోయిన్లు వేసిన స్టెప్పులనే యథాతథంగా వేయడానికి రాత్రింబగళ్ళు ప్రాక్టీసు చేస్తారు. అర్ధరాత్రయినా, అపరాత్రయినా ఏ పాటకు ఆ స్టెప్పులే పడతాయంటే ప్రాక్టీసే దానికి కారణం. అయితే సినిమాల్లో ఒక్కో పాటను చిత్రీకరించడానికి వారం నుంచి నెల రోజుల వరకూ తీసుకుంటారు. కానీ రికార్డింగ్ డ్యాన్సర్లు ఐదు పది నిముషాల్లో సినిమాలో కనిపించినట్టుగా ఏకబిగిన స్పీడ్‌గా డ్యాన్సు వేయాల్సి వస్తుంది. పేక్షకుల్లో ఎవరైనా ఒకరు విజిల్ వేసి 'వన్స్‌మోర్' అన్నారా... మళ్లీ అదే పాట. మళ్లీ అదే స్టెప్పులు తప్పవు. ఈ శ్రమ కాకుండా, అనేక రకాల డ్రెస్సులు, మేకప్ సామగ్రి కొనుక్కోవాలి. ఉదాహరణకి- వేటగాడులో ఎన్టీయార్ అనగానే సూటు, బూటు, భుజాన తుపాకిలాంటి సరంజమా అంతా అవసరమవుతుంది.

ఇక లేడీ డ్యాన్సర్లు శరీరాన్ని ప్రదర్శించటానికి మాత్రమే పనికొచ్చే అనేక రకాల మోడ్రన్ డ్రస్సులతో సిద్ధంగా వుండాలి. సినిమాల్లో హీరోయిన్లు ఒక్క పాటలో పది డ్రస్సులు మార్చగలుగుతారు. ఈ డ్యాన్సర్లు ఒక్కోపాటకి ఒక్కోడ్రెస్ అయినా మార్చే ప్రయత్నం చేస్తారు. ఇంత చేస్తున్నా ఈ రికార్డింగ్ డ్యాన్స్ ట్రూపుకి అందేది కేవలం మూడు నుంచి ఆరువేల రూపాయలు మాత్రమే. రాత్రంతా ఆడినందుకు వారికి దక్కే ప్రతిఫలం అది. నలుగురు మహిళలు, ఇద్దరు మగవాళ్లు ఒక చాందినీ బండిలో వున్నారనుకుంటే, వారికయ్యే భోజన ఖర్చులు, ఛార్జీలు పోను ఆ మొత్తం వారికి అందుతుంది. ఈ ఇతర ఖర్చుల్ని నిర్వాహకులే భరిస్తారు. వచ్చిన డబ్బును అందరూ పంచుకుంటే ఖర్చులన్నీ పోనూ డ్యాన్సర్‌కు ఐదొందలు



అందవచ్చు. ఆ డబ్బు కోసమే డ్యాన్సర్లు రాత్రంతా అసభ్యకరమైన నాట్యవిన్యాసాన్ని ప్రదర్శించటానికి సిద్ధపడతారు.

## వేరే దారి లేక...

"మామూలు రికార్డింగ్ డ్యాన్సులు చేయడానికి పిలిస్తే ఎవరు పడితే వాళ్లు వచ్చి చేస్తారు. అలా కాకుండా, నడిరాత్రి తర్వాత రంజుగా సాగే డ్యాన్సుల్ని మీరు చేస్తున్నారనే మేం మీ కోసం ఇంత దూరం వస్తున్నాం"-గుంటూరు డ్యాన్సర్ శిరీషతో లక్కిరెడ్డిపల్లి నుంచి వెళ్లిన నిర్వాహకులు చెప్పిన మాటలివి. ముందే చెప్పుకున్నట్లు ఇవి రికార్డింగు డ్యాన్సులు కావు. ఆ పేరుతో సాగుతున్న అసభ్యకరమైన దృశ్యాలు. డ్యాన్సర్లు ఇటువంటి నృత్యాలు చేయడానికి ఎందుకు సిద్ధపడుతున్నారూ అంటే... విధిలేని పరిస్థితుల్లో బతకడం కోసం, జీవన భృతి కోసం అనేది సమాధానం.

శిరీషనే తీసుకుంటే- పదహారేళ్లకే బతుకు భారం మీద పడింది. తండ్రి చనిపోవటంతో తల్లి, ఇద్దరు చెల్లెళ్లు, ఇద్దరు తమ్ముళ్లు వున్న ఇంటిలో పోషణ కష్టమై పోయింది. శిరీషకు ఆమె తల్లి డ్యాన్సు నేర్పించి రికార్డింగ్ డ్యాన్సుల కంపెనీకి, అగ్రిమెంట్ మీద పంపింది. అప్పుడు రెండేళ్లకు కలిపి ఇరవై వేల రూపాయలు శిరీష కుటుంబానికి దక్కాయి. ఇది కుటుంబాన్ని నడుపుకోవడానికి ఉపయోగపడుతుందని అందరూ సంతోషించారు. కానీ జరిగింది మరొకటి. శిరీషను వ్యభిచారం చేయాల్సిందిగా కాంట్రాక్టుదారులు బలవంతపెట్టారు. హింసించి ఆమెను వాడుకున్నారు. డాన్సుల పేరుతో సెక్స్‌వర్కర్లుగా మారుస్తూ, తనలాగా మరెందరినో కాంట్రాక్టు దారులు తమ గుప్పిట్లో పెట్టుకు న్నారని శిరీష ఆవేదన చెందింది.

## ఎవరి 'ఆకలి'వారిది

ఇలా డ్యాన్సర్లు ఆకలి తీర్చుకోవటానికి డ్యాన్సులు చేయటానికి సిద్ధమవుతుంటే, జనం తమ 'మరో రకం ఆకలి'ని తీర్చుకోవటానికి ఈ డ్యాన్సుల కోసం ఎగబడుతున్నారు. స్త్రీని భోగవస్తువుగా చూసే దృష్టిలో నుంచే వ్యభిచారం, దేవదాసీ నృత్యాలు లాంటివన్నీ పుట్టుకొచ్చాయి. రికార్డింగ్ డ్యాన్సులకీ, అసభ్యకరమైన నృత్యాలకీ మూలం కూడా అదే. యువతులను, బాలికలను డాన్సర్లుగా పోషిస్తామంటూ కాంట్రాక్టుపై వివిధ ప్రాంతాల నుంచి తీసుకొచ్చి వారిని సెక్స్ వర్కర్లుగా మార్చే ముఠాలు తయారయ్యాయి. పోలీసు వ్యవస్థ సరిగా స్పందించకపోతే, ఈ డ్యాన్సులు పల్లెపల్లెకీ విస్తరించటం, ఈ ముఠాల చేతుల్లో మరింత మంది యువతులు బలైపోవటం ఖాయం.

*సెప్టెంబర్ 2001, విజయవిహారం*

## కనిపించని మనోగాయాలు... ఈ కన్నీటి కథలు!

ఆడవారి కన్నీళ్లకు అర్థాలు అనంతం. రెండు కన్నీటి బిందువులు ఆమె మనసులోని ఆవేదనను అందంగా, అద్భుతంగా అచ్చుపోసి మనముందు ఆవిష్కరిస్తాయి. తనకు వచ్చిన కష్టాన్ని కన్నీళ్లతో ఆమె కడిగేసుకుంటుంది. గుప్పెడు విషాదాన్ని గుండెపొరల మధ్య నిక్షిప్తం చేసి తెచ్చిపెట్టుకున్న చిక్కటి నవ్వును ఏమాత్రం కపటం లేకుండా మనముందు నటిస్తూ...మనల్ని నవ్విస్తుంది. తాను మాత్రం లోలోపల కుమిలిపోతుంది. శుష్కించిపోతుంది. ఇదో చక్రం. జీవిత వాస్తవ చట్రం. దీంట్లో అతివలు ఇమిడిపోయారు. వొదిగిపోయారు. దీనికి తరతరాల ఆనవాయితీ చరిత్ర వుంది. దీనికి అంతులేదు. అనంతసాగరం ఆడవారి మనసు. విరిగిపడే కెరటాలే వారి జీవనం. చిగురుటాకులాంటి హృదయంలో కళ్లకు సైతం కనిపించని ఎన్నో మనోగాయాలు....ఒక్కో గాయానికీ ఒక్కో చరిత్ర....ఇవన్నీ కన్నీళ్ళ కథలే...వాస్తవ జీవిత చిత్రాలే...

... ... ...

ఆమె పేరు జయ. వయసు పదిహేడేళ్ళు. ఆమెకు గుర్తు వచ్చినప్పటి నుంచి రాత్రి కాగానే పక్క గదిలో నిద్రపోతున్న తనమీదకు ఒక ఆకారం వచ్చి వాలిపోవడం... .తెలవారుతుండగా మళ్ళీ లేచి వెళ్ళిపోవడం జరుగుతుండేది. క్రమక్రమంగా తనకు వయసు పెరుగుతుండడం రోజూ జరుగుతుండే విషయం మీద దృష్టి పడింది. తన శరీరంను రోజూ ఒక మగశరీరం అనుభవిస్తోందని అర్థమైంది. ఆ శరీరం తనకు బాగా పరిచయమున్నది...ఇంకా పచ్చిగా చెప్పాలంటే ఆ శరీరమే తన శరీరాన్ని సృష్టించింది.... అవును అక్షరాల పచ్చి నిజం... ఆ శరీరం తన తండ్రిది. తనని పుట్టించిన తండ్రిది.

ఈ ప్రపంచం ఎటుపోతోందో ఆమెకు అర్థం కాలేదు. రోజూ హృదయం లోపలే కుమిలి కుమిలి ఏడ్చేది. గుండె పగిలేలా రోదించేది. కానీ ఆ కసాయి తండ్రి మనసు కరిగేది కాదు. చీకటి కాగానే మంచం ఎక్కాలని ఆంక్షలు విధించాడు. ఇష్టం వచ్చినట్లు చితకబాది మరీ అనుభవించేవాడు. కానీ ఏవీ తలుపులు దాటి బయటకు వచ్చేవి కావు. నలభై ఒక్క సంవత్సరాల ఒక మగ శరీరం పదిహేడేళ్ళ లేత శరీరంను ఏ మాత్రం చివరికి తన కూతురనే దయ కూడా లేకుండా వశపరచుకోవడం...మానలేదు. కాలం సాగుతూనే వుంది. 'కూతురుకు పెళ్ళీడు వచ్చింది... సిగ్గులేదూ ఇంకా పెళ్ళి చేయలేక వున్నావని'.. కొందరు ఆఫీస్‌లో ఉద్యోగులు మగ శరీరాన్ని వెక్కిరించసాగారు. తండ్రి సమాజం కోసమేనా తన కూతురికి వెంటనే పెళ్ళి చేయాలని నిర్ణయించుకున్నాడు. జయ కూడా ఇంత వరకూ జీవిస్తూనే వుందంటే కేవలం ఆ ఒక్క ఆశతోనే. తన పెళ్ళి జరిగితే ఈ నరకకూపం నుంచి వెంటనే



బయటపడవచ్చని ఆమె ఆ దేవుడ్ని ప్రార్థిస్తోంది.

పెళ్ళి కొడుకు కోసం తండ్రి ప్రయత్నాలు చేస్తున్నట్లు జయకు అర్థమైంది. రోజూ రాత్రి కరిగిపోతూనే తనకు దగ్గరలోనే స్వాతంత్ర్యం వస్తుందని కలలు కనేది. ఆమె కలలు ఫలించాయి. తమ గ్రామానికి వంద కిలోమీటర్ల దూరంలోని ఒక గ్రామానికి చెందిన శీను అనే అబ్బాయితో జయ పెళ్ళి జరిగిపోయింది. ఆమె తన జీవితానికి వసంతం వచ్చినట్లు పులకరించి పోయింది. మెట్టినింటికి వెళ్ళిపోయింది. నెలకోసారి తండ్రి అనే భూతం వచ్చి తనను చూసి పోయేది. జయ ఎవరికీ ఏమీ చెప్పలేదు. కొంతకాలానికి తండ్రి మారిపోయాడనుకుంది. ఒకసారి వచ్చి అమ్మాయిని పండగకు ఊరికి తీసుకెళ్తానని తండ్రి వచ్చాడు. భర్త తనకు పని వుందని, అమ్మాయిని తీసుకెళ్ళమని చెప్పాడు. జయ కూడా తండ్రిని అర్థం చేసుకుని వెళ్ళడానికి సిద్ధపడింది. ఇద్దరే బస్సు ఎక్కారు. బస్సు రోడ్డు వద్ద నిలబడింది. అక్కడ నుంచి రెండు కిలోమీటర్లు పల్లెకు నడవాల్సి వుంటుంది. కానీ తండ్రి పల్లెకు పిల్చుకపోకుండా ఆ దిగిన ఊర్లోనే లాడ్జి తీసుకోవడం జయకు అనుమానం కల్గ చేసింది. తండ్రి మారాడనుకుంది.

అక్కడికీ 'ఎందుకు లాడ్జి తీసుకున్నారని ప్రశ్నించింది' 'చీకటి అవుతోందని... ఆ పొలాల్లో పడి పల్లెకు పోవడం ఎందుకని' లాడ్జి తీసుకున్నట్లు తండ్రి చెప్పాడు. జయ నమ్మింది. చీకటైయింది. భోజనాలయ్యాయి. అర్థరాత్రి సమయంలో ఏదో మగ ఆకారం తనని ఆక్రమించిందని జయకు అర్థమైంది. గట్టిగా అరిస్తే తన తండ్రి మర్యాదతో పాటు తన బతుకు వీధిన పడుతుంది... నోరు మూగబోయింది. మళ్ళీ మానవత్వం మంటల్లో బూడిదైంది. తెల్లారింది. పల్లెకు సిద్ధమై...బయలు దేరారు. దారి మధ్యలో ఒక టూరింగ్ టాకీస్‌లో ఏదో సినిమా చూపించాడు. మరో కిలోమీటరు అడవిలో నడవాల్సి వుంది. కాసేపు ఇక్కడ కూర్చుందాం అని చెప్పి... మళ్ళీ తన మీద పడ్డాడు. చితకబాది అనుభవించాడు. జయకు ఏమీ అర్థం కాలేదు. ఇలా ఒకసారి కాదు... చాలా సార్లు నమ్మడం, మోసపోవడం జయ జీవితానికి అలవాటైపోయింది. భర్త మంచి తనం తనకు అండగా వుందని తెలుసుకుంది. తన గుండెలో రగిలిపోతున్న అగ్నిపర్వతాన్ని ఆమె ఆయనకు చెప్పింది. ఇంకెప్పుడూ ఆ నరరూపరాక్షసునితో తనను పంపవద్దని కోరింది. అతను ఆమె ఆవేదనను అర్థం చేసుకున్నాడు. ఆమె కన్నీళ్ళను తుడిచాను. నీ వెనుక నేను వున్నానని ఎందుకు మరిచావని...అడిగి ఆమెకు అంగరక్షకుడిగా మారాడు. ఆమెను పోలీస్ స్టేషన్‌కు తీసికెళ్ళాడు. జరిగిందంతా చెప్పమన్నాడు. పోలీసులు విని నిర్ఘాంతపోయారు. కేసు నమోదైంది. ఆ కసాయి తండ్రిని పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. ఇప్పుడు ఆ రాక్షసుడు జైల్లో వున్నాడు...

జయకు అండగా భర్త...పోలీసులు...చట్టం వున్నాయి. ఇది మన రాష్ట్రంలోనే జరిగిన విషాద వికృత సంఘటన. 1991లో ఈ సంఘటన వెలుగులోకి వచ్చింది. ఈ సంఘటనను విని యావత్ దేశం నిర్ఘాంతపోయింది.

... ... ...

ఒరిస్సాలోని మయూర్‌భంజ్ జిల్లా పటకదిహి గ్రామానికి చెందిన లక్ష్మణ్‌నాయక్ అదే ఊర్లోని గాయత్రిని ప్రేమించాడు. కాని గాయత్రి అతన్ని కాదని అతని అన్న అయిన వాసూనాయక్‌ను ప్రేమించింది. ఇద్దరూ కలిసి పెళ్ళి చేసుకున్నారు. ఆ పగ లక్ష్మీనాయక్ అంతరంగంలో అలాగే ప్రజ్వరిల్లుతూనే వుంది. కొంత కాలానికి గాయత్రికి వాసూనాయక్‌లకు ప్రియా అనే కుమార్తె కల్గింది. లక్ష్మణ్‌నాయక్ వయసు పెరుగుతున్నప్పటికీ ఆవేశం, ఆక్రోశం ఏ మాత్రం తగ్గలేదు. ఎప్పుడు అదును చిక్కుతుందా అన్న వాసూనాయక్‌ను దెబ్బతీయాలని ఎదురుచూస్తున్నాడు. కానీ ఎప్పుడూ ఆ తరుణం చిక్కడం లేదు. విసిగి వేసారిపోయిన లక్ష్మణ్‌నాయక్‌కు ఏడేళ్ళ ప్రియ ఎప్పుడూ కనిపిస్తూ వుండేది. అందర్నీ నవ్విస్తూ నవ్వుతూ వుండే ప్రియ మీద లక్ష్మణ్‌నాయక్ కన్ను పడింది. అదును కోసం చూడసాగాడు.

ఒక రోజు పథకం వేశాడు. పరిస్థితి అనుకూలంగా కనపడింది. వెంటనే ఆడుకుంటున్న ప్రియను అడవిలో రకరకాల కాయలు, పండ్లు, పక్షులు వుంటాయని.... వస్తే తీసుకెళ్ళి చూపిస్తానని ముప్ఫైఆరేళ్ళ లక్ష్మీనాయక్ ఏడేళ్ళ ప్రియను నమ్మించగలిగాడు. ఎవరి కంటా పడకుండా ఆమెను అడవికి తీసుకెళ్ళాడు. చిన్నారి వయసును చిదిమేశాడు. చిన్నారి జీవితాన్ని చిందరవందర చేశాడు. విలవిలలాడినా వినిపించుకోకుండా అనుభవించాడు. తన చిరకాల కక్ష సాధించుకున్నాడు. తల్లి తన ప్రేమ కాదన్నదని కూతుర్ని అనుభవించేశాడు. తాను అనుభవిస్తున్నది అన్న కూతుర్ని అనే అభిప్రాయం లేకుండా రాక్షసుడిగా మారిపోయాడు. ప్రియ ఆక్రందన అడవిపాలైంది. మెలకువ రాగానే చూసుకుంది. తాను అడవిలో వున్నానని అర్థమైంది. చిన్నగా రాళ్ళల్లో కంపల్లో పడుతూ గుండెపగిలేలా రోదిస్తూ ఒంటరిగా ఇంటికొచ్చింది. తండ్రికి జరిగిన దారుణాన్ని చెప్పుకుంది. వాసూనాయక్ ఉగ్రుడైనాడు. కానీ గాయిత్రి సముదాయించింది.

ప్రియను పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళారు. జరిగిందంతా ప్రియ చెప్పింది. 1990 ఫిబ్రవరి 11న ఈ దారుణం జరిగినట్లు ధృవీకరించారు. 1994 జూలై 16న నిందితుడికి ఉరిశిక్ష విధిస్తూ తీర్పు వచ్చింది. తనకు క్షమాభిక్ష పెట్టాల్సిందిగా రాష్ట్రపతికి వినతిపత్రం పంపినప్పటికీ ప్రయోజనం లేకపోయింది.

... ... ...



పశ్చిమగోదావరి జిల్లా కొవ్వూరు పట్టణంలోని ఒక థియేటర్‌లో సినిమా చూడడం కోసం ప్రక్క ఊరి నుంచి రాజమ్మ అనే మహిళ బయలుదేరింది. అనుకున్నట్టుగానే సినిమాకు వచ్చింది. సినిమా అయిపోగానే బయటకు వచ్చింది. ఇప్పుడు రాజమ్మ తిరిగి తన ఊరికి వెళ్ళాలి. ఒంటరిగా వెళ్ళడం ఎందుకు? అనుకుంది. ఇంతలో బాబు, రమేష్, కిరణ్‌లు కనిపించారు. వీళ్ళందరూ రాజమ్మ ఇంటి చుట్టుపక్కవాళ్ళే కావడం ఆమెకు మరింత సంతోషాన్నిచ్చింది. మీరు ఊరికెళ్తున్నారా? అడిగింది ఆమె. అవును! ఏం నువ్వు వస్తావా? అడిగారు వాళ్ళు. అవును అంది రాజమ్మ. వాళ్ళతో పాటు రాజమ్మకూడా బయలుదేరింది. చాలా దూరం నడుస్తూపోతున్నారు. ఇంతలో ఎవరూ లేని...చీకటి ప్రదేశం ఒకటి వచ్చింది. వెంట వెళ్తున్న రాజమ్మను ముగ్గురూ చుట్టుముట్టారు. నోరునొక్కారు. ఒకరి తర్వాత ఒకరు అత్యాచారం చేశారు. రాజమ్మ పోలీసులను కల్సుకుని జరిగిన దారుణాన్ని చెప్పింది. కేసు నమోదైంది. 1992 మే 5న అత్యాచారం జరిగినట్లు నమోదు చేశారు. ముగ్గురు వ్యక్తులకు వివాహిత రాజమ్మను అత్యాచారం చేసినందుకు ఒక్కొక్కరికి పది సంవత్సరాల కఠినకారాగార శిక్షతోపాటు, 250 రూపాయల జరిమానాతో శిక్ష పడింది.

నేరాలకు సాక్ష్యాలు దొరకడమే గగనమైపోయింది. చివరికి ఈ సంవత్సరం మార్చిలో విశాఖపట్నం ప్రాంతంలో జరిగిన అత్యాచారం కేసులో కన్నతల్లిపై జరిగిన మానభంగం గురించి పిల్లలే సాక్ష్యం చెప్పాల్సి వచ్చింది. అసలేం జరిగిందో వివరంగా చెప్పమని పోలీసు కమిషనర్ కోరినప్పుడు ‘ముగ్గురు ఇంటి పెంకులు తీసి ఇంట్లోకి వచ్చారండి...మాకు కత్తులు చూపి భయపెట్టి... ఇద్దరెళ్ళి మా అమ్మ మీద పడ్డారండి... ఒకడు మా గొంతుకు కత్తి పెట్టాడండి... తర్వాత వాడూ వెళ్ళి మా అమ్మపై పడుతుంటే... కత్తులకు కూడా భయపడకుండా మేం గట్టిగా అరిచామండి” అని ఏడుస్తూ ఆరేళ్ళ బాలిక తన తల్లి ఎలా మానభంగానికి గురైందో చెప్పుకోవాల్సిన పరిస్థితిని ఎవరు మార్చగలరు?

దీని గురించి ప్రజల్లో చైతన్యం రావాలి. ఇరుగు పొరుగువాళ్ళూ, ప్రత్యక్ష సాక్షులూ సాక్ష్యం చెప్పేందుకు ముందుకు రావాలి. ఒక అబలకు అన్యాయం జరిగితే ఉప్పెనై ఎదుర్కోవడానికి మహిళా లోకం జాగృతం కావాలి.

*17 సెప్టెంబర్, 1996*

వార్త దినపత్రిక

# చరిత్ర



చరిత్రను కాపాడండి

కాలంతోపాటు చరిత్ర కరిగిపోతోంది.
ప్రసిద్ధ కోటలు బీటలు వారుతున్నాయి.
శాసనాలు రాతిబండలౌతున్నాయి.
కట్టడాలు కుప్పకూలి పోతున్నాయి.
నాటి శిల్పాలు నేడు శిథిలాలుగా మిగిలాయి.
విద్రోహుల డేగ చూపు నీడల్లో చరిత్ర విలవిలలాడుతోంది.
నిధులవేట పేరుతో బలవంతుల చేతుల్లో చరిత్ర భస్మం అవుతోంది.
మనవాళ్ళే మన చరిత్రను కొల్లగొట్టి
విదేశీయులకు అమ్మేస్తున్నారు.
చరిత్రతో వ్యాపారం చేస్తున్నారు.



మనకు చరిత్ర వుంది. ఆ చరిత్రను కాపాడుకునే సంస్కృతి మాత్రం లేదు. శాతవాహనులు, కాకతీయులు, విజయగనర రాజులు, మౌర్యులు, పల్లవులు, గుప్తులు, తెలుగుచాళుక్యులు, రాష్ట్రకూటులు, రేనాటిచోళులు, బాదాములు, మల్లురాజులు, గోల్కొండనవాబులు, హైదరాలీ, టిప్పుసుల్తాన్, అర్కాట్ నవాబులు, మొగలులు, మహారాలు, పాలెగాండ్రు, ఆంగ్లేయులు... ఎందరో ఇక్కడ చారిత్రక పాత్రలయ్యారు. గతించిన కాలానికి తార్కాణంగా అప్పటి కట్టడాలు, శిల్పాలు, స్థలాలు ఎన్నో తెలుగునేల గుండె పొరల మధ్య నిలిచిపోయాయి. గత చారిత్రక వైభవానికి ప్రతీకగా, ప్రతిరూపాలుగా నిలిచిన ఈ చరిత్ర ఆధారాలు ఒక ప్రక్క అధికారుల నిర్లక్ష్యానికి, మరో ప్రక్క విద్రోహుల నిధుల వేటకుగురై నామరూపాలు లేకుండా పోతున్నాయి. పరిశోధనల ద్వారా, త్రవ్వకాల ద్వారా బయటపడ్డ చారిత్రక ఆధారాలు నేడు సరైన ఆదరణ లేక మౌనంగా రోదిస్తున్నాయి. ఎన్నో పురాతన కట్టడాలలు, స్థలాలు, శిల్పాలు, శాసనాలు గుర్తింపునకు నోచుకోక మరుగున పడిపోతున్నాయి. 1960లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'పురావస్తు ప్రదేశాల పరిరక్షణచట్టం' ఏర్పాటు చేసి దాదాపు ఐదువందల ప్రాంతాలను పరిరక్షించాలని ఒక జాబితా రూపొందించినప్పటికీ అవన్నీ కేవలం కాగితాలకే పరిమితం అయ్యాయి. నానాటికీ చరిత్ర సమాధి అవుతున్నా పట్టించుకునే వారు లేరు. చరిత్రపుటల్ని తిరగేసేందుకు ఆ కట్టడాల శకలాలే సాక్ష్యం అనే విషయం మరచిపోతున్నారు.

గత చరిత్రకు ఆనవాళ్ళుగా మిగిలిన ఎన్నో కట్టడాలు, కోటలు కరిగి పోతున్నాయి. తరిగిపోతున్నాయి. నామరూపాలు లేకుండా నశించిపోతున్నాయి. అయినా పట్టించుకునే వారెవరు? పరిరక్షించే వారెవరు? అనంతపురం జిల్లా గుత్తికోటలో ఎక్కడ చూసినా గోతులు కనిపిస్తాయి. కంకర రాళ్ళకోసం కోటను తవ్వి పోస్తున్నారు. దాదాపు 4250 అడుగుల ఎత్తులో నిర్మించిన ఈ కోట చాణిక్యులు, హరిహరరాయులు, శ్రీకృష్ణదేవరాయులు, టిప్పుసుల్తాన్ వంటి వారి ఆధీనంలో ప్రకాశించింది.

నేడు ఈ వైభవం విహీనం అయింది. కోటను చూడడానికి వచ్చే వాళ్ళు వారి పేర్లను చెక్కడం, ఏవైనా దొరుకుతాయేమోనని గోతులు తీయడం వల్ల ఒక శిధిల భవన సముదాయంగా మారుతున్నది. రాయలసీమ జిల్లాలకే తలమానికంగా భాసిల్లిన కడప జిల్లాలోని గండికోటను క్రీస్తుశకం 1106లో కాకతీయ రాజులు నిర్మించారు. 14వ శతాబ్దంలో గండికోట ఢిల్లీ సుల్తానుల వశమైంది. తర్వాత మూడు శతాబ్దాల పాటు విజయనగర రాజుల ఆధిపత్యంలో విరాజిల్లింది. తూర్పు దక్షిణం నాలుగున్నర మైళ్ళ విస్తీర్ణం కలిగిన కోటగోడ 101 బురుజులతో 40 అడుగుల ఎత్తుతో అభేద్యంగా వుంది. కాలక్రమంలో హైదర్అలీ,

టిప్పుసుల్తాన్, నిజాం, కడప నవాబులు స్వాధీనం చేసుకుంటూ 1800లో బ్రిటీష్ వారి చేతికి అప్పగించారు. ఈ కోటలో వినూత్న శిల్పకళతో శోభిల్లే పన్నెండు దేవాలయాలు వున్నాయి. ఇప్పుడు కోట, కోటలోని దేవాలయాలు శిథిలావస్థకు చేరుకున్నాయి. కోటను సందర్శకులు చేరుకోవడానికి సరైన దారి కూడా లేదు. మణులు, మాణిక్యాల కోసం కోటగోడలను, ఆలయాలను కొల్లగొట్టారు. దీంతో కట్టడాలు మరింత శిథిలమయ్యాయి.

నిధి నిక్షేపాల కోసం ధ్వంసమైన కోటల్లో నెల్లూరు జిల్లాలోని రాపూరు కోట కూడా ఒకటి. క్రీ.శ.1608లో విజయనగర పాలకులు వెంకటపతి రాయల సేనాని అయిన వెలుగోటి యాచమనాయుడు ఈ కోటను నిర్మించాడు. విజయనగర రాజుల తర్వాత రాపూరుసీమ సేనాని హైదర్‌ఉల్‌ముల్క్ ఆధీనంలోకి వచ్చింది. ఎంతో చరిత్ర వున్న రాపూరుకోట బురుజులు శిథిలమైపోయాయి. గతంలో యిక్కడ వున్న శాసనాలు కూడా నిధుల మార్గాలు చూపే పలకలుగా భావించి కొందరు దుండగులు తస్కరించినట్టు తెలుస్తోంది.

కోటలోని రాళ్ళు కూడా గృహనిర్మాణాలకై వాడుకుంటున్నారు. రహస్య తవ్వకాలు కూడా చాలా చోట్ల జరిపారు. కడప జిల్లాలోని సిద్ధవటం కోటకు చరిత్రలో ప్రత్యేక స్థానం వుంది. సిద్ధవటాన్ని రాజధానిగా చేసుకుని మొత్తం18 రాజవంశాలు దీనిని పరిపాలించారు. క్రీ.శ. 1233లో ఈ కోటను మట్లి రాజులు నిర్మించినట్లు తెలుస్తోంది. శిథిలావస్థలో వున్న సిద్ధవటం కోట, అందులోని బురుజులు, కోటలోనుంచి ఏటిలోకి తీసిన సొరంగ మార్గం, మహ్మదీయుల సమాధులు, దర్గా మొదలైనవి ఆనాటి చరిత్రకు అద్దం పడతాయి. కోటలో చూడదగిన అతి పెద్ద నంది ఇటీవల నిధుల కోసం వచ్చిన వారిచే ధ్వంసం అయింది. 1904లో ఇద్దరు భార్యలతో వున్న సూర్యుడి విగ్రహం లభించినట్టు రికార్డుల్లో వున్నప్పటికీ ఆ విగ్రహం లేదు. కోటలోని శివలింగం కింద నిధి వుందని తెలిసి ఆరు అడుగుల ఎత్తు గల శివలింగాన్ని గది నుంచి బయటకు తెచ్చి వుంచారు. కోటలోని శిలా శాసనాలకు సరైన రక్షణ లేనందున సందర్శకులు అడ్డంగా చెక్కివేశారు.

దీంతో శాసనాలు బండరాళ్ళలాగా మిగిలిపోయాయి. కృష్ణా జిల్లాలోని కొండపల్లి కోట క్రమక్రమంగా కనుమరుగై పోతోంది. క్రీ.శ. 1360లో అనవేమారెడ్డి నిర్మించిన ఈ కోటలోని పురాతన నిర్మాణాలలోని రాళ్ళు అక్రమంగా తరలిపోతున్నాయి. ఆనాడు కోట రక్షణ కోసం నిర్మించిన బాహ్య ప్రాకారపు గోడ అక్రమ ఆక్రమణలకు, గృహనిర్మాణాలకు గురవుతోంది. వీర పోరాటాలతో చరిత్ర సృష్టించిన బొబ్బిలి కోటకు కూడా అవస్థలు తప్పడం లేదు. గత చరిత్రకు సజీవ సాక్ష్యంగా నిలిచిన బొబ్బిలి కోటలోని రంగారావు, తాండ్రపాపారాయుడి విగ్రహాల సమీపంలో చెత్తాచెదారాలతో పాటు, మూత్రవిసర్జనలకు చోటుగా చేసుకుని మనవాళ్ల చరిత్ర



సృష్టిస్తున్నారు. అనంతపురం జిల్లాలోని పెనుకొండ కోటలో గుప్తనిధులున్నాయని భావించి తవ్వకాలు కూడా జరిగాయి. యిక్కడి ప్రాచీన దేవాలయాలను కూడా వదిలిపెట్టకుండా ధ్వజస్తంభం కింద, గర్భగుడిలోని విగ్రహాల క్రింద నిధుల కోసం గునపాలతో తవ్వారు. రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లోని గోల్కొండ కోటకే రక్షణ లేదు. కోట ప్రాంతంలో చాలాభాగం భూకబ్జాకు గురైన విషయం తెలిసిందే. కోటలోని రాళ్ళను సైతం పట్టుకెళ్ళి ఇళ్ళు నిర్మించుకున్నారు. రాష్ట్ర రాజధానిలోని ప్రాచీన కట్టడాలకే సంరక్షణ లేకపోతే మారుమూల ప్రాంతాల్లోని చారిత్రాత్మక కట్టడాలకు ఏ మాత్రం హామీ ఇవ్వగలరు?

## ఇదీ విజయనగర వైభవం!

చరిత్రలో విజయనగర రాజులకు ఎంతో ఖ్యాతి వుంది. వారు నిర్మించిన కట్టడాలు, శాసనాలు, యిప్పుడు ధ్వంసమవుతున్నాయి. కర్నాటక రాష్ట్రంలోని బళ్లారికి 70కిలోమీటర్ల దూరంలో 'హంపి' వుంది. విజయనగర రాజ్యానికి రాజధానిగా స్వర్ణయుగాన్ని అనుభవించిన హంపి నేడు ఇటు అధికారుల నిర్లక్ష్యానికీ, అటు విద్రోహుల నిధుల వేటకూ బలవుతోంది. తవ్వకాల ద్వారా, పరిశోధనల ద్వారా బయట పడ్డ చరిత్ర చెరిగిపోతోంది. యిక సప్త స్వరాలు పలికే స్తంభాలు సైతం వచ్చిన పర్యాటకుల పరిశోధనల వల్ల మూగబోతున్నాయి. గతంలో రాతి రథంపై గోపురం వుండగా నేడు అది నేలకూలింది.

అనంతపురం జిల్లాలోని హిందూపూర్‌కు పదిహేను మైళ్ళ దూరంలో వున్న లేపాక్షి కూడా ప్రభుత్వ ఆదరణకు నోచుకోవడం లేదు. విజయనగర రాజు వంశస్థులలో ఒకరైన అచ్చుత దేవరాయలు 1530లో ఇక్కడ ఆలయ నిర్మాణం చేశారు. యిక్కడి శిల్పకళకు శతాబ్దాల చరిత్ర వుంది.

నెల్లూరు జిల్లాలోని ప్రభుగిరిపట్నం దేవాలయానికి నాలుగు శతాబ్దాల చరిత్ర వుంది. నేడు ఇది నిధుల వేటలో శిథిలమై పోతున్నది. విజయనగర చక్రవర్తులకు సామంతరాజుగా వుండే ప్రభాకరవర్ధనుడు క్రీ.శ. 1600 శతాబ్దంలో ఈ ఆలయాన్ని నిర్మించారు. గతంలో పశువుల కాపరికి ఈ ప్రాంతంలో ఒక బంగారు విగ్రహం దొరికింది. దీంతో ఈ ప్రాంతంలో నిధులు వున్నాయనే విషయం ప్రచారం అయింది. అనేక మంది నిధుల కోసం, ఖరీదైన విగ్రహాల కోసం తవ్వకాలు కూడా చేశారు. ఇష్టమొచ్చినట్టు గోతులు తవ్వడం వల్ల దేవాలయం మరింత శిథిలమైంది. ప్రాచీన 'రామాలయం' గర్భగుడి కుప్పకూలిపోయింది. మూలవిరాట్టును మాయం చేశారు. ఇక్కడే వున్న పెరుమాళ్ళస్వామి ఆలయం కూడా ధ్వంసమైంది. యిక్కడ నిధుల కోసం చేసిన ప్రయత్నానికి నిదర్శనంగా గోతులు వున్నాయి. ఈ ప్రాంతంలోని దేవాలయాల్లో చాలా చోట్ల విగ్రహాలను పెకిలించి పక్కన పడేశారు. అనంతపురం జిల్లా

రాయదుర్గం పరిధిలోని ఏళంజి, వీరాపురం గ్రామాలకు విజయనగర రాజుల కాలంతో ఎంతో అనుబంధం వుంది. ఏళంజి గ్రామం విజయనగరరాజులతో గొప్ప వైభవాన్ని అనుభవించింది. కాలంతో పాటు యిక్కడ చరిత్ర కూడా కరిగిపోతోంది. అందుకు తార్కాణంగా నేటికీ ఏళంజి గ్రామంలో ఇసుక తిన్నెల కింద శిథిలాలు కనిపిస్తాయి. వాటి వైభవానికి సాక్షిగా ఎన్నో శిథిల భవనాలు మిగిలిపోయాయి.రాయల కాలంలో పాలెగాండ్ల ఆధీనంలో వుండి చరిత్ర సృష్టించిన వీరాపురం నేడు వెలవెలపోతోంది. అప్పట్లో ఈ గ్రామం చుట్టూ ఏడు ప్రాకారాలు వుండేవి. వాటి శిథిలాలు నేటికీ మనకు కనిపిస్తాయి. యిక్కడ వున్న శిలాఫలకం కూడా ఎక్కువ భాగం శిథిలమైంది. ఈ ప్రాంతాల్లోని రాళ్ళను, ఇటుకలను, శిల్పాలను కొందరు తరలించుకపోగా, మిగిలినవి మాత్రం మౌనంగా రోదిస్తున్నాయి. అనంతపురం జిల్లా తాడిపత్రి ప్రాంతంలోని యల్లనూరు, యాడికి, పెద్దపప్పూరు, పుట్లూరు, తాడిపత్రి ప్రాంతాల్లోని ప్రాచీన కట్టడాలు ఆదరణ కరవై భూగర్భంలో కలిసి పోతున్నాయి. శిథిలమౌతున్న శిల్పసంపద కోవలోనే గోరంట్ల పరిధిలోని ప్రాచీన మాధవరాయ దేవాలయం కూడా వుంది. తమిళనాడులోని మహాబలిపురంలో పల్లవుల కాలంనాటి శిల్పాలను, ప్రదేశాలను పరిరక్షిస్తున్నారు తప్ప విజయనగరం కాలం నాటి కొలనుపైనా, మండపాలపైనా శ్రద్ధ చూపడం లేదు. యిక్కడ ఆరో శతాబ్ది కాలం నాటి స్నానఘట్టం వుంది.

ప్రకాశం జిల్లాలోని 'కంభంచెరువు'కు చరిత్ర వుంది. క్రీ.శ. 15వ శతాబ్దంలో గజపతుల ఆధిపత్యంలో ఈ ప్రాంతం వుండేది. రాయలు రుచీదేవిని రెండవ భార్యగా యిక్కడే వివాహం ఆడినట్లు చరిత్రకారులు అంటారు. నాటి నవాబుల స్మృతి మందిరాలు, బురుజులు ఎన్నో ఈ ప్రాంతంలో ఆలనా పాలనా కరువై కడు దీనంగా నలిగిపోతున్నాయి. చారిత్రాత్మక కట్టడాలకు, శిల్పకళానైపుణ్యానికి తార్కాణంగా నిలిచిన ఎన్నో కట్టడాలు చీకట్లో కలిసిపోతున్నాయి.

### ముక్కలౌతున్న శిలా శాసనాలు

ఎన్నో శాసనాలు ఎండకు ఎండి, వానకు తడుస్తూ ముక్కచెక్కలై పోతున్నాయి. రాబోయే తరాల వారికి గత చరిత్ర ఆనవాళ్ళు మిగలకుండా పోతున్నాయి. అనంతపురం జిల్లా కదిరి పట్టణానికి రెండు కిలోమీటర్ల దూరంలో వున్న ప్రాచీన లఘులమ్మ ఆలయంలో 'శిలాశాసనాలు' బయల్పడినా పట్టించుకునే వారు లేరు. యిక్కడ గుప్తనిధుల కోసం పెకలించిన రాళ్ళు మనకు కనిపిస్తాయి. కొండలోని గుహలో సప్త రుషుల విగ్రహాలు వుండాల్సి వుండగా, ఆ విగ్రహాల్లో మూడు విగ్రహాలు దొంగల పాలయ్యాయి. కాలగర్భంలో కలిసిపోతున్న 'కదిరి' శిలాశాసనాలను చరిత్రకారులు, అధికారులు పట్టించుకోకపోవడం దురదృష్టకరం. కొందరు నిధుల కోసం గుంతలు కూడా తీశారు. ఆలయంలోని విగ్రహాలను పెకలించిన



సందర్భాలు కూడా వున్నాయి. కర్నూలు జిల్లాలో చాలా చోట్ల శిలాశాసనాలు కోకొల్లలుగా లభిస్తుంటాయి. వాటి వివరాలు తెలియక వాటిని మాములు రాళ్ళలాగే భావించి నిర్లక్ష్యం చేస్తుంటారు. పత్తికొండ నియోజకవర్గ పరిధిలోని కప్పట్రాళ్ల, రాజులమండేగిరి, కుంకనూరు, మద్దికెర, అటికెలగుండు...గ్రామాల్లో రోడ్లపై శిలాశాసనాలు పడి వున్నాయి. కొన్ని శిలాశాసనాలు పశువులను కట్టివేయడానికి ఉపయోగించడం వల్ల వాటిపై ఉన్న అక్షరాలు అర్థంకాకుండా పోయాయి. అశోకుని 'పాళీ' భాషలోని శాసనాలు సైతం జొన్నగిరి వద్ద రక్షణలేకుండా పడి వున్నాయి. చరిత్రాత్మక విశేషాలను చాటిచెప్పే శిలాశాసనాలు బయటపడినా ప్రయోజనం లేకుండానే శిథిలమౌతున్నాయి.

### ఉనికి కోల్పోతున్న 'బౌద్ధారామాలు'

కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలోని బౌద్ధారామం ఉనికి కోల్పోతున్నది. బౌద్ధ సంస్కృతికి కీలక ప్రాంతంగా నిలిచిన ఈ ప్రాంతం నేడు రక్షణ కరవై స్మగ్లర్ల గుప్పిట్లో విలవిలలాడుతోంది. బౌద్ధ చరిత్రకు చిహ్నాంగా వున్న విగ్రహాలను, కట్టడాలను కొందరు సందర్శకులు పగులగొట్టి పాడు చేశారు. గతంలో బౌద్ధ స్థూపంపై కన్పించిన స్త్రీ, పురుష బొమ్మల చిత్రాలు నేడు కనిపించడం లేదు.రాయలసీమలో బయల్పడిన తొలి బౌద్ధారామం కడప జిల్లాలోని భైరాగిగుట్ట. 1979లో ఇక్కడ జరిగిన తవ్వకాల్లో 15 చిన్నసైజు బౌద్ధారామాలు బయల్పడ్డాయి. క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దానికి చెందిన బౌద్ధారామాలుగా వీటిని గుర్తించారు. మరింత పరిశోధన చేస్తే మరిన్ని స్థూపాలు బయల్పడే అవకాశం వుంది. పరిశోధన చర్యలు తీసుకోకపోగా కనీసం వాటిని రక్షించే ప్రయత్నం చేయడం లేదు.

గత అసెంబ్లీ ఎన్నికల్లో ఈ బౌద్ధ ఆరామాల్లో భారీ సంఖ్యలో బాంబులు లభించాయి. విద్రోహాల వల్ల స్థూపాలు, గుహలోపలి భాగాలు శిథిలమైపోతున్నాయి. చాలా చోట్ల ప్రాచీన దేవాలయాలకు ఆలనాపాలనా కరువవ్వడంతో దేవాలయాల్లోని కీలక ప్రదేశాల్లో అక్రమ తవ్వకాలు జరుగుతున్నాయి. మరికొన్ని చోట్ల మూలవిరాట్టుకే ముప్పువాటిల్లుతోంది. శివాలయాల్లోని శివలింగాల కింద నిధులుంటాయనే నమ్మకంతో లింగాలను పెకలిస్తున్నారు. గుప్త నిధుల ఆనవాళ్ళు తెలుసుకోవడం కోసం శాసనాలను, నిర్మాణాల శిథిలాల పునాదులు తవ్వుతున్నారు. వరంగల్‌లోని కాకతీయులు కళాసంపద నిర్లక్ష్యం నీడలో నశించి పోతోంది. చరిత్ర జ్ఞాపకచిహ్నాలుగా ఉంటూ వున్న కళాఖండాలను పరిరక్షించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చిత్తశుద్ధితో కృషిచేయడం లేదు. పురావస్తు శాఖ నియమ నిబంధనలకు వ్యతిరేకంగా నిర్మాణాలు చేపట్టిన వారిపై చర్యలు తీసుకోవడం లేదు.

భావి తరాల వారికి జాగరూకతతో చరిత్రను అందించాల్సిన బాధ్యతను విస్మరిస్తున్నారు.

శిల్పాలలో అత్యంత అరుదుగా వుండే 'చతుర్ముఖ శివలింగ విగ్రహం' కడప జిల్లా రాజంపేట మండలంలోని మదనగోపాలపురం గ్రామంలో దిబ్బలో పడి వుంది. అలాగే లింగాల మండలంలోని కుందేలు చెర్లోపల్లి గ్రామం వద్ద అనూహ్య రీతిలో బయల్పడ్డ బిలం క్రీస్తుపూర్వం 2,500 సంవత్సరాల కిందటి చరిత్రను వివరిస్తున్నా అక్కడ యింతవరకూ సరైన పరిశోధన లేదు. బిలంలో మట్టిపాత్రలు, కూజాలు, చెక్కలు, రాతిపనిముట్లు, మట్టి నూనె దీపాలు తదితర వస్తువులు  బయల్పడ్డాయి. వీటిని పరిశీలించిన శాస్త్రజ్ఞులు ప్రాచీన కాలం నుంచే ఈ ప్రాంతంలో మానవ సంచారం వున్నట్టు భావిస్తున్నారు. యిక్కడ యింకా వెలుగు చూడాల్సిన రహస్యాలు ఎన్నో వున్నాయి. కాకతీయ కళకు కాణాచిగా నిలిచిన ఎన్నో ప్రాచీన కట్టడాలకు సందర్శకుల నుంచి కూడా ముప్పు వాటిల్లుతోంది. గోడల మీద, శిల్పాల మీద పేర్లు చెక్కడం వంటి చర్యలు చేస్తుండడం వల్ల విలువైన కట్టడాలు మరింత శిథిలావస్థకు చేరుకుంటున్నాయి. కట్టడాలు చరిత్రకు సజీవ సాక్ష్యాలు. ఈ ఆధారాలు సైతం అంతరించిపోతే రేపటి తరానికి చరిత్ర ఒక కట్టుకథగా మిగిలిపోయే ప్రమాదం వుంది.

### విదేశాలకు విలువైన సంపద

అతడి పేరు తిమ్మప్ప మునియప్ప. చిత్తూరు జిల్లా కూపు చంద్రపేటకు సమీపంలోని సువర్ణముఖీ నదికి కాలకృత్యాలు తీర్చుకోవడం కోసం వెళ్ళాడు. అక్కడి ఇసుకలో మెరుస్తున్న విగ్రహం ఏదో కనబడింది. వెళ్ళి చూస్తే ఇసుకలోపల మరిన్ని విగ్రహాలు వున్నట్లు తెలిసింది. సంతోషం. పట్టలేని ఆనందం. వాటిని అమ్మి సొమ్ముచేసుకోవాలని ఆరాటం. గుట్టు చప్పుడు కాకుండా ప్రాచీన సంపదను విదేశాలకు విక్రయించే ఒక ముఠాతో చేతులు కలిపాడు. అంతే...ఎంతో విలువైన ప్రాచీన సంపద... తరతరాల కళాసంస్కృతి...తీరాలు దాటిపోవడానికి సిద్ధమైంది.

అయితే పై సంఘటనలో తిమ్మప్ప వేసిన పథకం విజయవంతం కాలేదు. ఎస్.పి.రుద్రప్రతాప్‌ఠాకూర్ రంగప్రవేశం చేసి ముఠాను మూసేశారు. అంతర్జాతీయ మార్కెట్‌లో రెండు కోట్లు విలువచేసే తొమ్మిది పంచలోహ విగ్రహాలు ఈ సందర్భంగా స్వాధీనం చేసుకున్నారు. 16వ శతాబ్దానికి చెందిన కళాసంపదగా వీటిని గుర్తించారు. కడప జిల్లా ఓబులవారిపల్లె మండలం వై.కోట గ్రామ సమీపంలోని గుండాల కోనేశ్వరస్వామి దేవస్థానానికి చెందిన పంచలోహ విగ్రహాలను విక్రయిస్తుండగా గత సంవత్సరం నవంబర్‌లో తిరుపతిలో పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. వాటి విలువ సుమారు 15లక్షల రూపాయలకు పైగా వుంటుందని అంచనా. మద్రాసుకు చెందిన ఓ మార్వాడీకి విగ్రహాలను విక్రయించే ముందు శాంపిల్‌గా పార్వతీదేవి విగ్రహానికి వున్న జడను కోసి ఆ ముక్కను తీసుకెళ్ళి చూపించారని పోలీసుల విచారణలో తేలింది.



### ప్రపంచవ్యాప్త సమస్య

మ్యూజియాల నుంచి దేవాలయాల నుంచి అతి విలువైన పురాతన విగ్రహాలు, ప్రాచీన సంపదలను విక్రయించడం అనేది ప్రపంచవ్యాప్తంగా జరుగుతూనే వుంది. అందులోనూ భారత్, పాకిస్తాన్, నేపాల్, శ్రీలంక, బర్మా దేశాలలోనే ఎక్కువగా ప్రాచీన సంపద చోరీకి గురవుతోంది. విదేశాలలోని పలు మ్యూజియాల్లో వున్న విగ్రహాలలో దాదాపు 60వేలకు పైచిలుకు మన దేశం నుంచి తస్కరించబడినవే అంటే గుండెలు దడపుట్టక మానవు. మన దేశం నుంచి విద్రోహులు స్మగ్లింగ్ చేసే ప్రాచీన కళా సంపద ముఖ్యంగా అమెరికా, స్విట్జర్లాండు, ఇంగ్లండ్, ఆస్ట్రేలియా దేశాలకు వెళ్తున్నట్లు తెలుస్తోంది. విదేశాల్లో వీటి దిగుమతులపై ఎలాంటి ఆంక్షలూ లేవు. ఈ మధ్య కాలంలో మన దేశం చేసిన ఆందోళనకు దారికొచ్చిన పశ్చిమ దేశాలు ప్రాచీన సంపదను రక్షించడానికై ఒక ఒప్పందంపై సంతకాలు చేశాయి.

విగ్రహాలను అమ్మే విద్రోహులు ముఠాలుగా ఏర్పడి ప్రాచీన సంపద వివరాలను సేకరించి వాటిని తస్కరించడానికి పథకాలు ఏర్పరుస్తారని ముంబాయిలోని పెద్దముఠాకు దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలలోని చిన్న చిన్న ముఠాలతో సంబంధాలు వుంటాయి. ఇక్కడి స్థానిక ముఠాలు ఎక్కడైనా ప్రాచీన సంపద కనబడితే వెంటనే దానిని స్వాధీనం చేసుకుని కొంత మొత్తానికి ముంబాయి ముఠాకి అందిస్తే వాళ్ళు విదేశీయులతో దీనికి నాలుగైదు వంతుల రెట్టింపు మొత్తం రాబడుతారని తెలుస్తోంది. ముంబాయిలోని మహాలక్ష్మీనగర్‌లో నివాసమున్న లాకేష్ లంబాలు అంతర్జాతీయస్థాయిలో ప్రాచీన కళాఖండాలను అక్రమంగా రవాణా చేస్తూ గత సంవత్సరం చెన్నైలో విగ్రహాల అక్రమ రవాణా నిరోధక శాఖకు చిక్కారు. అతనికి మద్రాసు నగరంలో మోహన్, లక్ష్మీనరసింహరావ్ అనే ఏజెంట్లు వున్నట్లు కూడా పోలీసులు కనుగొన్నారు. తమిళనాడులోని తంజావూరు, వుడుకోటలలో దేవాలయ విగ్రహాలను దొంగతనం చేసి ముంబాయికి తరలించేవారు. కాలిఫోర్నియాకు 40 విగ్రహాలు, ఫ్రాన్స్‌కు ఒక విగ్రహంతో పాటు కోట్లాది రూపాయల విలువగల అనేక విగ్రహాలను అక్రమంగా రవాణా చేశారని పోలీసుల విచారణలో తేలింది.

### రాష్ట్రంలో పరిస్థితి

గత సంవత్సరం రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లోని ప్రాచీన సంపదను, అత్యంత ప్రాచీన విగ్రహాలను అపహరించి విదేశాలకు ఎగుమతి చేస్తున్న స్మగ్లర్ల ముఠాను విజయవాడ పోలీసులు అక్టోబర్‌లో అరెస్టు చేశారు. వీరివద్ద పట్టుబడిన విగ్రహాలలో కొన్ని 18వ శతాబ్దం కుతుబ్‌షాహీ కాలానికి చెందినవి కాగా మిగిలినవి 13,14,15 శతాబ్దాలకు చెందినవిగా

అక్కడ కొందరికి విలువైన నాణేలు లభించాయని చెప్పుకునేవారు. 1408లో ఈ గ్రామంలోనే పదకవితా పితామహుడు అన్నమాచార్యులు జన్మించారు. మౌర్య, చాళుక్య, పల్లవ, శాతవాహన, చోళ, రాష్ట్రకూట; బాణ,వైదంబ, పాండ్యకాయస్థ, కాకతీయ, విజయనగర, మట్లీరాజుల కాలంలో తాళ్ళపాక పరిసరాల్లో పలు గ్రామాలు ఉండేవి. ప్రముఖ శైవక్షేత్రం అత్తిరాల, నందలూరు మండలం లంజకనుమగట్ట కూడా క్రీస్తుపూర్వం నాటి గ్రామాలే. ఈ ప్రాంతాల్లోపొలాలు దున్నుతున్నప్పుడుపలుచోట్ల సొరంగాలు,కట్టడాలు కూడా బయటపడ్డాయి.

అనంతపురం జిల్లాలోని కళ్యాణదుర్గం కొండ ప్రాచీన చరిత్రకు ఆధారంగా వుంది. ప్రస్తుతం ఈ ఆధారాలన్నీ మట్టిపొరల మధ్యే సమాధి అవుతున్నాయి. కోట ముఖద్వార తోరణం శిథిలమైపోయింది. మిగిలిన రెండువైపుల గోడలు కూడా కూలిపోవడానికి సిద్ధంగా వున్నాయి. పెద్దరాళ్ళన్నీ దొర్లిపడ్డాయి. అక్కడక్కడా గోడలు పూర్తిగా పడిపోయాయి. కళ్యాణప్ప అనే పాలేరు పరిపాలించడంతో ఈ కోటకు కళ్యాణదుర్గం అని పేరు వచ్చిందంటారు. కుందుర్పి మండలంలోని అనేక కోటగోడలు నేడు కనిపించవు. అనంతపురం జిల్లాలోనే తనకల్లు, నల్లచెరువు మండలాల సరిహద్దులో గల ప్రాచీన చరిత్ర స్థావరాల పరిస్థితి కూడా విషమ స్థితిలో వుంది. అక్కడ వున్న బసవేశ్వరుని రాత్రి విగ్రహాన్ని గుప్తనిధుల కోసం కొందరు కదిలించారు. గోపురాన్ని పగులకొట్టారు. గుడిలోపలి నరసింహస్వామి విగ్రహం ముక్కలై పోయింది. నిధులకోసం కొందరు గుడిలోపల తవ్వకాలు చేసి పాడుచేశారు. గుడికెదురుగా వున్న ధ్వజస్థంభానికి వున్న శిలాశాసనం కూడా విరిగిపోయింది. విజయనగర రాజుల కాలంలో ప్రసిద్ధి పొందిన ఈ ప్రాంతంలో ఇప్పటికీ గుప్తనిధుల కోసం గుర్తుతెలియని వ్యక్తులు రాత్రిపూట తవ్వకాలు జరుపుతూ పురాతన కట్టడాలను, శిలావిగ్రహాలను ధ్వంసం చేస్తున్నారు. మలయనూరు గ్రామంలోని పంచలింగాల ఆలయంలో కూడా గుప్తనిధుల కోసం విగ్రహాలను పగులకొట్టారు.

### ఉండవల్లి గుహల్లో...

గుంటూరు జిల్లా తాడేపల్లి మండలంలో వున్న ఉండవల్లి గుహలు ప్రాచీన వాస్తు కళానైపుణ్యానికి ప్రతీకలు. క్రీస్తుశకం రెండు, మూడు దశాబ్దాల్లో బౌద్ధమతం మన రాష్ట్రంలో ప్రాచుర్యం పొందుతున్న రోజుల్లోనివి. ఈ కొండల్లో 64 గుహలు వున్నాయి. గుహలో రెండవ అంతస్తులో ఒకే రాతితో చెక్కిన 18 అడుగుల పొడవైన అనంతపద్మనాభస్వామి విగ్రహం వుంది. ప్రస్తుతం ఈ గుహలు గబ్బిలాలకు నిలయమయ్యాయి. అనంత పద్మనాభుడి విగ్రహం కూడా లైటు వెలిగించి చూడనిదే కనిపించదు. ఎంతో ప్రాధాన్యం సంతరించుకున్న ఈ పర్యాటక స్థలంపై ప్రభుత్వం శ్రద్ధ చూపడం లేదు.



తూర్పుగోదావరి జిల్లాలోని ఆదుర్రుకు చరిత్రలో విశిష్టస్థానముంది. బౌద్ధ సంస్కృతీ, విశేషాలు అక్కడ ఎన్నో బయల్పడ్డాయి. అక్కడి బౌద్ధస్తూపం, చైత్యాలు అలక్ష్యానికి చిహ్నాలుగా మిగిలిపోయాయి. ఇప్పటికీ ఆ ప్రాంతానికి గుర్తింపు రాకపోవడం ప్రభుత్వ అవగాహనా లోపానికీ, నిర్లక్ష్యానికీ నిదర్శనం. 10 అంగుళాల వెడల్పు, 3 అంగుళాల ఎత్తు కల్గిన ఇటుకలు కూడా ఇక్కడే బయల్పడడం విశేషం.

విశాఖ జిల్లా పాయకరావుపేట మండలంలోని గోపాలపట్నంలో శిథిలమవుతున్న బౌద్ధమత చిహ్నాలు ఎన్నో వున్నాయి. 70 అడుగుల ఎత్తులో వున్న సీతమ్మ కొండను తొలచి గుహను నిర్మించారు. బౌద్ధమత ప్రాశస్త్యాన్ని తెలియజేసే శిలాశాసనం కూడా ఇక్కడే వుంది. 1881లో రాబర్ట్‌స్టీవెల్ అనే పురాతత్వ శాస్త్రవేత కూడా ఇక్కడి పాండవుల మెట్టను గురించి తన రచనల్లో రాశారు. ఈ ప్రాంతానికి ఇంత చరిత్ర వున్నప్పటికీ ఆ విషయాలు స్థానికులకు తెలియకపోవడంతో ఈ చరిత్ర ఆధారాలన్నీ నిర్లక్ష్యానికి గురై శిథిలమైపోతున్నాయి.

14వ శతాబ్దంలో విజయనగర పాలనలో వుండిన పుంగనూరు ప్రాంతంలోని చరిత్ర ఆధారాలు అడ్రస్ కోల్పోతున్నాయి. నాటి చారిత్రక కట్టడాలు, కళాకృతులు కనుమరుగైపోతున్నాయి. పశ్చిమగోదావరి జిల్లాలోని పెదవేగికి చరిత్రలో సుస్థిర స్థానం వుంది. మెగస్తనీస్ తన రచన 'ఇండికా'లో దీని గురించి రాశారు. ఏకాదశ ముఖరుద్ర విగ్రహం, మకరతోరణం, కాలభైరవుడు వంటి, ప్రాచీన విగ్రహాలెన్నో యిక్కడ బయల్పడ్డాయి. 'ధనందిబ్బ'గా పిలిచే ఒకనాటి బౌద్ధారామం ఈ ప్రాంతంలోనే వుంది. తవ్వకాలు సాగిస్తే మరెన్నో చరిత్ర ఆధారాలు వెలుగు చూస్తాయి. కానీ ఈ ప్రాంతం గురించి పట్టించుకునే వారుగానీ, పరిశోధనలు చేసేవారు కానీ ఎవరూ లేరు.

### హంపిలో...!

350 ఎకరాల విస్తీర్ణంలోని హంపీలో చరిత్ర సంపద శిథిలమైపోతోంది. ఒకవైపు విదేశీ హిప్పీల ఆగడాలు, మరోవైపు స్థానికుల అక్రమ వ్యాపారాలు మాదక ద్రవ్యాలు హంపీ చరిత్రను దెబ్బతీస్తున్నాయి. ప్రాచ్చప్పయ్య మఠంలోని నల్లరాతి స్తంభాలలో ఒకదానిని దుండగులు ధ్వంసం చేశారు. నందులను పెకలించి పడేశారు. విజయనగర రాజుల కాలంలో రాజధానిగా వుండి స్వర్ణయుగాన్ని చూసిన హంపీలో గుప్తనిధుల కోసం జోరుగా వేట జరుగుతోంది. ప్రసిద్ధి చెందిన ఆలయాల్లోనూ, మండపాల్లోనూ గత కొంత కాలంగా దుండగులు గుప్తనిధుల కోసం తవ్వకాలు సాగించినట్లు స్థానిక రైతులు వెల్లడించారు. దక్షిణ భారతీయులు పవిత్ర స్థలంగా భావించే హంపీలో హిప్పీల స్వైర విహారంతో మాదక ద్రవ్యాల కేంద్రంగా కూడా ఈ ప్రాంతం తయారయ్యింది.

### కాలుష్యంలో చార్మినార్

వాయు, శబ్ద కాలుష్యం నుంచి చార్మినార్‌ను రక్షించడానికి ప్రభుత్వ అధికారులు చేపట్టిన ప్రతిపాదనలు కార్యరూపం దాల్చకముందే చార్మినార్ అలంకరణ దిమ్మెలు కూలిపోతున్నాయి. లాడ్‌బజార్ దిశను సూచించే ఒక మినార్‌పై అంతస్థు అలంకరణ దిమ్మె పెచ్చులూడి పోయింది. కాలుష్యంచేత కట్టడం లేత గోధుమరంగు వర్ణం కూడా మారిపోయి మసి పడుతోంది. చార్మినార్‌ను శబ్ద, వాయు కాలుష్యాల నుంచి కాపాడడమే కాక పరిసరాలను పర్యాటక స్థలంగా తీర్చిదిద్దడానికి గుల్జార్‌హౌస్, షాలిబండ రోడ్డును 'నో ట్రాఫిక్ జోన్' గా ప్రకటించే యోచన ఆచరణకు దూరం అయింది.

### చివరగా...!

"ఖజురహో గురించి తెలియని వారుండరు. ఖజురహో వెళ్లిన ప్రతివారూ 10వ శతాబ్దంనాటి అపురూప కళాఖండాలను తమతో పాటుగా తీసుకవచ్చి తమ ఇళ్ళల్లో అమర్చుకునే వారు. ప్రస్తుతం అక్కడ కొన్ని శిథిలాలు మాత్రమే మిగిలాయి. ఎన్నో అపురూప శిలా, శిల్పాలు దిక్కూమొక్కూ లేకుండా పడి వున్నాయి."- ఇదీ నేడు దేశంలోని చరిత్ర స్థితి. తవ్వకాలు జరగక అనేక చరిత్ర ఆధారాలు మట్టి పొరల మధ్యే సమాధి అవుతున్నాయి. బయల్పడిన వాటిని ముఠాలు స్వాధీనం చేసుకుని సరిహద్దులు దాటిస్తున్నాయి. గుప్తనిధుల కోసం మరికొందరు చరిత్ర స్థావరాల్ని ధ్వంసం చేస్తున్నారు. చరిత్ర నుంచి పాఠాలు నేర్చుకోని వారిని చరిత్ర ఏ మాత్రం క్షమించదు.

మార్చి, 2002,
విజయవిహారం





## తెలుగునేలపై ఆదిమానవుడి అడుగుజాడలు

రాష్ట్ర వ్యాప్తంగా ఆదిమానవుడి ఆనవాళ్ళు పలుచోట్ల బయల్పడుతున్నాయి. ఈ పరిణామ క్రమంలోనే...కడప జిల్లాలోనూ కొన్ని చోట్ల ఆధారాలు వెలుగుచూశాయి. ఈ నేపథ్యంలో తెలుగునేలపై ఆదిమానవుని అడుగుజాడలపై వీక్షణం...

### కడప జిల్లాలో...

టి.సుండుపల్లి మండలం రాయవరం నుంచి నడక సాగిస్తే కొండ బండల మాటున దాగిన బృహత్ శిలా సంపద బయట పడుతుంది.

ఆదిమానవుని అవశేషాలతో నిర్మితమైన రాతి సమాధులు యాభైకిపైగా అక్కడ బయల్పడ్డాయి. ప్రత్యేకంగా సేకరించబడిన సహజసిద్ధమైన పెద్దపెద్ద బరువైన బండరాళ్ళతో ఈ నిర్మాణాలు తయారు చేశారు. ఈ రాతి సమాధుల నిర్మాణంలో సుమారు పది అడుగుల ఎత్తున్న బండరాళ్ళను నిలబెట్టి, పైకప్పుగా మరో బండరాయిని ఉపయోగించే పద్ధతి కన్పిస్తుంది.

చనిపోయిన వారి ఆత్మలు శాంతింప జేయడం కోసం, వారికి ఆహారాలు అందివ్వడం కోసం సమాధులకు రంధ్రాలు చేశారు. కొన్ని రాతి సమాధులకు బొరియలుంటే మరి కొన్నింటికి వుండవు. సమాధులను చిన్నచిన్న గులకరాళ్ళతో నింపారు. ఇలాంటి రాతి సమాధికి చుట్టూ రక్షణ కవచంగా ఒకేరీతి బండరాళ్ళతో ప్రాకారం నిర్మించడం విశేషం. ఇవన్నీ ఒకే కొండపైన గుంపులు గుంపులుగా నిర్మించబడ్డాయి. బృహత్ శిలా యుగపు రాతి సమాధులైన వీటిపై

మరిన్ని పరిశోధనలు జరగాల్సి వుంది. వీటి గోడలపై వేటగాడు, ఏనుగు, తాబేలు, పాత్రల బొమ్మలు చెక్కబడి వున్నాయి. గత చరిత్రను మౌనంగా విశ్లేషించే సమాధులపై మరింత అధ్యయనం జరగాలి. లేకుంటే ముందు తరాల వారికి చరిత్ర ఆధారాలు అందకుండానే శిథిలమైపోతాయి. కడప జిల్లాలో నీరు పుష్కలంగా లభించే పాపఘ్ని, మాండవి, పావని, సగిలేరు, పెన్నా, చిత్రావతి, కుముద్వతి నదీ తీరాల్లో ఆదిమానవులు నివశించిన ఆధారాలు దొరికాయి. 'పాండవగుళ్ళు'గా పిలిచే పురాతన కాలంనాటి మానవ సమాధుల అవశేషాలను చిన్నకుంటాల, ఎర్రబల్లి గ్రామాల వద్ద గుర్తించినట్లు లార్డ్‌సీవెల్ రచనలు చెప్తున్నాయి.

పోరుమామిళ్ళ, శంఖవరం, కోడూరు ప్రాంతాల్లో ఆదిమానవుడికి చెందిన అనేక అవశేషాలు వెలుగుచూశాయి. ఈ ప్రాంతంలో లభించిన ఆధారాలను బట్టి చూస్తే ఇక్కడే పాండవగుళ్ళు క్రీ.పూ. మూడో శతాబ్దానికి చెందినవని గుర్తించారు. మృతదేహాల సమాధుల్లో ప్రత్యేకంగా పూడ్చిన పరిస్థితులు, కాల్చగా మిగిలిన ఆనవాళ్ళు, అవశేషాల రూపంలోనూ, కళేబరాలు శిలజాల రూపంలోనూ లభ్యమయ్యాయి. మృతదేహాలను విభిన్న రీతుల్లో నిక్షిప్తం చేసే ఆచారాలు కూడా వుండేవనడానికి తగిన ఆధారాలు కూడా ఇక్కడే లభ్యమయ్యాయి.

## కర్నూలు జిల్లాలో...

కర్నూలు జిల్లా బనగానపల్లి వద్ద గుహలలో చరిత్రపూర్వపు మానవుని అరుదైన అవశేషం లభించింది. యాగంటి వద్ద పాతపాడు గుహలలో జరిపిన తవ్వకాలలో లభించిన ఆధారాలు ఎన్నో అవశేషాల ఆనవాళ్ళను తెలియజేస్తున్నాయి. మానవ అవశేషాలతో పాటు లఘుక్షీరదాల అవశేషాలు సైతం ఇక్కడ లభించాయి. గుహలలో తవ్వితీసిన మట్టిని జల్లెడ పట్టగా కొన్ని లఘుక్షీరదాల పళ్ళు దొరికాయని భారత భూగర్భపరిశోధనా సంస్థ (జి.ఎస్.ఐ.) శాస్త్రజ్ఞులు వెల్లడించారు. ఈ పళ్ళు గబ్బిలం, ఎలుకలు, పిల్లులు, పందికొక్కులు, కోతులను పోలిన లఘుక్షీరదాలవని శాస్త్రజ్ఞులు భావించారు.

ఇంకా పెద్ద జంతువుల శరీర భాగాల అవశేషాలు కూడా ఈ గుహలలో లభించాయి. హైనాను పోలిన జంతువు అవశేషాలు, ప్రస్తుతం భారతదేశంలో అంతరించి, ఆఫ్రికాలో ఇంకా సంచరిస్తున్న ఐదుజాతుల జంతు అవశేషాలు ఈ గుహలలో కన్పించాయి. ఈ అవశేషాలు అన్నింటిలో ప్రాచీన మానవుని దవడ భాగానికి గల శాస్త్రీయ ప్రాధాన్యం విశేషం.

ఇలాంటి మానవ అవశేషం మధ్యప్రదేశ్‌లో నర్మదాలోయ తవ్వకాలలో దొరికింది. అయితే బనగానపల్లి గుహల మానవుని దవడ ఇంకా పెద్దది. చెక్కుచెదరని స్థితిలో లభించింది. మూడుపళ్ళు దవడలో వున్నాయి. మరో మూడు పళ్ళు విడిగా ప్రక్కనే లభించాయి.

బనగానపల్లి వద్ద గుహలలో 1880 ప్రాంతంలో తవ్వకాలు జరిపిన బ్రిటీష్ భూగర్భ



శాస్త్రజ్ఞుడు హెన్రీబ్రూస్‌పుంటే, ఆయన కుమారుడు రాబర్ట్‌బ్రూస్‌పుంటే ఈ గుహలలో శిలాభూతమవుతున్న భూభాగం చరిత్రపూర్వం(UPPER PLAISTOCENE) నాటిదని నిర్ధారించారు. అప్పర్‌ప్లాయిస్టోసిన్ యుగం సుమారు లక్ష సంవత్సరాల క్రితం ప్రారంభమై పదివేల ఏళ్ళకు పైగానే క్రితం ముగిసింది.

ఈ దవడ భాగం 12వేల సంవత్సరాల నుంచి 15వేల సంవత్సరాలకు పూర్వముదై వుండవచ్చునని అంచనా వేస్తున్నారు. ఇప్పటి మానవుని దవడతో పోలిస్తే ఆదిమానవుడి నోరు బలమైనదని, నోటిలో నమిలే భాగం మరింత విశాలమైనదని శాస్త్రజ్ఞులు వెల్లడించారు. ప్రాచీన మానవుడి పన్ను వెడల్పుగా, ధృఢంగా వుంది. ఈ గుహలోనే దొరికిన మనిషిపుర్రెలోని ముక్కు, చెక్కిలి బొమిక ఇప్పటి మనిషి శరీర భాగాల కన్నా చాలా బలంగా వున్నాయి. గుహలలో ఇంత ప్రాచీన మానవ అవశేషం లభించడం దేశంలోనే ఇదే ప్రథమం. ఈ గుహలలోనే రాతియుగం నాటి పనిముట్లు రాతిగొడ్డలి, రాతికత్తి వంటివి కూడా దొరికాయి.

నియాండర్తల్ మానవుడి కాలంలో వాతావరణంలో విపరీతమైన మార్పులు వచ్చాయి. మంచు, చలి పెరిగిపోయాయి. అంత వరకు ప్రకృతిలోనే గడిపిన ఆదిమానవుడు గృహాలుగా గుహలను ఎంచుకున్నాడు. చనిపోయిన మనుషుల శవాలను జాగ్రత్తగా పాతిపెట్టడం నేర్చుకున్నాడు. అలా గుహలలోనే జీవనం ప్రారంభించి తనకు సంబంధించిన పలు చిత్రాలను ఆ గోడలపై లిఖించడం మొదలుపెట్టాడు. ఈ రోజు మనం చూస్తున్న పలు పెయింటింగ్‌లు, రాతి కుంచెతో చెక్కిన ఎన్‌గ్రేవింగ్స్ అలాంటి రకానికి చెందినవే. వీటి కోసం చెట్ల బెరడు నుంచి తీసిన రసాలు, ఎముకల పొడి వంటివి వాడేవారు. వివిధ జంతువుల ఆకృతిలో బొమ్మలను తయారు చేసి వాటిల్లో మృతదేహాలను నిక్షిప్తం చేసేవారని, కాల్చగా మిగిలిన అవశేషాలను ప్రత్యేక పాత్రల్లో నిక్షిప్తం చేసేవారని పరిశోధనల్లో వెల్లడైంది.

మన పూర్వీకుల గురించి తెలుసుకోవాలనే తపన చరిత్ర ప్రియులకెవరికైనా వుంటుంది. ఇప్పుడు కర్నూలులో దొరికిన అవశేషాల ఆధారంగా మరిన్ని వివరాలు లభ్యం కావచ్చు. ఆదిమానవుడి రహస్యాలను, రాతియుగంనాటి సమాచారాన్ని క్రమక్రమంగా తెలుసుకుంటూ వస్తే మరిన్ని ఆసక్తికర అంశాలు వెల్లడయ్యే అవకాశం వుంది. అయితే ఆ దిశగా పరిశోధనలు సాగాల్సిన వుంది.

## అనంతపురం జిల్లాలో...

ఆది మానవుడి సమాధులు, రాతియుగపు నిర్మాణాలను పోలిన కట్టడాలు ఎన్నో అనంతపురం జిల్లాలో బయల్పడ్డాయి. గుంతకల్లుకు ఐదుకిలోమీటర్ల దూరంలోని గూళ్లపాళ్యం నుంచి కర్నూలు జిల్లా పత్తికొండ వరకు దాదాపు వందకుపైగా వెలుగులోకి వచ్చాయి.

స్థానికులు వీటిని ఇప్పుడు కావలిగట్లుగా వ్యవహరిస్తున్నారు. ఇవి పది అడుగుల ఎత్తు, పది మీటర్ల చుట్టుకొలతతో గుండ్రంగానూ, మరికొన్ని దీర్ఘచతురస్రాకారం గానూ వున్నాయి. పెద్దరాళ్ళతో నిర్మించి మధ్యలో దంపుడు మట్టితో నింపి, చూడడానికి చిన్నపాటి బురుజులా కనిపిస్తాయి. చనిపోయిన వారి ఆత్మలకు ఆహారం అందించడానికి వీలుగా ఈ సమాధులకు కంత (బొరియ)లను కూడా ఏర్పాటు చేసుకొని వుండడం విశేషం. ఆదిమానవులు గుహలలో నివశించేటప్పుడు వారిలో ఎవరైనా చనిపోతే, ఆ శవాన్ని నీటిలో కానీ, భూమిలో పాతిపెట్టి కానీ కొన్నాళ్ళ తర్వాత వాటి ముఖ్యమైన ఎముకలు సేకరించి వాటిని ఏదైనా పాత్రలో భద్రపరిచి సమాధి చేసేవారు. ఈ సమాధులు ఒక్కో ప్రాంతంలో ఒక్కో విధంగా నిర్మించేవారు. అనంతపురం జిల్లా భౌగోళికంగా కొండలు, గుట్టలు, అరణ్యాలు, వాగులు, వంకలు కలిగివుండడం వలన ఈ ప్రాంతం ఆదిమానవుని సంచారానికి, స్థిర నివాసాలకు కారణమైంది. ఇందుకు సంబంధించి జిల్లా భారతీయ ప్రాచీన కళలు, సంస్కృతీ పరిరక్షణ సంస్థ (ఇంటాక్) కృషి చేసి ప్రాచీన మానవుడి ఆనవాళ్ళని వెలుగులోకి తెచ్చింది. జిల్లాలో డాల్మెన్స్, మోన్‌హిర్స్, పిట్‌బరియల్స్, అలైనమెంట్, స్టోన్‌సర్కిల్, తదితర రకాలకు చెందిన సమాధులున్నట్లు గుర్తించారు. ఈ సమాధులపైన శాస్త్రవేత్తలు పరిశోధనలు సాగిస్తే ఆదిమానవుడి గురించి మరెన్నో విషయాలు వెలుగు చూసే అవకాశం ఉంది.

### చిత్తూరు జిల్లాలో...

శేషాచల అరణ్య ప్రాంతం ఆదిమానవుడి ఆవాసంగా చరిత్రకెక్కింది. కానీ ఇందులోకి ఈ మధ్య ప్రవేశించడానికి ఎవరూ కృషి చేయలేదు. కానీ భయంకరమైన పెద్దపులులు, అనకొండచిలువలతో దద్దరిల్లే శేషాచల అటవీ ప్రాంతంలోకి ఎంతో ధైర్యంతో ఆదిమానవుడి ఆనవాళ్ళ కోసం అడుగుపెట్టే సాహసం జర్నలిస్ట్ బి.వి.రమణ ఆధ్వర్యంలోని మొజాయిక్ అడ్వెంచరర్స్‌క్లబ్ (మ్యాక్) మాత్రమే చేయగలిగింది.

తిరుమలలో నుంచి 11కిలోమీటర్ల దూరంలో దట్టమైన అడవిలో కాలినడకన ప్రయాణం చేసి 'తాంత్రిక కోన' చేరుకొని అక్కడ ఆదిమానవుడు జేగురురంగుతో చిత్రించిన చిత్రాల్ని కనుగొన్నారు. తర్వాత ఏడు కిలోమీటర్ల దూరం ప్రయాణిస్తే 'గంగులోడికోన'లోనూ వీరు రాతియుగం నాటి ఎన్‌గ్రేవింగ్స్ (రాతికుంచెతో చెక్కిన చిత్రాలు), పెయింటింగ్స్, రాతి పనిముట్లు సేకరించగలిగారు.

ఆ తర్వాత చిత్తూరు, కడప జిల్లాల ఉమ్మడి అటవీ ప్రాంతమైన శ్రీ వేంకటేశ్వర అభయారణ్యంలోని 'మొగిలిపెంట' పరిధిలోని 'యుద్ధగళతీర్థం' పర్యటించి ఆదిమానవుడి రాతిపనిముట్లు, ఆదిమానవుడు గీసిన అంబోతు చిత్రాల్ని గుర్తించగలిగారు. అలాగే



'పూలగూరపెంట' వద్ద విలువైన రాతికుడ్యం, 'గజరాణి' చిత్రాన్ని మ్యాక్ బృందం సేకరించగలిగింది.

వీరి పరిశోధనల కారణంగానే సిద్దేశ్వరకొండ ప్రాంతంలో శిలాయుగంకు సంబంధించిన ఎన్నో చారిత్రాత్మక ఆధారాలు లభ్యమయ్యాయి. ఆనాటి రాతి పనిముట్లు, మట్టిపాత్రలు, రాతిగొడ్డళ్ళు ఇలా ఎన్నో విలువైన ఆధారాలు కనుక్కోగలిగారు. కోట్లు ఖర్చుపెట్టినా యూనివర్శిటీలు చేయలేని పనిని, పడలేని నిరంతర శ్రమని రమణగారి ఆధ్వర్యంలోని 'మ్యాక్' చేయగలిగింది. ఆదిమానవుల ఆవాసం యుద్ధగళతీర్థం, కొత్తరాతియుగం మానవుడు, ఆదిమానవుడి చిత్రాలపైన సవివరమైన అధ్యయనాన్ని చేసిన 'మ్యాక్' కృషి ప్రశంసనీయం.

### వరంగల్ జిల్లాలో...

200-250 బిలియన్ సంవత్సరాల నాటి జీవపరిణామ రహస్యాలెన్నో వరంగల్ జిల్లాలోని ఏటూరునాగారం, లుడ్వాయి తదితర మండలాల్లోని అడవుల్లో రాతియుగం నాటి దాఖలాలు లభ్యమయ్యాయి. లభించిన ఆధారాలు, బయల్పడిన రాతి గుహలు పలు పరిశోధనలకు వేదికయ్యాయి. ఏటూరునాగారం మండలంలోని తూర్పు సర్వాయి వద్ద అడవిలోకి ప్రవేశించి అన్వేషిస్తూ 14వేల మిలియన్ సంవత్సరాల క్రితం నుంచి వాతావరణంలో చెట్లు శిలలుగా మారిన స్థితి (ఫాజిల్స్)ను కనుగొన్నారు. సరీసృపాల నుంచి పక్షుల జాతి పరిణామం చెందే దశలోని జీవపరిణామ రహస్యాల్ని శాస్త్రజ్ఞులు శోధిస్తున్నారు.

రాకాసి దిబ్బలుగా వ్యవహరించబడే ఆదిమానవుడి ఆవాసాలు ఇక్కడే బయల్పడ్డాయి. ప్రస్తుతం మూడుగుహలు మాత్రమే బయల్పడినప్పటికీ పరిశోధనలు జరిగితే మరిన్ని వెలుగు చూసే అవకాశం వుంది. ఇక్కడే ఆదిమానవుడు ఉపయోగించిన పనిముట్లు, ఆయుధాలు కూడా లభించాయి. తాడ్వాయి మండలంలోని దామెరవాయి ప్రాంతంలో ఆదిమానవుడి రాతి సమాధులు గుర్తించారు. అటూ ఇటూ పెద్దపెద్ద బండలు పేర్చి శవం పాడుకాకుండా సమాధులను తవ్వి, మనిషి మరణించాక కూడా మళ్ళీ కొంతకాలం తర్వాత బతికొస్తాడనే నాటి విశ్వాసంతో ఏకీభవిస్తూ కొన్ని నీటి తొట్టెలు, ఆహారం పెట్టి పూడ్చేవారు అనడానికి కావలసిన అన్ని ఆధారాలు ఇక్కడ లభించాయి. (మనిషి కోతి నుంచి పరిణామం చెందే దశల్లో వరుసగా రామాపిథికస్, ఆస్ట్రలోపిథికస్, హూమో ఎరక్టస్, ఎర్లీహూమోపియన్స్, నియాండర్‌థల్, క్రోమాగ్నాస్ దశలుంటాయి. ఈ దశల్లో అత్యంత కీలకమైన దశగా పరిగణించే నియాండర్‌థల్ మానవుడి దశ మనకు ఆఫ్రికా, యూరప్, ఆసియా ఖండాల్లో మాత్రమే బయల్పడినట్లు ఆధారాలున్నాయి. అయితే ఏటూరునాగారం అడవుల్లో నియాండర్‌థల్ మానవుడికి చెందిన పలు ఆధారాలు లభించాయి. ఇది ఎంతో ప్రాధాన్యం గల విశేషం.)

## ఖమ్మం జిల్లాలో...

ఖమ్మం జిల్లాలోని గుండాలమండలం గటభ, మత్తాపురం గ్రామాల సమీపంలోని దట్టమైన అడవుల్లో రాతియుగానికి చెందిన కట్టడాలు బయల్పడ్డాయి. ఆ ప్రాంతమంతా ఒక పట్టణాన్ని తలపిస్తుంది. కొన్ని ఇళ్ళు ఒకవైపు మరికొన్ని ఇళ్ళు ఒకవైపు ఒక క్రమ పద్ధతిలో నిర్మించబడిన రాతి ఆవాసాలు అవి. ఇక్కడ వీటికి అనుబంధంగా కొన్ని రాతి అవశేషాలు బయల్పడ్డాయి. రాతి తలుపులు, నీటి కుండీలు సైతం ఇక్కడ లభించాయి. ముత్తాపురం సమీపంలో నిమ్మలవాగు చెరువు కోసం తవ్వకాలు జరుపుతుండగా ఈ రాతి కట్టడాలు, నిర్మాణాలు వెలుగు చూశాయి. స్త్రీ ఆకారంలో వున్న శిలాకృతి, రాతితో చేసిన నీటి తొట్టి, రాతిగృహం మరికొన్ని ప్రత్యేకించి చెప్పుకోదగిన శిలా నిక్షేపాల్ని గురించి ప్రభుత్వం స్పందించకపోవడం సామాజిక, పర్యావరణ వాదులకు నిరాశ కల్గిస్తోంది.

## ఆదిమానవుడి ఉనికి

ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాల సరిహద్దుల్లోని అడవుల్లో, ఆధునిక సమాజం గుర్తించని లోతట్టు ప్రాంతాలలో ఆదిమానవుడి ఉనికి వెలుగులోకి వస్తోంది. ఆదిమానవుడి సమాధుల్ని పలుచోట్ల రాకాసిగుళ్ళుగా వ్యవహరించడం జరుగుతోంది. నెల్లూరు జిల్లా ప్రాంతంలోని బుచ్చిరెడ్డిపాలెం, జొన్నవాడ పరిసరాల్లో ఇలాంటి రాతి నిర్మాణాలు కనుక్కొన్నారు. నల్లగొండ జిల్లా భువనగిరి వద్ద, కరీంనగర్ జిల్లా సింగాపూర్, పోరండ్ల, బుడిగేపల్లి, బోర్నపల్లి, తుమ్మనపల్లి ప్రాంతాల్లో రాకాసిగుళ్ళు వున్నాయి. శవాల ఎముకలు, మట్టిపెంకులు, రాతి ఆయుధాలతో ఈ సమాధులు పూడ్చబడి వున్నాయి. వలయాకారాల్లో వుంచిన రాతిగుళ్ళుతో ఇవి నిర్మాణమై వున్నాయి. కల్వకుర్తి దగ్గరి ఊరకొండ వద్ద, మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల, ఆలంపూర్ వద్ద మరికొన్ని బయల్పడ్డాయి. ఈ ఆధారాలన్నీ ఆదిమానవుని ఉనికిని విశ్లేషిస్తున్నాయి.

కరీంనగర్ జిల్లా మహదేవపూర్ ప్రాంతంలోని లోతట్టు ప్రాంతాల్లో శిలా సంస్కృతికి చెందిన మరికొన్ని రాతి సమాధులు కనుగొనబడ్డాయి. కర్నాటక బళ్ళారి జిల్లాలో హుబర్ట్ టి.వాక్స్, రాబర్టు సివెల్ శాస్త్రవేత్తలు 1891 నాటికే ఆయా ప్రాంతాల్లో పరిశోధనలు చేశారు. బళ్ళారి పరిధిలోని టెక్కిలికోట, సంగనకల్లు, కపగల్, హలకుంటి, బ్రహ్మగిరి, మస్కీ, ఉట్నూరు ప్రాంతాల్లో పరిశ్రమించి ఆదిమానవుడి ఆనవాళ్ళు అన్వేషించారు.

గంగావతి తాలూకా హిరేబెణకల్ గ్రామం గంగావతి-కొప్పళ మార్గ మధ్యంలో మొరియరగడ్డ, తళవారనమూలె, దుర్గదడి అనే ప్రదేశాలలో కల్లోరీలుగా పిలువబడే ఆదిమానవుడి రాతి సమాధులు గుర్తించారు. వీటిని క్రీ.పూ. 900-200నాటి లోహయుగపు



బృహత్ శిలా సంపదగా నిర్ణయించారు.

వరంగల్ జిల్లాలో లభించిన ప్రాచీన వృక్ష శిలాజాలకు కూడా 110 మిలియన్ సంవత్సరాల చరిత్ర వున్నట్లు తెలుస్తోంది. మెసింబ్రియోజైలాన్‌గా శాస్త్రీయ నామంతో వ్యవహరించే వృక్షజాతి ఏదైనా బలమైన కారణం చేత నీళ్ళలోనికి విరిగిపడిపోయి శిలీకరణం చెందడం వలన అవి వృక్షశిలాజాలుగా మారి వుండవచ్చునని శాస్త్రవేత్తల భావన. గోండ్వాన్ యుగంలో నీటిలోని సిలికాన్ రేణువులు వృక్షాల్లోని లోతుల్లోకి దిగబడిపోవడం వలన ఈ పరిణామం సంభవించడానికి కారణమైంది. ఆదిమానవుడి కాలం నాటి వాతావరణ జీవ పరిణామ రహస్యాల్ని ఇవి ఆవిష్కరిస్తున్నాయి.

## సాహసవీరుడు బి.వి.రమణ

"బాటసారి డైరీ నిండా
విజ్ఞాన పాదముద్రలే...'

ఈ వాక్యానికి సరిగ్గా సరిపోయే వ్యక్తి బి.వి.రమణ.

ఆది మానవుడి ఆనవాళ్ళ అన్వేషణ నిమిత్తం కొండలు, కోనలు, వాగులు, వంకలు, పగలూ, రాత్రీ తేడా లేకుండా పరిశ్రమించిన సాహసి. మొజాయిక్ అడ్వెంచరర్స్ క్లబ్ (మాక్)ను స్థాపించి అరణ్య ప్రకృతిని ఆస్వాదిస్తూ శేషాచలం కొండలను వేదికగా చేసుకొని 'ట్రెక్కింగ్'ను ఒక ఉద్యమంలా నడుపుతున్న వీరుడు. ఇదంతా మనకెందుకు రమణా? అని ప్రశ్నిస్తే 'చరిత్రను మనమే అధ్యయనం చేయాలి' అని బాధ్యతగా జవాబిచ్చే మనిషి. ట్రెక్కింగ్ అంటే పిక్నిక్ కాదు. ఫ్యాన్సీ వ్యవహారం అంతకంటే కాదు. ఇది 'సత్య శోధనతో తనలోకి తాను చేసే అంతర్ముఖీన యాత్ర' అంటారు రమణ. అవును... ఎన్నో యూనివర్శిటీలు, ప్రొఫెసర్లు చేయలేని పరిశోధనలు పట్టుదలతో తన సొంత ఖర్చుతో రమణ చేసి చూపాడు.

చిత్తూరు జిల్లాలోని తాంత్రికకోన, గంగులోడికోన, మొగిలిపెంట, యుద్ధగళతీర్థం, పులగూరపెంట, గుంజనజలపాతం, సిద్దేశ్వరకొండ ఇలాంటి ఎన్నో ప్రాంతాల్లో క్రూర జంతువుల్ని ఎదుర్కొంటూనే కాలినడకన ఆదిమానవుడిపైన అధ్యయనం చేశాడు. ట్రెక్కింగ్ ద్వారానే కొత్త విషయాల ఆవిష్కరణ, కనుగొనడం, అన్వేషణ(DISCOVERY, INVENTION, EXPLORATION) సాధ్యమని రమణ గట్టిగా విశ్వసిస్తారు. ఈ రవాణా సాధనాలు ఏవీ లేని కాలంలో కేవలం కాలనడకన సుదూర ప్రాంతాలు పర్యటించి ప్రయాణించి జ్ఞానతృష్ణ తీర్చుకునేవారు. గౌతమబుద్ధుడు, వర్ధమాన మహావీరుడు లాంటి వాళ్ళుసైతం ట్రెక్కింగ్ చేస్తూ జ్ఞాన బోధ చేశారనే విషయాన్ని విశ్లేషిస్తారు. పన్నెండు సంవత్సరాలుగా ఆయన పరిశ్రమిస్తున్నారు. గతంలోనే భారత, టిబెట్ హద్దుల మధ్యగల హిమాలయ పర్వత

సానువుల్లోని 'శివలింగ్‌పాస్'ను కూడా వీరు అధిరోహించి వచ్చారు. ఆదిమానవుడి అడుగుజాడలు గుర్తించి అధ్యయనం చేస్తున్న రమణ ఒక సాహసి... సాహసం....అడ్వెంచర్!

### పరిశోధనలు జరగాలి!

చరిత్రను అధ్యయనం చేస్తున్నప్పుడు చాలా ప్రశ్నలు శేషప్రశ్నలుగానే మిగిలిపోతాయి. ప్రశ్నలకు సమాధానం అంత తేలికగా దొరకదు. జవాబుల కోసం అన్వేషించడంలోనే కాలం గడిచిపోతూ వుంటుంది. కాలం గడిచే కొద్దీ సమాధానాలు మరింత జటిలం అవుతుంటాయి. అలాంటిదే ఆదిమానవుడి అధ్యయనం. మిస్టరీలను ఛేదించుకుంటూ ముందుకు పోవడమే ఇలాంటి అంశాల్లో కీలక ప్రక్రియ.

ఆదిమానవుడు వాడిన పనిముట్లు, ఆయుధాలు ఎన్నో రాతి సమాధుల మధ్యనే కరిగిపోతున్నాయి. శిథిలమవుతున్నాయి. అలాంటి వాటిని సేకరించి, రక్షించి, భద్రపరిచి పరిశోధనలు సాగించి జీవ పరిణామానికి సంబంధించిన విషయాలపై పరిశోధనలు సాగాల్సి వుంది. కానీ ఇలాంటివేవీ జరగడం లేదు. ఆదిమానవుడి ఆవాస ప్రాంతాల్ని రక్షిత ప్రాంతాలుగా ప్రకటించాల్సి వుంది. అదీ జరగలేదు.

పలుచోట్ల ప్రాచీన చరిత్రకు సంబంధించిన శిలా సంపదను ముక్కలు చేసుకొని తమ అవసరాలకు వినియోగించుకుంటున్నారు. మరి కొందరు చరిత్రతో వ్యాపారం చేస్తున్నారు. ఇంకొందరు ధ్వంసం చేస్తున్నారు. చరిత్ర పరిరక్షణ పట్ల ప్రభుత్వం సానుకూలంగా స్పందించడం లేదు. పరిశోధనలు జరిపించి సమగ్ర అధ్యయనానికి శ్రీకారం చుట్టాలి. చరిత్ర అవశేషాల్ని, ఆనవాళ్ళని మ్యూజియాలుగా మార్చాలి. మనకు తెలియని మన చరిత్రను ఆవిష్కరిస్తున్న బృహత్ శిలాసంపదను పరిరక్షించుకోవాలి. ఈ రోజు నిర్లక్ష్యంతో పరిరక్షణ ప్రతిపాదనను పట్టించుకోకపోతే అనేక బిలియన్ సంవత్సరాల నాటి శిలాజ సంపద మట్టిపొరల మధ్య సమాధి అవుతుంది. అంతరించి పోతుంది. చరిత్రను కోల్పోయిన రోజున మనమూ మిగలం 'కాదంటారా?'



# జీవనచిత్రం



## రాయలసీమ రాజకీయం
## ముఠాకక్షల హత్యల తోరణం

రాయలసీమ నిరంతరం రగిలే అగ్నిగుండం. పోరాటాలకు ప్రధాన స్థావరం. ఊరికో పాలెగాడు వుండేవాడు. ఏ ఊరికి వాడు రాజుగా ఆయా ప్రాంతాల్లోని ఊర్లను పంచుకుని పాలెగాళ్ళు పాలించారు. క్రీస్తుశకం 17,18 శతాబ్దాల కాలంలో సీమలో ఈ పాలెగాళ్ళదే ఆధిపత్యంగా వుండేది. వీరు తీసుకున్న నిర్ణయాలే శాసనాలుగా అమలయ్యేవి. ఆ కాలంలోనే పాలెగాళ్ళు న్యాయాన్ని, ధర్మాన్ని పాటిస్తూ ప్రజాపాలన చేశారు. తప్పు జరిగిందని తెలిస్తే అక్కడికక్కడే శిక్షలు అమలు జరిపేవారు. ఎదురు చెప్పిన వారి తల బురుజునకు వేలాడగట్టేవారు. దీనివల్ల ప్రజల్లో భయం ఏర్పడి మరోసారి తప్పులు చేయకుండా నడుచుకునేవారు. తాము చెప్పిందే వేదం. తాము చేసిందే శాసనంగా చెలాయించిన పాలెగాళ్ళు నిరంకుశ పాలన కొనసాగించనప్పటికీ వారి పరిపాలన క్రమశిక్షణతో కూడుకొని ఉండటంతో ప్రజల అభిమానం పొందలేకపోయారు. పాలెగాళ్ళను ఎదిరించడం అంటే ప్రాణాలు పోగొట్టుకోవడమే అని చుట్టుప్రక్క రాజ్యాల రాజులు బెదిరిపోయేవారు. ఎలాంటి కార్యమైనా పాలెగాళ్ళు తలుచుకుంటే క్షణాల్లో జరిగిపోయేది. గ్రామపెద్దలు ఏర్పడి వారే ముఠాలను కూడగట్టకోవడం ప్రారంభించారు. ఇప్పటికీ ఇలాంటి ముఠాలదే సీమలో రాజ్యం. వారిదే అధికారం.

రాయలసీమ హత్యారాజకీయాలకు వేదికగా రాజధాని నగరం హైదరాబాద్ మారుతోంది.

1997 నవంబర్ 19న రామానాయుడు స్టూడియో బయట జరిగిన బాంబుపేలుడు సంఘటన ఈ విషయాన్ని మరింత బలపర్చుతోంది. జరిగిన లోక్‌సభ ఎన్నికల అనంతరం ఇప్పుడిప్పుడే రాయలసీమలోని ముఠాకక్షలు, వర్గవైషమ్యాలు మళ్ళీ పంజా విసరడానికి సిద్ధపడుతున్నాయి. సీమలో వేటకొడవళ్ళ సాక్షిగా ప్రారంభమైన హత్యారాజకీయాలు నేడు బెల్జియం, ఇంగ్లాండ్ తుపాకుల స్థాయికి చేరుకుందంటే పరిస్థితి ఎలా వుందో ఊహించుకోవచ్చు. ప్రత్యర్థుల మీద పగ సాధించడం కోసం ఆధునిక సాంకేతిక పద్ధతులు వినియోగిస్తున్నారు. అనంతపురం జిల్లా చిక్కేపల్లి గ్రామం వద్ద ఒక శక్తివంతమైన మందుపాతర పేలి ఎనిమిది మందిని దారుణంగా బలితీసుకున్న సంఘటన చెరిగిపోలేనిది. ఈ మందుపాతరను పేల్చిన వ్యక్తి కూడా అక్కడికక్కడే అదే విధ్వంసానికి బలికావడం... పెనుకొండ శాసనసభ్యుడు చెన్నారెడ్డిని పోలీసుల వేషంలో వచ్చి హత్య చేసిన సంగతి...మద్దులచెరువు గ్రామంలో కాంగ్రెస్ శాసనసభ్యుడు సూర్యనారాయణరెడ్డిని హతమార్చడం కోసం ఇంటిలోని టి.వి.లో బాంబుపెట్టడం...పేల్చడం...వంటి సంఘటనలు ఇక్కడి రాక్షస రాజకీయాన్ని వివరిస్తాయి. వర్గపోరాటాల విషపుకోరల్లో చిక్కి ఇంటికొక్కరు కూడా మిగలకుండా ఫ్యాక్షనిజానికి ఆహుతైన కుటుంబాలు ఎన్నో!

అతిచిన్న తగాదాలు సైతం కక్షలుగా మారి తీవ్రరూపం దాల్చి గ్రామాలకు గ్రామాలే దహించుకుపోవడం లేదా, వలస పోవడం వంటి సంఘటనలు ఎన్నెన్నో. నిత్యం చావు కోరల్లో బతకటం యిష్టం లేక రాజధాని హైదరాబాద్‌ను రక్షిత ప్రదేశంగా భావించి అక్కడికెళ్ళి తలదాచుకుంటుంటే... పగబట్టిన ఫ్యాక్షన్ ప్రాణాలు తీసేదాకా నిద్రపోవడం లేదు. గతంలో తెలుగుదేశం జమ్మలమడుగు నియోజకవర్గం శాసనసభ్యుడు పి.శివారెడ్డి పట్టపగలు హైదరాబాద్ నడిబొడ్డున దారుణహత్యకు గురికావడం, బంజారాహిల్స్‌లో అనంతపురం మాజీ ఎం.ఎల్.ఏ. ఎస్.వి.రమణారెడ్డి సోదరుడు ఓబుల్‌రెడ్డితో పాటు మరో ఇద్దరిని దారుణంగా నరికి చంపడం, అనంతపురం జిల్లాకు చెందిన తెలుగుదేశం మాజీ మంత్రి పరిటాల రవిపై ఫియట్‌కారు బాంబు విధ్వంసం... వంటి సంఘటనలు నిదర్శనాలు.

## రాజధానిలో రక్తపాతం

1993 ఆగస్ట్ 7వ తేదీన హైదరాబాద్ నడిబొడ్డున పట్టపగలు బాంబుదాడిలో తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యే పి.శివారెడ్డి హత్యకు గురికావడంతో ప్రారంభమైన సీమ రాజకీయ హత్య యిప్పటికీ చెరిగిపోని చేదు జ్ఞాపకమే! పంచాయతీరాజ్ శాఖ చీఫ్ ఇంజనీర్ చలమారెడ్డి కుమార్తె వివాహానికి హాజరవ్వటానికి శివారెడ్డి ఇతర ఎమ్మెల్యేలతో పాటు కల్యాణ మండపానికి వచ్చి తిరిగి వెడుతుండగా ఎనిమిది మంది అగంతకులు ఆయనపై బాంబులు విసిరారు. ఈ



దాడివల్ల ఆయన కుడిచెయ్యి నుజ్జునుజ్జయ్యి మిగతా శరీరం నుంచి విడిపోయింది. దుండగులు మొత్తం శక్తివంతమైన ఆరు నాటుబాంబులు విసిరారు. బాంబుల దాడిలో శివారెడ్డి కుప్పకూలిపోయినప్పటికీ, ఇంకా ప్రాణంతో వున్నారేమోనన్న అనుమానంతో ఆయనపై దుండగుల్లో ఒకరు పెద్దరాయితో- విసరడానికి ప్రయత్నించారంటే రాయలసీమ కక్షలు ఏస్థాయిలో వున్నాయో అర్థమౌతుంది. తన ప్రాణాలకు ముప్పు ఉన్నందున అదనపు రక్షణ కల్పించాలంటూ శివారెడ్డి రాష్ట్ర శాసనసభలో ప్రభుత్వాన్ని కోరి 24 గంటలు కాకముందే ఆయన హత్య సంచలనం రేపింది.

1996 జూలై 23వ తేదీన బంజారాహిల్స్ రోడ్డు నంబర్ ఒకటిలోని మహేశ్వరీ టవర్స్‌లో రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో అనంతపురం జిల్లా పెనుకొండ కాంగ్రెస్ మాజీ ఎమ్మెల్యే ఎస్.వి.రమణారెడ్డి సోదరుడు ఓబుల్‌రెడ్డి, నాగభూషణం, రంగారెడ్డిలను దారుణంగా నరికి చంపడం రాజధానినే గడగడలాడించింది.

మారణాయుధాలతో వేటాడి, వేటకొడవళ్లతో దారుణంగా నరికి చంపడం వెనుకగల పకడ్బందీ వ్యూహాన్ని వివరించాల్సి వస్తే.... తన ప్రియురాలితో పడకగదిలో టి.వి. చూస్తూ కూర్చున్న ఓబుల్‌రెడ్డి గ్రౌండ్‌ఫ్లోర్ హాల్ నుంచి శబ్దాలు రావడంతో ఏదో జరిగిందని భావించి పడకగది తలుపును వేసుకున్నారు. కానీ హంతకులు తలుపును తన్నగా బోల్టు ఊడిపోయింది. బెడ్‌రూంలో కెళ్ళిన హంతకులు ఓబుల్‌రెడ్డి బాత్‌రూంలో వున్నట్లు పసిగట్టారు. రివాల్వర్‌తో బాత్‌రూం తలుపుపై కాల్పులు జరపగా లోపల గాయపడ్డ ఓబుల్‌రెడ్డి కిందపడ్డాడు. వెంటనే హంతకులు ఆయనను బాత్‌రూం నుంచి బయటకు లాగి నిర్దాక్షిణ్యంగా వేటకొడవళ్ళతో ఖండఖండాలుగా నరికి మాంసపుముద్దను చేశారు. అదే బాత్‌రూంలో ఓబుల్‌రెడ్డితో దాక్కున్న అతని ప్రియురాలు లక్ష్మిని హంతకులు ప్రాణాలతో వదిలేశారు. హంతకులు పాయింట్ త్రీటూ రివాల్వర్ వాడినట్లు పోలీసులు గుర్తించారు. హంతకులు బురఖాలు, కుర్తాపైజామాలు, తలపై నమాజ్‌టోపీలు ధరించినట్లు... పోలీసుల కథనం.

1997 నవంబర్ 9న రామానాయుడు స్టూడియో బయట ఒక తెల్లటి ఫియట్ కారునుంచి సంభవించిన బాంబుపేలుడులో 26మంది ప్రాణాలు కోల్పోగా, మరో 27మంది గాయపడ్డారు. తెలుగుదేశం మాజీ మంత్రి పరిటాల రవిపై జరిగిన హత్యాప్రయత్నమిది. మోహన్‌బాబు హీరోగా తన తండ్రి పరిటాల శ్రీరాములు గారి వాస్తవ జీవితాన్ని చిత్రంగా నిర్మించాలని పరిటాల రవి సంకల్పించి సినిమా ప్రారంభోత్సవం జరిపిన తర్వాత వస్తున్నప్పుడు ఈ విస్ఫోటనం జరిగింది. ఈ దారుణానికి ఒక టి.వీ.ఛానల్‌కు చెందిన సిబ్బంది మృతిచెందడం తెలిసిందే. ఈ దారుణానికి కారణంగా మాజీ శాసనసభ్యుడు ఎం.సూర్యనారాయణరెడ్డిని

పోలీసులు అరెస్ట్ చేశారు. పరిటాల రవిపై హత్యా ప్రయత్నానికి గల కారణాల వెనుక దశాబ్దాల వైరం వుంది.

## దశాబ్దాల వైరం-అందుకే ఆ విధ్వంసం!

ధర్మవరం, పెనుకొండ ప్రాంతాల్లో సుమారు పాతికేళ్ళ నుంచి రెండువర్గాల మధ్య వైరం వుంది. మద్దల చెరువు, వెంకటాపురం, కనుముక్కల గ్రామాలు ఈ వైరానికి ప్రధాన కేంద్రాలు. ఈ గ్రామాలన్నీ పెనుకొండ సెగ్మెంట్ క్రిందకు వస్తాయి. అప్పటికే పెనుకొండ ప్రాంతంలో ఒక కీలక నాయకుడిగా ఎదిగిన మద్దలచెరువు నారాయణరెడ్డికి వ్యతిరేకంగా పరిటాల శ్రీరాములు ప్రజల మద్దతు పొందడంతో సహించలేకపోయిన మద్దలచెరువు నారాయణరెడ్డి, సానె చెన్నారెడ్డిలు ఒక పథకం ప్రకారం పరిటాల శ్రీరాముల్ని అంతం చేశారు. పరిటాల శ్రీరాములుకు ఇద్దరు కొడుకులు. ఒకరు పరిటాల సూరి, మరొకరు పరిటాల రవి.

పరిటాల సూరి విప్లవ ఉద్యమాలలో ప్రధాన పాత్ర పోషించేవారు. దీనిని ఆసరాగా తీసుకుని ప్రత్యర్థి వర్గాలు సూరి ఎక్కడ తమ రాజకీయ జీవితానికి అడ్డొస్తాడోనని సూరికి విప్లవ పార్టీలతో వున్న సంబంధాలను పోలీసులకు వెల్లడించి వారి సాయంతోనే అతన్ని కడతేర్చారు. ఫలితంగా పరిటాలశ్రీరాములు కుటుంబంలో కేవలం పరిటాల రవి మాత్రమే మిగిలారు. తనను కూడా ఎక్కడ అంతం చేస్తారోనని రవి కొంతకాలం పాటు అజ్ఞాత జీవితం గడిపారు. ఆ సమయంలోనే రవి పీపుల్స్‌వార్ నాయకులు, ప్రజల సానుభూతిని పొందారు. పగ సాధించడానికి నక్సలైట్లు ముందడుగు వేశారు.

ఓ రోజు తెల్లవారుజామున బస్సుదిగి వెడుతున్న నారాయణరెడ్డి(మద్దలచెరువు)ను వెంటాడి హత్య చేశారు. నారాయణరెడ్డికి ఒక కుమారుడు. పేరు సూర్యనారాయణరెడ్డి (సూరి) సూరిని కూడా హతమార్చాలనుకున్నారు. పాడైన టి.వి.ని రిపేర్ కోసం అనంతపురం పంపగా దానిని బాగుచేసి తిరిగి పంపిస్తున్నట్లుగా పథకాన్ని రూపొందించి టి.వి.లో బాంబు పెట్టి బస్సులో పంపారు. టి.వి.ని తీసుకున్న సూరి ఇంటిలోని వారు దానిని ఆన్‌చేయగా విస్ఫోటనం సంభవించి ఇల్లంతా నేలమట్టమయ్యింది. సూరి ఆ సమయంలో ఇంట్లో లేకపోవడంతో ప్రాణాలతో బతికిపోయారు. పరిటాల శ్రీరాములు మరో ప్రత్యర్థి అయిన సానే చెన్నారెడ్డిని పట్టపగలు తన స్వగృహంలోనే పేపర్ చూస్తుండగా హతమార్చారు.

సానె చెన్నారెడ్డికి ఇద్దరు కుమారులు. ఒకరు ఎస్వీరమణారెడ్డి, మరొకరు ఓబుల్‌రెడ్డి. ఓబుల్‌రెడ్డిని బంజారాహిల్స్ రోడ్‌లోని మహేశ్వరీ టవర్స్‌లో దారుణంగా ముక్కలుముక్కలుగా వేటకొడవళ్లతో నరికి ప్రతీకారం తీర్చుకున్న సంగతి తెలిసిందే. యస్వీరమణారెడ్డి ఇప్పుడు సానే చెన్నారెడ్డి కుటుంబంలో మిగలగా, మద్దులచెరువు నారాయణరెడ్డి కుటుంబంలో



సూర్యనారాయణరెడ్డి, పరిటాల శ్రీరాములు కుటుంబంలో రవితోపాటు ఒక్కొక్క కుటుంబానికి కేవలం ఒకరు మాత్రమే మిగిలారు. యింకా ఈ కక్షల కార్చిచ్చు ఆరలేదు. పరిటాల రవిని హతమార్చడం కోసం ఫియట్ (సికెఎం 646) కారులో బాంబుపెట్టి పేల్చివేసిన దారుణ విస్ఫోటనం సంఘటన తెలిసిందే. ఈ సంఘటనకు బాధ్యుడైన మద్దెలచెరువు సూర్యనారాయణరెడ్డి(సూరి)ని పోలీసులు అరెస్ట్ చేశారు. ఈ చిచ్చు ఆరేదెన్నడో?

## పాలెగాళ్ళ రాజ్యం!

రాయలసీమలో పాలెగాళ్ళ వ్యవస్థ అత్యంత ప్రాచీనమైనది. దీనికి తరతరాల చరిత్ర వుంది. సీమ నిరంతరం రగిలే అగ్నిగుండం. పోరాటాలకు ప్రధాన స్థావరం. ఊరికో పాలెగాడు వుండేవాడు. ఏ ఊరికి వాడు రాజుగా ఆయా ప్రాంతాల్లోని ఊర్లను పంచుకొని పాలెగాళ్ళు పరిపాలించారు. క్రీస్తుశకం 17,18 శతాబ్దాల కాలంలో సీమలో ఈ పాలెగాళ్ళదే ఆధిపత్యంగా వుండేది. వీరు తీసుకున్న నిర్ణయాలే శాసనాలుగా అమలయ్యేవి. ఊరికో రచ్చబండ ఏర్పాటు చేసి దానిమీద బురుజులు నిర్మించారు. (ఇప్పుడు సీమలో పలు గ్రామాల్లో ఇప్పటికీ ఈ బురుజులు, రచ్చబండల్ని మనం చూడవచ్చు) ఆ కాలంలోనే పాలెగాళ్ళు న్యాయాన్ని, ధర్మాన్ని పాటిస్తూ ప్రజాపాలన చేశారు. తప్పు జరిగిందని తెలిస్తే అక్కడికక్కడే శిక్షలు అమలు జరిపేవారు. ఎదురు చెప్పిన వారి తల బురుజుకు వేలాడగట్టేవారు.

దీనివల్ల ప్రజల్లో భయం ఏర్పడి మరోసారి తప్పులు చేయకుండా నడుచుకునేవారు. తాము చెప్పిందే వేదం. తాము చేసిందే శాసనంగా చెలాయించిన పాలెగాళ్ళు నిరంకుశపాలన కొనసాగించనప్పటికీ వారి పరిపాలన క్రమశిక్షణతో కూడుకుని ఉండటంతో ప్రజల అభిమానం పొందలేకపోయారు. అయితే రాయలసీమ పాలెగాళ్ళ దెబ్బకు తక్కిన రాజ్యాలన్నీ సీమవైపు కన్నెత్తి కూడా చూడకుండా పోయాయి. పాలెగాళ్ళను ఎదిరించడం అంటే ప్రాణాలు పోగొట్టుకోవడమే అని చుట్టుపక్కల రాజ్యాల రాజులు బెదిరిపోయేవారు. ఎలాంటి కార్యమైనా పాలెగాళ్ళు తలుచుకుంటే క్షణాల్లో జరిగిపోయేది.

విజయనగర రాజుల కాలంలో కూడా పాలెగాళ్ళదే ప్రధానపాత్రగా సాగింది. పన్నులు వసూలు చేసి రాజధానికి పంపడం, యుద్ధ సమయాల్లో సైన్యాన్ని అందించటం వంటి పనులు పాలెగాళ్ళే చేశారు. సుల్తానుల దాడుల వల్ల కర్నాటకలోని హంపి రాజధానిని రాయలసీమలోని అనంతపురం జిల్లా పెనుకొండకు విజయనగరరాజులు మార్చారు. అప్పుడు వారికి పూర్తి, సహాయసహకారాలు అందించిన ఘనత పాలెగాళ్ళకే దక్కుతుంది. మట్టిపాలెగాళ్ళతో విజయనగర రాజుల వివాహసంబంధాలు కూడా చేసుకున్నారు. ఎంతమంది రాజులు మారినా, ఎన్ని రాజ్యాలు మారినా చివరికి సీమలో పరిపాలనా బాధ్యత మాత్రం

పాలెగాళ్ళకే దక్కేది. అందుకే నిజాం పాలనలో కూడా పాలెగాళ్ళే సీమను ఏలారు. పాలెగాళ్ళ పరిపాలనలో ఎన్నో వసతులు కూడా ప్రజలకు దక్కాయి. దేవాలయాల నిర్మాణం, చెరువులు, బావుల తవ్వకాలు, పంటలు పండించడానికి సదుపాయాలు ఎన్నో కల్పించారు. 30 యుద్ధాలను సీమ ఎదుర్కొంది. బ్రిటీష్‌వారికి కూడా పాలెగాళ్ళ సత్తా ఏమిటో తెలిసింది. బ్రిటీష్ సైనికులు సైతం పాలెగాళ్ళను అణచడానికి వెనుకడుగు వేశారు. పోరాట వీరులైన పాలెగాళ్ళను ఎదుర్కొనలేక వారిని బందిపోట్లుగా పిలిచారు. అయినా చివరికి పాలెగాళ్ళదే పైచేయి అయింది. గ్రామ పెద్దలు ఏర్పడి వారే ముఠాలను కూడగట్టుకోవడం ప్రారంభించారు. యిప్పటికీ ఇలాంటి ముఠాలదే సీమలో రాజ్యం- వారిదే అధికారం

## కక్షలకు నిలయాలు-గ్రామాలు

వ్యక్తిగత ప్రతిష్ట కోసం, భూముల వద్ద, పొలాలగట్ల కోసం, అక్రమ సంబంధాలు, పాతకక్షలు...వంటి సంఘటనలు ఫ్యాక్షన్ పుట్టడానికి అంకురార్పణ అవుతాయి. క్రమక్రమంగా హత్యలకు దారితీస్తాయి. ఇటువైపు వర్గం వారు ఒక హత్య చేస్తే అటువైపు వర్గంవారు మరో హత్య చేస్తారు. సమస్య అక్కడితోనే ఆగిపోదు. రెండువర్గాల వారు అనుక్షణం ప్రత్యర్థి కోసం కాపుకాస్తుంటారు. శత్రువు ఏమాత్రం ఒంటరిగా దొరికినా ఉదయం నాటికి అతని తల ఎక్కడో ఒకచోట బయటపడుతుంది. ఇలా గ్రామాల్లో ప్రారంభమైన చిన్నచిన్న స్పర్ధలే చిలికి చిలికి గాలివాన అయినట్లు పగలు, ప్రతీకారాల వరకు వెళ్తాయి. పలు కుటుంబాలు యిలా గ్రామ కక్షలతోనే ఆర్థికంగా చితికిపోయాయి. చిన్న విషయాలకు సైతం గొడవ పడడం, రాజకీయ నాయకుల దగ్గరకు వెళ్ళడం, పంచాయితీ పెట్టించడం, అవసరాన్నిబట్టి 'రాజీ'ల ద్వారా, వీలైతే నిరంకుశంగానూ ముఠా రాజకీయనాయకులే న్యాయాధీశులై తీర్పునివ్వడం యిక్కడి ప్రయివేట్ న్యాయం. కోర్టు, చట్టాలు, ఫీజులు, ఖర్చులు వంటివి ఏవీ లేకుండా క్షణాల్లో అక్కడికక్కడే పంచాయితీ పెట్టి సమస్యను పరిష్కరించడం, లేదంటే కాళ్ళు చేతులు నరికి తమ ఆధిపత్యం నిరూపించుకోవడం యిక్కడ రివాజు.

*9జూలై1998*
*ఆంధ్రభూమి వారపత్రిక*

## ఫ్యాక్షన్ చిచ్చుకు సీమ భస్మం

ముఠానాయకులే ప్రయివేట్ న్యాయాధీశులుగా తమ స్వార్థం కోసం, మనుగడ కోసం న్యాయాన్ని ప్రకటిస్తూ అమలు చేస్తూ వీలైతే బాధితులైన ఇరువర్గాలనుంచీ అందినంత దండుకుంటూ తమ జీవనం సాగిస్తుంటారు. గ్రామాల్లోని కక్షలే ఈ రాజకీయ నాయకులకు



తమ వర్గాలను పెంచుకోవడానికి తోడ్పడతాయి. గ్రామాలు నిరంతరం కక్షలతో రగిలిపోవడం, ఎవరో ఒకరు పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళడం, వారిని విడిపించుకురావడానికి రాజకీయనాయకులను సంప్రదించడం-రాజకీయనాయకులకు ఎక్కువ సమయం పోలీస్‌స్టేషన్లకు వెళ్ళి నిందితులను విడిపించడంతోనే సరిపోతుంది. యింకెక్కడి అభివృద్ధి? గ్రామ సర్పంచ్ ఎన్నికల నుండి లోక్‌సభ ఎన్నికల వరకు నాయకులు వర్గాల్ని కూడగట్టుకోవడంలోనే మునిగివుంటారు. ఇలా ఎవరికి వారు ఒక్కొక్క గ్రామాన్ని కలుపుకుంటూ తమ నియోజకవర్గాన్ని గుప్పిట్లో వుంచుకోవటానికి ప్రయత్నిస్తుంటారు. కక్షల దెబ్బకు గ్రామాలకు గ్రామాలు వలసపోవడం యిప్పుడు ఎక్కువగా జరుగుతోంది. కడప జిల్లాలోని కోడిగండ్లపల్లె, కొమ్మార్తి, తాతిరెడ్డిపల్లె, వర్దరాజునపల్లె గ్రామాలు దెబ్బతిన్నాయి. ఈ ప్రాంతంలో ఎక్కువ భాగం మెట్టభూములు కావడం, పంటలు సరిగా పండకపోవడం, సంవత్సరంలో నాలుగునెలలు పని వుంటే మిగిలిన ఎనిమిదినెలలు పనిలేకుండా వుండడం, చేయడానికి పనిలేకపోవడంతో నాయకుల వద్ద 'ప్రయివేటుసైన్యం'గా చేరిపోతున్నారు. నిరుద్యోగులు కూడా ఈ బాటలోనే నడుస్తున్నారు. వీళ్ళందర్నీ వాడుకుంటూ ముఠానాయకుడు ఎదిగిపోతున్నాడు. మరో మార్గం లేకపోవడంతో గ్రామవాసులు అతడి దగ్గరే పనికి కుదురుతున్నారు.

## ముఠా కక్షలు!

లోక్‌సభ ఎన్నికలు ముగిసిన తర్వాత సీమలో క్రమక్రమంగా ఉద్రిక్త పరిస్థితులు నెలకొంటున్నాయి. ఎవరికి వారు ముఠాలను కూడగట్టడంలో నిమగ్నమై వున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో తమ ఆధిక్యత కాపాడుకోవడానికి, ప్రత్యర్థులను అణచివేయడానికి నిరంతరం తపిస్తుంటారు. ఈ విధానం వల్లే ప్రతి గ్రామంలోనూ రెండు గ్రూపులు మనకు కనిపిస్తాయి. కేవలం ఒక కర్నూలు జిల్లాలోనే 300 గ్రామాలు ముఠా కక్షల కోరల్లో చిక్కుకుని వున్నాయి. కడప జిల్లాలో వై.ఎస్.రాజశేఖరరెడ్డి కుటుంబానికి కందుల శివారెడ్డి, జె.సి.దివాకర్‌రెడ్డి, పి.రామసుబ్బారెడ్డి, రమణారెడ్డి వర్గాలు ప్రత్యర్థి వర్గాలుగా వుంటూ ఘర్షణపడుతున్నాయి. ప్రొద్దుటూరులో ఎం.వి.రమణారెడ్డి, వరదరాజులరెడ్డి వర్గాల మధ్య, జమ్మలమడుగులో పి.రామసుబ్బారెడ్డి, నారాయణరెడ్డివర్గాల మధ్య, కమలాపురంలో ఎం.వి.మైసూరారెడ్డి, వీరశివారెడ్డిల మధ్య కక్షలు వున్నాయి. అనంతపురం జిల్లా తాడిపత్రి ప్రాంతంలో జె.సి.దివాకర్‌రెడ్డి, సూరీడు వర్గాల మధ్య, పెనుకొండ ప్రాంతంలో పరిటాల రవి, ఎస్వీరమణారెడ్డి వర్గాల మధ్య కక్షలు వున్నాయి. కర్నూలు జిల్లాలో భూమానాగిరెడ్డి, గంగుల ప్రతాప్‌రెడ్డి వర్గాల మధ్య, నందికొట్కూరులో శేషశయనారెడ్డి, మద్దూరి సుబ్బారెడ్డి వర్గాల మధ్య వైషమ్యాలు రగులుతున్నాయి.

గతంలో కర్నూలు జిల్లాలో అశాంతికి కారణం అవుతున్న నేతలకు రాష్ట్ర హైకోర్టు షోకాజ్ నోటీసులు జారీ చేసింది. 25మంది ఫ్యాక్షన్ నేతలపై 197 కేసులు నమోదై వున్నాయంటే ప్రజాస్వామ్యం ఎలా పరిరక్షించబడుతోందో అర్థమవుతుంది. బైరెడ్డి రాజశేఖరరెడ్డి, కొత్తకోట ప్రకాశ్‌రెడ్డి, భూమానాగిరెడ్డి, గంగులప్రతాప్‌రెడ్డి, కాటసాని రాంభూపాల్‌రెడ్డిలు కూడా కోర్టు నుండి షోకాజ్ నోటీసులు పొందడంతో రాజకీయ వర్గాల్లో సంచలనం కల్గించింది.

1996 ఏప్రిల్ 18న పత్తికొండ మాజీ ఎమ్మెల్యే, కాంగ్రెస్ నాయకుడు పాటల్ శేషిరెడ్డిని దారుణంగా ముఠాకక్షలు హత్య చేశాయి. రెండుగంటలసేపు బాంబులతో అతని కార్యాలయంపై దాడి చేసి ఇంటిపై కప్పునుంచి లోపలికి ప్రవేశించి శేషిరెడ్డి, పరప్పునాయుడులను బలితీసుకున్నారు. శేషిరెడ్డి చేతివేళ్ళు, కాళ్ళు వేటకొడవళ్ళ పదునుకు తెగిపడగా, పరప్పునాయుడి పొట్టపై బాంబులు వేయడంతో మాంసం, ప్రేగులు బయట పడ్డాయి. పాతకక్షలే ఈ హత్యలకు కారణం. రాజకీయ కురువృద్ధుడు మద్దూరు సుబ్బారెడ్డి హత్య విషయానికి వస్తే సుబ్బారెడ్డి కుటుంబానికి శేషశయనారెడ్డి కుటుంబానికీ మధ్య వర్గ తగాదాలు ఎప్పటి నుండో వున్నాయి. నందికొట్కూరు ఎమ్మెల్యే బైరెడ్డి రాజశేఖరరెడ్డి మద్దూరు సుబ్బారెడ్డి హత్య కేసులో ప్రధాన నిందితునిగా వున్నారు.

ఫ్యాక్షన్ పంజా విసిరిన ప్రతీసారీ ప్రజలు తల్లడిల్లిపోతారు. ఫ్యాక్షన్ వర్గాలతో ఎలాంటి సంబంధం లేని అమాయకులు ఈ ఘర్షణలతో తమ ఆస్తుల్నేకాకుండా ప్రాణాలను కూడా కోల్పోతున్నారు. దాడులు జరిగిన ప్రతిసారి ఒకవర్గం వారు ఆస్తుల్ని పోగొట్టుకుని నిరాశ్రయులు కాగా, మరోవర్గం వారు ప్రత్యర్థులు ఎప్పుడు మళ్ళీ పంజా విసుర్తారోనని ప్రాణాల్ని గుప్పిట్లో పెట్టుకుని కాలం వెళ్ళదీస్తుంటారు. సీమలో ఎన్నికలంటే భయం. ఎందుకంటే ఎన్నికల రోజు హత్యలు జరుగుతాయి. ఎన్నికలు అయిపోయిన అనంతరం హత్యలు జరుగుతాయి. యిక ఆస్తుల విషయానికి వస్తే ఎన్ని గ్రామాలు మరుభూములవుతాయో, ఎన్ని చీనీ తోటలు తెగిపడతాయో...చెప్పలేం.

ప్రత్యర్థిపై పగ తీర్చుకోవడానికి ఇస్తున్న ప్రాధాన్యత ప్రజల సమస్యల పరిష్కారానికి ఇవ్వడం లేదు. తినడానికి గుప్పెడు మెతుకులు లేక పస్తులున్నా ఫరవాలేదు. ప్రత్యర్థిని మట్టుబెట్టాలన్న వైఖరితో సీమలో ఫ్యాక్షన్ సంస్కృతి పెచ్చరిల్లుతోంది. పురివిప్పిన వర్గ రాజకీయాలు ప్రతీకార జ్వాలలతో ఎప్పుడూ కుతకుతలాడుతుంటాయి. ప్రత్యర్థుల అంతమే వాటి లక్ష్యంగా కనిపిస్తోంది. ముందుజాగ్రత్త చర్యగా వర్గనాయకులు, వారి అనుచరులు మారణాయుధాలను వెంట తీసుకుని వెళ్తుంటారు. ఆయుధాలు లేకుండా అడుగు బయటపెట్టాలంటే భయం. డేగ కళ్ళతో ప్రత్యర్థులు కదలికలను పరీక్షిస్తుంటారు. గ్రామాల్లో చిన్నచిన్న సంఘటనలు జరిగినా ఇరువర్గాలు రంగప్రవేశం చేస్తాయి. ఆ సంఘటనను తమ



బలప్రదర్శనకు వేదికగా మార్చుకుంటాయి. ఫ్యాక్షన్ విషవలయాలు గ్రామాల్లో గ్రామాల్లో విలయతాండవం చేస్తున్నాయి. మనిషి మీద పగ మరో సాటి మనిషిని ముక్కలు ముక్కలుగా నరికి ఆ శరీరభాగాలు సైతం కనపడకుండా చేసే స్థితికి ఫ్యాక్షన్ చేరుకుంది.

గ్రామాలకు గ్రామాలు తగలబడటం, ధాన్యం, పశుగ్రాసంతో సహా నోరులేని పశువులు మంటల్లో నిలువునా దహించుకుపోవడం వంటి సంఘటనలు రివాజుగా మారాయి. ఇక నాయకుల వెంట తిరిగే సామాన్యుల పరిస్థితి మరింత ప్రమాదంలో పడింది. స్వార్థనాయకులకు అండగా వుంటున్న యువత పలు సందర్భాలలో బలయిపోతున్నారు. కొందరు అంగవికలురై అలమటిస్తున్నారు. అతివృష్టి, అనావృష్టి ఒకవైపు బాధిస్తుంటే మరోవైపు వర్గపోరాటాల్లో మునిగిపోయి తమ సర్వస్వాన్ని పోగొట్టుకుంటున్నారు ప్రజలు. యువతకు ఉపాధి కల్పించాల్సిన నాయకులే వారి చేత రౌడీయిజం చేయిస్తున్నారు. బాంబుల తయారీకి పురికొల్పుతున్నారు. మరి కొందరు కిరాయి హంతకులుగా మారిపోతున్నారు. ఈ ప్రస్థానం ఎక్కడికో?

ఫ్యాక్షనిజానికి పునాదులు కిరాయి హంతకముఠాలు, సీమలో అయిదువేల రూపాయలకు కూడా హత్యలు చేసే గ్రూపులు వున్నాయి. యిక్కడ జరుగుతున్న ఫ్యాక్షన్ హత్యల్లో తొంభైశాతానికి పైగా కిరాయి హంతకులు చేస్తున్నవే. కక్షలు, కార్పణ్యాలు, వర్గపోరాటాల్ని పెంచి పోషించే రాజకీయనాయకులు తమ ప్రత్యర్థులను హతమార్చేందుకు కిరాయి హంతకులను ఆశ్రయిస్తుంటారు. సీమలో ఇలా డబ్బుకు ప్రాణాలు తీసే ముఠాలు 150నుండి 200 వరకు వుండవచ్చని అంచనా.

వీళ్ళు ఇతర జిల్లాలలోనే కాకుండా ప్రక్క రాష్ట్రాలైన కర్నాటక, తమిళనాడు, మహారాష్ట్ర ప్రాంతాల్లో కూడా హత్యలు చేయడానికి ఒప్పుకుంటారు. ఒక్కో కిరాయి ముఠాకు ఒక్కో నాయకునితో దగ్గరి సంబంధాలు వుంటాయి. ఒక్కో కిరాయి హంతకముఠాలో ఐదు నుంచి పది మంది వరకు సభ్యులుంటారు.

కిరాయి హత్యలు చేసే గ్రూపులేవీ నేరుగా ఎటువంటి ఒప్పందాలు కుదుర్చుకోవు. ఈ ముఠాలకు తెరవెనుక నుండి సూచనలిచ్చే నేతలే చేయాల్సిన పనులను నిర్ణయిస్తారు. చాలా సందర్భాలలో తాము ఈ హత్య ఎందుకు చేస్తున్నామో, ఇది ఎవరికి ప్రయోజమో వంటి విషయాలు కూడా కిరాయి ముఠాలకు తెలియదు. పనిచేయడం-డబ్బుపుచ్చుకోవడం మాత్రమే వారికి తెలిసిన విద్య! అలాగని వీళ్ళకు డబ్బుకు కొదవ వుండదని కాదు. బడా నాయకులు నాలుగు లక్షలకో, ఆరులక్షలకో కంట్రాక్టు కుదుర్చుకొని...పనికాగానే వీళ్ళకు యిచ్చే సొమ్ము వేలల్లోనే వుంటుంది. మిగతా సొమ్ము పెద్దల చేతుల్లోనే యిరుక్కుపోతుంది. తమ తెరవెనుక నాయకుడిని ఎదురు ప్రశ్నించే అవకాశం లేదు.

*16జూలై1998*

*ఆంధ్రభూమి వారపత్రిక*

## రక్తపుమరకల చరిత్ర

ఒకవేళ ఈ కూపం నుంచి బయటపడాలన్నా సాధ్యం కాదు. అంతకుముందు చేసిన పలు హత్యల వివరాలు బడా నేతకు తెలుసు కాబట్టి అతను ఎక్కడైనా వీళ్ళను యిరికించే అవకాశం వుంటుంది. కిరాయి హంతకులపై కేసులు తక్కువగా నమోదు అవుతాయి. ఎందుకంటే హత్య జరిగినప్పుడు ప్రత్యర్థి వర్గాలపైనే కేసులు పెడతారు. హత్య ఎవరు చేశారనే విషయం వారికి అనవసరం అవుతుంది. ఎంతసేపూ చేయించిన వారిపైనే దృష్టి వుంటుంది. హత్య చేయించారని కోర్టుకెక్కడం అక్కడ సరైన సాక్ష్యాలు లేకపోవడంతో కేసు వీగిపోవడం మామూలే!

హత్యలు చేసిన కిరాయి హంతకులు ఏమాత్రం తమ ఉనికి బయటపడకుండా జీవనం సాగిస్తారు. కర్నూలు జిల్లాలో పత్తికొండ, కోయిలకుంట్ల, డోన్, నంద్యాల ప్రాంతాల్లో కిరాయి హంతకులు వున్నట్లు భావిస్తుండగా, కడప జిల్లాలో పులివెందుల, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు ప్రాంతాల్లో కిరాయి హంతకులు వున్నట్లు అంచనా. కిరాయి హంతక ముఠాల్లో ఒకరికి ఒకరు సరిపోక వారిలో వారే చంపుకున్న సందర్భాలు, కాంట్రాక్టు ప్రకారం ఇద్దర్ని చంపమని పంపినప్పుడు అక్కడ వాతావరణం అనుకూలించకపోతే ఐదుమందిని చంపిన ముఠాలు కూడా వీళ్ళలో వున్నాయట. 1996లో కడప జిల్లాలో పులివెంధులకు 8 కిలోమీటర్ల దూరంలో కిష్టంగారిపల్లె వద్ద పోలీసుల ఎన్‌కౌంటర్‌లో చలపతి అనే కిరాయి హంతకుడు మృతి చెందాడు. ఈ కిరాయిహంతకుడు 1993 నుంచి 1996 వరకు దాదాపు వంద హత్యలు చేసి వుండవచ్చని పోలీసులు భావిస్తున్నారు.

### బాంబుల రాజ్యం

ముఠా నాయకులు తమ రక్షణ కోసం ప్రధానంగా వాడేవి- బాంబులు. రాయలసీమలో తుపాకీ లైసెన్సులను రద్దు చేస్తూ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం వల్ల గతంలో 3,500 తుపాకీ లైసెన్సులు రద్దయ్యాయి. ఫలితంగా ఫ్యాక్షనిస్టులు తమ రక్షణ ఏర్పాట్లకు వినూత్న మార్గాలను అన్వేషించారు. ఫ్యాక్షన్ ముసుగులో ఎన్నో నేరాలకు పాల్పడిన నాయకులు సహజంగానే ప్రత్యర్థుల నుంచి ముప్పు ఎదుర్కొంటున్న రాజకీయ నాయకులు తమకు తుపాకులు అందుబాటులో లేకపోవడంతో 'నాటుబాంబు'లే వీరికి దిక్కయ్యాయి. వేటకొడవళ్ళు, బరిసెలు...ఆయుధాలుగా వున్నప్పటికీ శక్తివంతమైన 'నాటుబాంబులే' వీరికి ప్రధాన ఆయుధాలయ్యాయి.ఫలితంగా నాటుబాంబుల తయారీ సీమలో కుటీరపరిశ్రమగా మారింది. నాయకులకు బాంబులు అవసరమైనప్పుడు అవి చేసేవారిని పిలిపించుకుని



చేయించుకోవడం లేదా వారి నుండి కొనడం చేస్తుంటారు. శక్తివంతమైన బాంబులను డిమాండ్‌ను బట్టి 100 నుంచి 150 రూపాయల వరకు విక్రయిస్తారు. అవే సాధారణ బాంబులైతే 50 నుంచి 80 రూపాయల వరకు ధర పలుకుతుంది. సాధ్యమైనంత వరకు ముఠానాయకులే ఊరికి దూరంగా వున్న ప్రాంతాల్లోగాని, పొలాల్లోగాని వీటిని తయారు చేయించుకుంటారు.

### దారితప్పి 'యువత'

గతంలో కడప జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌గా పనిచేసిన ఉమేష్‌చంద్ర ఫ్యాక్షనిజాన్ని చాలావరకు అణచివేశారు. ఆయుధాలను కూడా పెద్ద ఎత్తున స్వాధీనం- చేసుకున్నారు. ఫ్యాక్షనిజాన్ని రూపుమాపాలన్న ధ్యేయంతో ఉమేష్‌చంద్ర తీసుకున్న కఠిన చర్యల వల్ల అనేకమంది ఫ్యాక్షనిస్టులు జిల్లాను విడిచిపెట్టి వెళ్ళిపోయారు. కడప జిల్లాలో దాదాపు 90శాతం మంది గ్రామాల్లో వర్గ రాజకీయాలు నడుస్తున్నాయి. పంచాయితీ సర్పంచ్ నుంచి పార్లమెంట్ సభ్యుల వరకు ప్రైవేట్ బాడీగార్డులను వెంటబెట్టుకొని తిరుగుతుంటారు.

ఈ ప్రైవేటు బాడీగార్డులలో అధికశాతం యువత కావడం గమనించదగ్గ విషయం. వీరిలో కొందరి చేత నాయకులు మారణాయుధాలు తయారుచేయించడం, హింసారాజకీయాలకు వాడుకోవడం జరుగుతోంది. దీనివల్ల యువత మీద ముఠాల ప్రభావం పడుతోంది. ప్రధానంగా గ్రామీణ యువతే నాయకులకు ప్రైవేటు సైన్యంగా మారడం వలన ఆ ప్రభావం గ్రామీణులపై పడి పల్లెల్లోనూ వర్గ రాజకీయాలు చోటు చేసుకున్నాయి. ఖాళీగా తిరుగుతూ జీవితాన్ని జులాయిగా గడిపేస్తున్న వారిని చేరదీసి వారికి బాంబుల తయారీలోనూ, కిరాయి హంతకముఠాల్లోనూ, ప్రైవేట్ సైన్యంలోనూ అవకాశాలు ఇస్తున్నారు. ఎన్నికల సమయాల్లో అయితే యువతకు చేతినిండా పనే!

ఎన్నికల ప్రచారం కోసం ప్రత్యేకించి రాయలసీమ నుంచి ఎక్కువమంది మనుషులను వివిధ నియోజకవర్గాల వారు పిలిపించుకుంటూ వుంటారు. మూడుపూటలా భోజనం, ఎన్నికల తర్వాత ఐదువేల రూపాయల నగదు, రెండుజతల బట్టలు ఇస్తాం అంటూ ఎన్నికల సమయాల్లో వివిధ నియోజకవర్గాల నుంచి ప్రతినిధులు రావడం, యిక్కడి యువతను తీసుకెళ్ళడం చేస్తుంటారు. వీళ్ళు ఎన్నికల ప్రచారం చేయడం, రిగ్గింగ్ అరాచకాలు చేయడం వంటి పనులు చేపడతారు. ఇలా వెళ్ళి అక్కడే ప్రాణాలు పోగొట్టుకున్న అభాగ్యులు కూడా ఎందరో వున్నారు. సీమ నుంచి ఎన్నికల ప్రచారం కోసం కర్నాటక, తమిళనాడు ప్రాంతాలకు నిరుద్యోగులు వెళ్ళడం ఇక్కడ ప్రతిసారీ జరుగుతూనే వుంటుంది. ఫలితంగా బంగారు భవిష్యత్‌ను వీడి విద్రోహులుగా మారిపోతున్నారు.

కడపజిల్లా రాయచోటి అసెంబ్లీ నియోజకవర్గంలో, 1989 నవంబరులో జరిగిన ఎన్నికల్లో రక్తపాతం జరిగింది. పోలింగ్ రోజున తెల్లవారు జామున ఇండిపెండెంట్ అభ్యర్థి ఆవుల సుబ్బారెడ్డిని దారుణంగా హత్య చేశారు. ఈ ఎన్నికలను అటు కాంగ్రెస్ వారు, ఇటు తెలుగుదేశం వారు ప్రతిష్టాత్మకంగా తీసుకోవడంతో పోలింగ్ రోజున తెల్లవారు జామున అమాయక వృద్ధుడైన ఇండిపెండెంట్ అభ్యర్థి ఆవుల సుబ్బారెడ్డిని జీపులో తీసుకెళ్ళి సంచేపల్లికి సమీపంలో అతి దారుణంగా హత్య చేశారు.

అప్పటికే చాలా కేంద్రాల్లో ఓటింగ్ కూడా ప్రారంభమైంది. ఇండిపెండెంట్ అభ్యర్థి హత్యతో ఓటింగ్‌ను నిలిపివేశారు. అదేరోజు సంజీవనగర్ కాలనీ పోలింగ్ కేంద్రంలో ఎన్నికల నిర్వహణకు వచ్చిన పోలింగ్ అధికారి అహమదుల్లా బాషాను అతి క్రూరంగా చంపి పెట్రోలు పోసి తగులబెట్టారు. ఈ సందర్భంలోనే దుండగులను అడ్డుకోబోయిన మరో పోలింగ్ అధికారి సురేష్‌బాబు చేయి నరికివేశారు. అదే రోజు ఉదయం విద్యార్థి సాధు ఆనందరెడ్డిని కాల్చి చంపారు. ఇలా ఒకటేరోజు, ఒకే నియోజకవర్గంలో మూడు సంచలనాత్మక హత్యలు జరిగాయి.

1996జూన్20న కర్నూలులో మద్దూరు సుబ్బారెడ్డి హత్య కూడా సంచలనం సృష్టించింది. నంద్యాల పార్లమెంటు మాజీ సభ్యుడు మద్దూరు సుబ్బారెడ్డి (80) కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు. వీరు తమ స్వగ్రామం బ్రాహ్మణకొట్కూరుకు వెళ్ళడానికి మధ్యాహ్నం రెండుగంటలకు హైదరాబాద్‌లో కర్నూలు ఒకటవ డిపోకు చెందిన-9ఎ7257 ఆర్టీసీ డీలక్స్ బస్సులో బయలుదేరారు. రాత్రి 7.30గంటలకు బస్ కర్నూలు ఆర్టీసీ బస్టాండ్‌కు చేరుకుంది. బస్ నుంచి మద్దూరు సుబ్బారెడ్డి దిగి ఒక అడుగు ముందుకు వేయగానే పొంచివున్న ఇద్దరు వ్యక్తులు రెండు బాంబులు వేశారు. దీనితో సుబ్బారెడ్డి తల ఎగిరిపోయింది. ఆయన అక్కడికక్కడే మృతిచెందాడు. సీమలో రక్తపుమరకల చరిత్రకు ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే!

## అడుగంటిన పారిశ్రామిక ప్రగతి!

కరువు కాటకాలకు నిలయమైన రాయలసీమలో కక్షలు, కార్పణ్యాలు మాత్రం పెరుగుతున్నాయి. కానీ పారిశ్రామిక ప్రగతి మాత్రం పెరగ లేదు. సహజవనరులు ఎన్నోవున్నా వాటిని ఆధారంగా చేసుకుని పరిశ్రమలు ఏర్పాటు చేయడానికి ముందుకు వచ్చేవారు ఫ్యాక్షనిస్టుల దెబ్బకు బెదిరిపోతున్నారు. రాజకీయ నాయకుల ప్రాబల్యం, పోరాటాలతో- నిరుద్యోగులు, కార్మికులు సమిధలవుతున్నారు. కేవలం ఒక్క కడపజిల్లాలోనే దాదాపు 30 నుంచి 40శాతం చిన్న, పెద్ద పరిశ్రమలు మూతపడ్డాయంటే పరిస్థితి ఎలా వుందో ఊహించుకోవచ్చు. కార్మిక సంఘాలకు నాయకులుగా వుంటున్నవారిలో ఎక్కువ శాతం వ్యక్తులు యాజమాన్యాలను



భయపెట్టి, బెదిరించి పరిశ్రమలలోని టెండరు పనులు, కాంట్రాక్టు పనులు బినామీ పేర్లతో తీసుకొని లక్షలాది రూపాయలు గడిస్తున్నారు. తమ పనులకు అడ్డొస్తే దౌర్జన్యం తప్పదు. 1997 26వ తేదీ జువారి సిమెంట్స్ యాజమాన్య అధ్యక్షుడు ఓం ప్రకాష్ జగేటియాను ఎర్రగుంట్ల రైల్వేస్టేషన్‌లో మారణాయుధాలతో దాడిచేసి గాయపర్చిన సంఘటన అన్ని పరిశ్రమలలో సంచలనం రేపింది.

కడప జిల్లాలో చెన్నూరు చక్కెర కర్మాగారం, ప్రొద్దుటూరు పాలశీతలీకరణ ఉత్పత్తికేంద్రం, రంకా కేబుల్స్, ఆంధ్రాకేబుల్, ఆంధ్రా కాటన్‌మిల్లు, పెన్నాకాటన్‌మిల్లు, ప్యాకేజింగ్, పెన్నా పేపర్‌మిల్లులు మూతబడి వున్నాయి. అనంతపురం జిల్లాలో గుంతకల్లు స్పిన్నింగ్‌మిల్లు, ఎ.పి.లైటింగ్ సంస్థలు మూతపడ్డాయి.

తాడిపత్రి ప్రాంతంలో ఎల్ అండి టి సిమెంట్ కర్మాగార యజమానులు యిక్కడి ఫ్యాక్షన్ రాజకీయాలకు విసిగిపోయి కొంతకాలం పాటు తమిళనాడుకు వలస వెళ్ళిపోవడం, జువారి సిమెంట్ కర్మాగారం ఉన్నతాధికారి రామాంజనేయరెడ్డి ఇంటిపై బాంబుదాడి, చిలమకూరులోని కోరమాండల్ సిమెంట్ ఫ్యాక్టరీలో దాడులు యిక్కడి పారిశ్రామిక ప్రగతికి అవరోధంగా నిలిచాయి. చిలమకూరు కలమల్ల గ్రామాల మధ్య సిమెంట్ పరిశ్రమ నిర్మించేందుకు 'సిబా' అనే సంస్థ 4.50కోట్ల రూపాయలు వెచ్చించి భూముల సర్వే పనులు పూర్తి చేసినప్పటికి యిక్కడి ఫ్యాక్షనిజానికి బెదిరి ఆ ప్రాజెక్టును నిలుపు చేసింది.

పాడిపరిశ్రమతో అభివృద్ధి చెందిన గ్రామాల్లో ఫ్యాక్షన్ వ్యవస్థ చెలరేగి పరిశ్రమను పూర్తిగా మట్టుబెట్టేందుకు బాటలు వేసింది. ఒకప్పుడు పాలు ఏరులై పొంగిన గ్రామాల్లో నిత్యం జరిగే నెత్తుటేరుల కారణంగా పాడి పరిశ్రమ పూర్తిగా కనుమరుగైపోయింది.

ప్రొద్దుటూరు పాలఫ్యాక్టరీ మూతపడడంతో దీనిపై ఆధారపడి జీవిస్తున్న ఎన్నో కుటుంబాలు రోడ్డున పడ్డాయి. గుంతకల్లులోని స్పిన్నింగ్‌మిల్లు మూతపడడంతో 1300 మంది కార్మికులు ఉపాధి పోగొట్టుకొని నిరుద్యోగులయ్యారు. సీమలో బంగారం, వజ్రాలు, ఇనుము, ఆస్‌బెస్టాస్, బ్రైటీస్ గనులు వున్నాయి. ఈ గనుల నుండి ప్రతి సంవత్సరం 45లక్షల టన్నుల ఖనిజాలు వెలికితీస్తున్నారు.

దానిలో కొంత శాతం మాత్రమే యిక్కడి పరిశ్రమలు వినియోగించుకుంటున్నాయి. మిగిలిన సంపదంతా ప్రక్క రాష్ట్రాలకు తరలిపోతోంది. రామగిరి ప్రాంతంలో గాలిమరల విద్యుత్ కేంద్రం ఏర్పాటుకు ఫ్యాక్షనిస్టులే అడ్డుతగుల్తున్నారు. ఫలితంగా యిక్కడ ఎన్ని వనరులు వున్నప్పటికీ పెట్టుబడులు పెట్టి పరిశ్రమలు స్థాపించాలంటే పారిశ్రామిక వేత్తలు ముందుకు రావడం లేదు.

## 'ఫ్యాక్షన్ జోన్' ప్రశ్నార్థకమా?

సీమలో పెట్రేగిపోతున్న ఫ్యాక్షనిస్టులకు కళ్ళెం వేసి గ్రామసీమల్ని శాంతివనాల్లా చేసేందుకు ప్రభుత్వం నిర్దేశించిన ఫ్యాక్షన్‌జోన్ వ్యవస్థ కాగితాలకే పరిమితమైంది. ఫ్యాక్షనిస్టులను అదుపు చేయడానికి, ఫ్యాక్షనిస్టుల నీడలోని గూండాలను, వారి వద్ద వున్న లైసెన్స్‌లేని నాటు తుపాకులు, అక్రమంగా వుంచుకున్న బాంబులు, ఇతర మారణాయుధాలు స్వాధీనం చేసుకోవడం ఫ్యాక్షన్‌జోన్ ప్రధాన కర్తవ్యం. ఫ్యాక్షన్‌జోన్ వ్యవస్థ కాగితాలకే పరిమితమైంది. రాయలసీమ నీటి ప్రాజెక్టులన్నీ బూజుపట్టిపోతున్నాయి. వాటిలో కొన్నయినా కార్యరూపం దాల్చి అక్కడ గ్రామాల్లో నీరందితే -పంటలు పండితే కరువు రక్కసి హతమారుతుంది. యువత వ్యవసాయం వైపు, పరిశ్రమలవైపు మొగ్గు చూపితే- పొట్టకూటి కోసం ముఠా నాయకులను ఆశ్రయించే పని తప్పుతుంది. అలాంటి పరిస్థితులు కల్పిస్తేగాని రాయలసీమ ముఖచిత్రం మారదు.

*23జూలై -1998*

*ఆంధ్రభూమి వారపత్రిక*





## గల్ఫ్‌గాయం

దుబాయ్‌లో ఉపాధి కోసం మన రాష్ట్రం నుంచి వెళ్ళిన వాళ్ళు యుద్ధ జ్ఞాపకాల శిలువను మోసుకొచ్చారు. మన రాష్ట్రంలో గల్ఫ్ గాయంతో సలుపుతున్న వాళ్ళు సుమారు 19వేల మందికి పైగా వుంటే, వారిలో ఒక్క కడప జిల్లాలోనే 14వేల మందికి పైగా వున్నారు. అసలే మబ్బు కరగని సీమ. సేద్యం చట్టుబండలై ఇనుప గజ్జల తల్లి నాట్యం చేసే వట్టిళ్ళలోగిలి రాయలసీమ. నారుపోసినోడు నీరు పొయ్యలేని కరువుసీమలో వ్యవసాయ కూలీలుగా కూడా బతకలేని దుర్భర దారిద్ర్యం మనుషుల్ని నగరాలకి, ఫ్యాక్టరీలకి తరిమేస్తుంటుంది. కానీ క్షణం తీరికలేదు దమ్మిడీ ఆదాయం లేదు అన్నట్టుగా సాగే చాలీచాలని బతుకులకు కాయకల్పం చేయాలని ఎదురు చూసే 'సీమ' కళ్ళకి గల్ఫ్ కలలు కనడం నేర్పింది. అందుకే పొట్టచేత పట్టుకుని, కళ్ళనిండా కలలు నింపుకుని సముద్రాల్ని దాటి వెళ్ళి జీవితాన్ని జయించాలని ప్రయత్నిస్తుంటారు వీళ్ళు. 'పెద్దల' కోపం పేదవాని కడుపుకు చేటు తెచ్చింది. గల్ఫ్‌లో వున్నదున్నట్లు వదిలేసి కట్టుబట్టలతో వచ్చిన వీళ్ళకు ఇవాళ బతుకు మీద ఎలాంటి భరోసా లేదు. రెక్కలు ముక్కలు చేసుకుని కూడబెట్టిన సొమ్మును అక్కడి బ్యాంకుల్లోనే, అక్కడి ఫైనాన్షియర్ల దగ్గరే వొదిలి పెట్టి వచ్చేశారు. ఆ సొమ్ము ఇంక శాశ్వతంగా పోయినట్టే. యుద్ధం వల్ల తమకు జరిగిన నష్టాన్ని పూర్తిగా పూడవలేకపోయినా, నష్టపరిహారంగా అందవలసిన సొమ్మునైనా అందించమంటూ వాళ్ళు ఈ ఆరేడేళ్ళుగా ఇక్కడ అభ్యర్థిస్తూనే వున్నారు. వారి మొరనాలకించే వారే కరవయ్యారు. గల్ఫ్ యుద్ధాన్ని కువైట్ మరిచిపోయినా, మనవాళ్ళూ, వీళ్ళలాంటి ఇంకెందరో జీవిత సమరంలో క్షతగాత్రులై విలపిస్తూనే వున్నారు. వినండి కొందరి వ్యధలు...

ఒక కల కళ్ళముందే చెదిరిన అనుభవం అది. కాలిపోతున్న ఇళ్ళు, కూలిపోయిన గోడలు, చచ్చిన పావురాలు, మనుషుల నెత్తుటి కేకలు, ఇసుక తుపానులు,....'దీనార్ల' చుట్టూ అల్లుకున్న కరెన్సీ కల కుప్పకూలి 'బతుకు జీవుడా' అంటూ ప్రాణాలుగ్గబట్టుకుని దిక్కుకొకరుగా చెల్లాచెదరైన జ్ఞాపకం అది. 'దుబాయ్'కి వెళ్ళిపోతే చాలు కరెన్సీ నోట్లతో తివాచీలు పరచుకోవచ్చునన్న అందమైన కల చెప్పాపెట్టకుండా 'యుద్ధమై' ఛిద్రమైపోయింది. 'గల్ఫ్' యుద్ధం... రెండు దేశాల మధ్య జరిగిన కొట్లాటతో ఇంధనం కరవై ప్రపంచం ఇరుసు విరిగిపోయింది. తెట్లుగట్టిన క్రూడాయిల్తో సముద్ర జలాలు విషతుల్యమై జవజీవాలు కళ్ళు తేల వేశాయి. బడుగుదేశాల్లో ధరలు ఆకాశానికంటాయి.

టమాటా తారాజువ్వైపోయింది. కువైట్ సరిహద్దుల కావల గల్ఫ్ యుద్ధం అందిన కాడికి సొమ్ము చేసుకునేందుకు సాకైపోతే, కువైట్ లోపల దినమొక హింసాపర్వమై దడిపించింది. ఏదో నాలుక్కాసులు సంపాదించుకోవచ్చుని స్వదేశంలో తల్లక్రిందులై ఎలాగోలా కువైట్‌కి వెళ్ళిన వాళ్ళు అన్నాళ్ళూ కష్టపడ్డ సొమ్మును ఎక్కడికక్కడే వదులుకుని కట్టుబట్టలతో పారిపోదామన్నా దారి తెలియని ఇసుక పంజరంలో చిక్కుకుపోయారు. ఎయిడ్స్ కన్నా భయంకరమైనది యుద్ధం. జోలికి వెళితేనే ఎయిడ్స్ అంటుకుంటుంది. యుద్ధం అలాకాదు. దీనికి ఎవ్వరూ, ఏదీ మినహాయింపు కాదు. యుద్ధంతో ప్రమేయం లేని మహిళలు, పిల్లలూ, వృద్ధులూ కూడా సమిధలవ్వాల్సిందే. అప్పుల్నీ, ఆస్తుల్నీ, మానప్రాణాల్నీ... ఏ ఒక్కదాన్నీ మినహాయించకుండా హరించి వేసే ఉన్మాదమే యుద్ధమంటే. 1990-91లలో గల్ఫ్ యుద్ధం వల్ల జరిగిన నష్టం 67,600 కోట్ల డాలర్లు. లక్షలాది మంది జీవికను కోల్పోయారు.

ఒక్కసారిగా వందలాది చమురు బావులు, నూనెశుద్ధి కర్మాగారాలు భగ్గుమన్నాయి. ఆకాశం నుంచి పాతాళం దాకా నీరూ, గాలీ, నిప్పు అన్నీ కలుషితమైపోయాయి. రెండు దేశాలూ పోటాపోటీగా విసురుకొన్న రసాయనిక ఆయుధాల బారిన పడి లక్షల మంది పౌరులు, సైనికులు రోగపీడితులయ్యారు. ఒక్క ఇరాక్ సైనికులే లక్షమంది దాకా చనిపోయారు. యుద్ధాల చరిత్రలోనే ప్రపంచం ముఖం మీద సదా చీముకట్టిన పుండులా అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో సాగిన గల్ఫ్‌యుద్ధం నిలిచిపోయింది. గల్ఫ్‌యుద్ధ సమయంలో కట్టుబట్టలతో భారతదేశానికి తిరిగి వచ్చి నష్టపోయిన బాధితులు, కంపెనీలు, సంస్థలు నష్టపరిహారం కోసం ఎదురుచూస్తున్నాయి.

దేశానికి చెందిన 1.5లక్షల మంది బాధితులకు 2.4 బిలియన్ అమెరికన్ డాలర్లు రావలసి వుండగా మన రాష్ట్రంలోని 17,500 మంది బాధితుల్లో కడప జిల్లాలో అత్యధిక సంఖ్యలో బాధితులు వున్నారు. కడప జిల్లాలోని రాజంపేట, రాయచోటి, కోడూరు నియోజకవర్గాల్లోనే



వేలమంది బాధితులు వున్నారు.అయితే వీరిలో 660 మందికి మాత్రమే మొదటి విడత పరిహారం విడుదలైంది. యిందుకుగాను 2500డాలర్లు విడుదల అయ్యాయి. యు.ఎన్.సి.సి. గల్ఫ్ బాధితులను మూడు రకాలుగా విభజించగా కడప జిల్లాలోని బాధితులందరూ మొదటి తరగతికి చెందిన వారిగానే గుర్తించారు. వీరిలో కొందరికి 4000 డాలర్లు, మరికొందరికి 2500 డాలర్లను పరిహారంగా చెల్లించాలని నిర్ణయించారు.

మొత్తంమీద విదేశీమారక ద్రవ్యం రాబట్టుకోవడంపైనే కాక బాధితులను ఆదుకోవడంలోనూ కేంద్ర ప్రభుత్వం నిర్లక్ష్యం ప్రదర్శిస్తోందని బాధితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. నష్టపరిహారం కోసం క్లెయిమ్ చేసుకోవడానికి యుఎన్‌సిసి అధికారిక గడువు కాలం ముగిసినప్పటికీ ఇంకా ఎవరైనా బాధితులు ఇప్పటికీ క్లెయిమ్ చేసుకుని వుండకపోతే యు.ఎన్.సి.సి నిర్ణీత దరఖాస్తు ఫారంలో తమ అభ్యర్థనలు పంపుకోవచ్చు. అయితే వీటిని అంగీకరించడం లేదా తిరస్కరించడం అనేది పూర్తిగా యు.ఎన్.సి.సి. తీసుకునే నిర్ణయం మీదనే ఆధారపడి ఉంటుంది.

### సర్వం కొల్లగొట్టుక పోయింది

"నా పేరు నారదాస్ వెంకట సుబ్బయ్య (33). నేను సూపర్ మార్కెట్‌లో సేల్స్‌మెన్‌గా పని చేస్తుండే వాన్ని. నెలకు .90దీనార్లు ఇచ్చేవాళ్ళు. యుద్ధం గురించి ఏం చెప్పగలం? మా సొమ్మంతా పోయింది. అప్పు యిచ్చిన వాళ్ళు, చీటీలు వేసుకున్న వాళ్ళు, బ్యాంకుల్లో దాచుకున్న వాళ్ళు అందరూ నష్టపోయారు. ఎవరికీ పైసా కూడా దక్కలేదు. కట్టుబట్టలతో అక్కడి నుంచి వచ్చాము. యుద్ధం వల్ల చాలా నష్టం జరిగింది. మాకు దగ్గర్లో గొర్రెలను పెంచే శాల వుండేది. దాంట్లో ఐదు వందలకు పైగా గొర్రెలు వుండేవి.

ఈ యుద్ధం వల్ల తిండి, నీళ్ళు లేక అవి అక్కడిక్కడే చనిపోయాయి. అలాగే సేఠ్‌లు తమ ఇళ్ళలో పావురాలను, పిల్లులను ఎక్కువగా పెంచుకునేవారు. వాటికి తిండిలేక ఎక్కడ పడితే అక్కడ చచ్చిపడ్డాయి. ఆ వాతావరణం భయంకరంగా వుండేది. నేనంటూ అక్కడి నుంచి తెచ్చుకున్నది ఏదీ లేదు. రాజంపేట నుంచి కువైట్ వెళ్ళేటప్పుడు యాభైవేలు అప్పు చేసి వెళ్ళాను. తిరిగి వచ్చాక ఎద్దులను అమ్మి అప్పు కట్టాను. ఇప్పుడేదో నష్టపరిహారం యిస్తాం అంటున్నారు. కొంత మందికి నష్టపరిహారంగా 86వేల వరకూ యిచ్చారు. మాకు ఇంకా రాలేదు. నిదానంగా అయినా వస్తుంది బాధపడవద్దని అంటున్నారు. ఆ డబ్బువస్తే ఏదో ఒక పని చేసుకుంటాను. మా దరఖాస్తులు పంపి చాలా రోజులవుతోంది. ఏ విషయం ఇంకా తెలియదు. మాకు రావలసిన సొమ్ము మనకు వస్తుందా? రాదా? అనేది యిప్పుడు అందరూ అడుగుతున్న ప్రశ్న. దీనికి జవాబు యిచ్చే వాళ్ళు లేరు."

## యుద్ధం మా కొంప ముంచింది

"నా పేరు పి.నర్సమ్మ(40). నలభై దీనార్లకు సేఠ్ ఇంట్లో పనిచేసేదాన్ని. అక్కడికి వెళ్ళిన తర్వాత బాగానే సంపాదించుకుంటుండే వాళ్ళం. యుద్ధం వచ్చి మా కొంప ముంచింది. రాజంపేట నుంచి కువైట్‌కు బతకడానికి వెళ్ళాం. యుద్ధం ఉప్పెనలా విరుచుకుపడింది. ఏం చేయాలో అర్థం కాలేదు. ఎడారి ఇసుక గాలులు, దుమ్ము మమ్మల్ని చుట్టుముట్టుకున్నాయి. ఎక్కడ చూసినా అల్లకల్లోల వాతావరణం. సంపాదించిందంతా పోయింది. జోర్డాన్ విమానాశ్రయంలో పెద్దపెద్ద క్యూలు. వేలమంది జనం క్యూలో నిలబడి వున్నారు. ఉదయం ఆరుగంటలకు క్యూలో నిలబడితే రాత్రి పదిగంటలకు విమాన అధికారుల దగ్గరకి వెళ్ళగలిగాం. ఎన్ని కష్టాలు పడి వచ్చామో మాకు తెలుసు. యింత వరకు పదిపైసలు కూడా నష్టపరిహారం రాలేదు. ఎవర్ని అడగాలి? అసలు నష్టపరిహారం వస్తుందో, రాదో అనే దిగులు పట్టిపీడిస్తోంది. మాకు రావలసిన నష్టపరిహారం మాకు యిప్పించండి. దానిపైనే ఆశలు పెట్టుకోని వున్నాము. అప్పుడు (యుద్ధ సమయంలో) మాతో వచ్చిన వారిలో చాలా మంది మళ్ళీ గల్ఫ్‌కు వెళ్ళిపోయారు. ఆర్థిక ఇబ్బందులు వున్న వాళ్ళు మాత్రమే మళ్ళీ పోలేక పోయారు. అక్కడికి వెళ్ళిన వాళ్ళు మళ్ళీ సంపాదించుకుంటారు. మేం మాత్రం నష్టపోయినట్లే. కాబట్టి ప్రభుత్వం మా గురించి ఆలోచించాలి."

## ప్రాణాలతో మళ్ళీ వస్తామనుకోలేదు

" నాపేరు సొల్లేటి పెంచలయ్య (38). సేఠ్‌గారి ఇంట్లోనే పని చేసేవాణ్ని. నాదో విచిత్రమైన కథ. వేలు ఖర్చుపెట్టుకొని రాజంపేట నుంచి కువైట్ పోతే పోయిన పదిరోజులకే యుద్ధం అంటే నేనేం చేసేది? ఒకసారి కూడా జీతం తీసుకున్న పాపాన పోలేదు. కువైట్‌కు వెళ్ళడం కోసం యిక్కడ ఊర్లో అరవైవేలు అప్పు చేసి వెళ్ళాను. తీరా అక్కడికి వెళ్ళిన పది రోజులకే యుద్ధం అన్నారు. నా గుండె ఆగిపోయినంత పని అయింది. ఎక్కడ చూసినా సైన్యం. అక్కడ నాకు ఆరోగ్యం బాగా లేకుండా పోయింది. చాలా అగచాట్లు పడ్డాను. జోర్డాన్ హాస్పటల్‌లో చికిత్స తీసుకున్నాను. కాలిపోతున్న ఇళ్ళు. విరిగిపడిన గోడలు. ఎక్కడ చూసినా కువైట్ అల్లకల్లోలంగా వుండేది. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బయటపడ్డాం. ఇక్కడికి రాగానే అప్పుడు కువైట్ పోయేటప్పుడు చేసిన 60వేల అప్పు కట్టాల్సి వచ్చింది. ఏం చేసేది? వున్న భూమి అమ్మి అప్పు, వడ్డీ కట్టాం. ఇప్పుడు రోజూ పనికి పోతున్నాను. అప్పటి నష్టపరిహారం ఇస్తామన్నారు. కానీ యింతవరకు యివ్వలేదు. దాని కోసమే ఎదురు చూస్తున్నాను. చచ్చి బతికి ఎట్లాగైనా యిక్కడికి వచ్చి పడినాం. గానీ యిక్కడేం చెయ్యాలో అర్థం కావడం లేదు."



## వీడని విషాద స్మృతి

" నా పేరు ఎమ్.రమణయ్య (38). సేఠ్ ఇంట్లో యాభై దీనార్లకు ఇంటి పని చేసేవాణ్ని. మన వాళ్ళమంతా బాగా కలిసికట్టుగా వుండేవాళ్ళం. యుద్ధం దెబ్బకు చెల్లాచెదురైపోయాం. ఎట్లయినా గానీ మా ఊరికి (కోడూరి దగ్గర నాగవరం) ఉత్తరం రాసి పంపాలనుకున్నాను. కానీ ఇరాక్ సైన్యం అన్నింటినీ తగులబెట్టింది. ఎక్కడ చూసినా పడిపోయిన గోడలు, శిథిలమైన ఇండ్లు. మాకైతే దిక్కు తెలియలేదు. ఎవరికి వాళ్ళం ఉత్తరాలు రాసి పెట్టుకున్నామే గానీ ఏంచేయాలో అర్థం కాలేదు. ఇంతలో మనదేశం నుంచి అప్పటి దౌత్యవేత్త గుజ్రాల్ వస్తున్నారని తెలిసింది. మాకు చాలా సంతోషమేసింది. ఇరాక్ నుంచి కువైట్ హెలికాప్టర్‌లో అక్కడి మన భారతీయ కార్యాలయం దగ్గరికి వచ్చారు. మన వాళ్ళందరం వెళ్ళి కలిశాము. మా దగ్గర వున్న ఉత్తరాలు ఆయన కిచ్చి పోస్ట్ చేయమని చెప్పాం. మన వాళ్ళు చాలా మంది ఏడ్చి తమ గోడు వెళ్ళబోసుకున్నారు. తర్వాత మా ఉత్తరాలను గుజ్రాల్ ఢిల్లీకి వచ్చి పోస్ట్ చేశారు. వారు మా కోసం చాలా శ్రమ తీసుకున్నారు. మేము ఈ రోజు ప్రాణాలతో యిక్కడ వున్నామంటే అది గుజ్రాల్ పుణ్యమే. మాకు నష్టపరిహారం అప్పుడిస్తాం! యిప్పుడిస్తాం!! అంటున్నారు. యింతవరకూ ఏమీ యివ్వలేదు. దీని మీద ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలి. రోజుకోమాట చెప్తున్నారు. దీని వలన ప్రయోజనం ఏముంది? మేము పడ్డ కష్టాలు సామాన్యమైనవి కావు. ఆ కష్టాల్ని చచ్చేదాకా మరిచిపోలేం. ప్రభుత్వం త్వరగా నష్టపరిహారాన్ని యిప్పించాలి."

## ఆశలు కుప్పకూలి పోయాయి

" నాపేరు షేక్ హిమామ్ (35). కువైట్‌లోని ఓ ప్రైవేట్ ఆఫీస్‌లో ప్యూన్‌గా పని చేశాను. నెలకు 170 దీనార్లు ఇచ్చేవారు. అన్నీ బాగానే వుండేవి. మధ్యలో యుద్ధం వచ్చి చాలా దెబ్బకొట్టింది. మళ్ళీ పోవడానికి కూడా వీలు కాలేదు. ఆర్థికంగా చాలా దెబ్బతిన్నాం. ఇప్పటికీ యింకా తేరుకోలేకపోతున్నాం. యిక యుద్ధం గురించి ఏం చెప్పమంటారు సార్? అది ఒకనాటి కష్టమా? ఆ కంటి నీళ్ళు ఈ కంట్లోకి వచ్చాయి. ఎన్ని కష్టాలు పడి మళ్ళీ ఇక్కడికి వచ్చి పడ్డామో ఆ భగవంతునికే తెలియాలి. ప్రాణాలతో ఇళ్ళకు పోతాం అనుకోలేదు. ఎడారిలో మేం పడిన కష్టాలు ఇప్పటికీ రాత్రిపూట కలల్లోకి వచ్చి భయపడిస్తున్నాయి. ఆ సైనిక కవాతు, ఆ బాంబుల మోత ఎట్లా మరచిపోగలం? యుద్ధం దెబ్బకు జ్వరం వచ్చింది. జోర్డాన్‌లో ఒక రోజంతా క్యూలో నిల్చోవాల్సి వచ్చింది. తినడానికి సరిగ్గా తిండి కూడా లేదు. అష్టకష్టాలు పడ్డాము. అక్కడ సంపాదించుకున్నదంతా అక్కడే పోయింది. యిక్కడికి కేవలం ప్రాణాలతో మాత్రం వచ్చాము. నష్టపరిహారం యిస్తామని ఐదారు ఏళ్ళనుంచి అంటున్నారు. కానీ యింత వరకు ఏమీ అందలేదు. మా డబ్బులైనా యిస్తే మా జీవితాలు గడిచిపోతాయి. ఎప్పుడు మా

డబ్బులు వస్తాయో మాకే తెలియదు. మాకు రావలసిన నష్టపరిహారం మాకు యివ్వడానికి కూడా ఎందుకు యింతగా ఆలస్యం చేస్తున్నారో అర్థం కావడం లేదు. మేము ఇండియా వచ్చి ఎనిమిది సంవత్సరాలు గడిచిపోతోంది. యింత ఆలస్యమైతే ఎవరు సహించగలరు? అక్కడ మేము బ్యాంకుల్లో వేసుకున్న సొమ్మంతా పోయింది. ఆ డబ్బు తిరిగి రావడం కూడా సాధ్యపడదు. కాబట్టి నష్టపోయిన వాళ్ళకు నష్టపరిహారం త్వరగా యిచ్చే ఏర్పాటు చేయాలి."

### చచ్చిబతికినట్లయింది

"నా పేరు హేక్‌హుసేనీ (32). కువైట్‌లోని టెలిఫోన్ కంపెనీలో పనిచేసేవాణ్ణి. ముప్పై దీనార్‌లు ఇస్తుండేవారు. చాలా ఎక్కువ పని వుండేది. అది కూడా చాలా కష్టమైన పని. అయినా కూడా ఎలాగోలా అక్కడే బతికేవాణ్ణి. కానీ వున్నట్టుండి యుద్ధం వచ్చిపడింది. బస్సులవీ ఎక్కడివక్కడ నిలబడిపోయాయి. అసలు మళ్ళీ మన దేశం వెళ్ళగలమా? అని భయపడిపోయాను. ఏదో మా పుణ్యం కొద్దీ ఒక బస్సు దొరికింది. ఇరవై దీనార్లు ఇచ్చి జోర్డాన్‌కు వచ్చి పడ్డాం. తాగడానికి నీళ్ళు కూడా లేని పరిస్థితి.

ఎడారి ఎండల గురించి చెప్పవలసిన పనిలేదు. గాలి,దుమ్ము ఎక్కువ. ఎక్కడ చూసినా సైన్యం తుపాకులు పట్టుకుని తిరుగుతున్నారు. మా భయం మాది. వాళ్ళవైపు చూసే వాళ్ళం కూడా కాదు. కువైట్ పోయిన మాటేగాని సంపాదించింది ఏం లేదు. సంపాదించుకున్నది కూడా అక్కడికి వెళ్ళి పోగొట్టుకున్నాం. గల్ఫ్‌యుద్ధం ఊహించని రీతిలో మా జీవితాల మీద దెబ్బకొట్టింది. ఎన్ని కష్టాలు పడినప్పటికీ ప్రతిఫలం లేకుండా పోయింది.

మా చేతుల్లో ఏం లేదని అధికారులు చెప్తున్నారు. నష్టపరిహారం వచ్చే పరిస్థితి కనిపించడం లేదు. మా వివరాల సమాచారమంతా ఢిల్లీకి ఎప్పుడో పంపేశాం. అయినా యింకా మాకు డబ్బు రాలేదు. ప్రభుత్వం మా గోడును కొంచెం పట్టించుకోవాలి. మేం యుద్ధం నుంచి చచ్చి బతికి యిక్కడికి వచ్చాము. అన్నీ పోగొట్టుకున్నాం. మా ఆవేదనను అర్థం చేసుకోవాలి."

*23 ఆగస్టు, 1998*

*ఆంధ్రజ్యోతి ఆదివారం*



# ముఖాముఖి



## సాహిత్య స్వాప్నికుడు సాయుధుడు శేషేంద్ర

సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చునిమొరగదు
తుపాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవరికీ సలాం చెయ్యదు
నేనింత పిడికెడు మట్టే కావచ్చు
కానీ కలమెత్తితే
నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది"

-అంటారు శేషేంద్ర. అంతేకాదు "చెట్టుగా ఉంటే ఏడాదికొక వసంతమన్నా దక్కేది. మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను" అని ఆయన ఆవేదన పడతారు.

"కాలాన్ని నా కాగితం చేసుకుంటా, దాని మీద లోకానికి ఒక స్వప్నం రాసిస్తా, దాని కింద నా ఊపిరితో సంతకం చేస్తా"నని తన రచనా భావాల్ని ప్రస్ఫుటంగా వెల్లడిస్తారు.

"నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది కన్నుల్లో నీరు తుడిచి కమ్మటికల ఇచ్చింది" అంటూ పాట పల్లవులను లిఖిస్తారు.

ఆధునిక సాహిత్య చరిత్రకు ఒక దారిని చూపిన నవయుగవైతాళికులు శేషేంద్ర.

కవిగా, విమర్శకులుగా, పరిశోధకులుగా గుంటూరుశేషేంద్రశర్మగారు తెలుగు సాహిత్యంలో అత్యున్నత శిఖరాలను అందుకున్నారు. వీరు 1927 అక్టోబరు 20వ తేదీన నెల్లూరు జిల్లా నాగార్జునపాడు గ్రామంలో జన్మించారు. ఆంధ్రా యూనివర్శిటీ నుంచి డిగ్రీ పూర్తి చేసిన శేషేంద్ర న్యాయశాస్త్రాన్ని మద్రాసు యూనివర్శిటీలో అభ్యసించారు. 37సంవత్సరాలపాటు

మున్సిపల్ కమిషనర్‌గా వీరు రాష్ట్రంలో పలుచోట్ల బాధ్యతులు నిర్వహించారు.

### రచనా ప్రక్రియలో

1951లో వీరి మొదటి అనువాద రచన వచ్చినా, 'శేషజ్యోత్స్న' పేరుతో1968 నుంచి 1972 వరకూ రాసిన కవిత్వమే వీరి మొదటి రచనగా భావించాలి. ఈ రచన తెలుగు సాహిత్యంలో ఒక వినూత్నమైన ఒరవడి తీసుకొచ్చింది. తర్వాత వచ్చిన 'మండేసూర్యుడు', 'రక్తరేఖ' కావ్యాలు 1974లో వెలువడ్డాయి.

1975లో వచ్చిన 'నా దేశం- నా ప్రజలు' రచన ఎంతగానో సంచలనం సృష్టించింది. భారతీయ సాహిత్యంలోనే ప్రశస్తమైన ఇతిహాస రచనగా కీర్తినందుకుంది. తర్వాత 'నీరైపారిపోయింది' కవిత్వం ప్రచురించబడింది. విభిన్న కోణాల్లో భావాల్ని ఈ రచన స్పృశించింది.

1977లో 'గొరిల్లా' కవితా సంకలనం పరిపూర్ణమైన కవిత్వానికి పర్యాయపదంగా నిలిచింది. అనంతరం వాల్మీకి రామాయణంపైన 'షోడసి', 'స్వర్ణహంస', 'సీత' వంటి విమర్శనాత్మక విశ్లేషణలతో రచనలు చేశారు. 'కాలరేఖ' కవిత్వానికి సాహిత్య అకాడమీ అవార్డు అందుకున్నారు.

గుంటూరు శేషేంద్రశర్మ పలు అంతర్జాతీయ సెమినార్లలోనూ పాల్గొన్నారు. గ్రీసు, జర్మనీ, ఫ్రాన్స్, మడగాస్కర్, కెన్యా, ఇటలీ, ఇంగ్లాండ్ దేశాలను పర్యటించారు. వీరికి 1993లో సుబ్రహ్మణ్యభారతి ఏక్తా పురస్కారాన్ని కలకత్తా హిందీ అకాడమీ అందజేసింది. 1994లో సాహిత్య అకాడమీ అవార్డును అందుకున్నారు. తెలుగుయూనివర్శిటీనుంచి డి.లిట్ డిగ్రీని అందుకున్నారు. శేషేంద్ర రచించిన 'కవిసేన మ్యానిఫెస్టో' కావ్యశాస్త్ర గ్రంథం సాహిత్య విమర్శకు ఊపిరిపోసింది. గజల్ లక్షణాలను వివరిస్తూ వచ్చిన 'ఈ నగరం జాబిల్లి' కావ్యం విశిష్ట స్థానం అందుకున్నది.

'ఆధునిక మహాభారతం', 'జనవంశమ్' వంటి ఇతిహాస కావ్య రచనలు అందించిన కవిరత్న గుంటూరు శేషేంద్రశర్మతో ప్రస్తుత సాహిత్య పరిస్థితులు, ప్రభావాలు, పరిణామాలపై స్వాతి ప్రత్యేకంగా అందిస్తోంది విశ్లేషణాత్మక ఇంటర్వ్యూ.

**కవిత్వం గురించి మీ అభిప్రాయం?**

కవిత్వమంటే ఒక పదునైన ఆయుధం. దాని రూపం ఏదైనా కావచ్చు. అలజడి కావచ్చు. ఆరాధన కావచ్చు. ఆర్ధత కావచ్చు. సూటిగా హృదయాన్ని తాకి చైతన్యాన్ని, ఆవేశాన్ని అది అందించగలుగుతుంది. కవిత్వం కాగడాలా మంటలు రేపుతుంది. వెలుగును చూపిస్తుంది.

కవిత్వం ఒక మెస్మరిజం/కవికన్ను ఒక ప్రిజం/ కవిత్వం ఎర్రగుర్రంలా



పరిగెత్తుకువస్తుంది/రక్తంలో మునిగిన బాణంలా/వీరుడు విడిచిన ప్రాణంలా/సాగిపోయేది కవిత్వం.

ఇది యూనివర్సల్. ప్రపంచంలోని ప్రజలందరికీ ఒకే విధమైన భావాల్ని అందించగలుగుతుంది. దీని సారూప్యతలో ఏ రకమైన తేడాలుండవు. బలీయమైన అనుభూతిని కవిత్వం కల్గిస్తుంది.

హృదయం స్పందించినప్పుడు ఒక ప్రత్యేక పదజాలంతో కలం నుంచి, గళం నుంచి ఉప్పెనలా ఉధృతంగా పెల్లుబికి కాగితాలపైకి చేరి దృశ్యాలుగా, శిల్పాలుగా చిత్రాలుగా మారేది కవిత్వం.

సాధారణంగా 'పండువెన్నెల కురుస్తోంది' అనే వాక్యమే 'ఈ రాత్రి వెన్నెల నగ్నంగా స్నానం చేస్తోంది' అని కవిత్వీకరించబడుతుంది. కవిత్వానికి జీవితాలను ప్రభావితం చేసే శక్తివుంది.

కవిత్వం కవి మరణించిన తర్వాత ఆకాశంలోకి లేచే నిర్మాణం. మొలిచే నాగరికత. అడుగుపెట్టే వసంతం. అందమైన కవిత్వమంటే దానికి ఒక గుండె ఉండాలి. అది కన్నీళ్ళు కార్చాలి. క్రోధాగ్నులు పుక్కిలించాలి. పీడితుల పక్షం అవలంబించాలి. మనిషి రుణం తీర్చుకోవాలి. కాలపు బరువుల్ని మోయాలి. అదే అసలుసిసలైన కవిత్వంగా పరిగణింపబడుతుంది.

**సాహిత్యంలో ఇపుడు వస్తున్న వాదాలు ఎంతవరకూ నిలబడతాయి? స్త్రీవాదం, దళితవాదాలపట్ల మీ అభిప్రాయం...**

నేను అన్ని వాదాలు చదువుతూనే ఉన్నాను. స్వచ్ఛందంగా వారివారి భావాలకు, అభిప్రాయాలకు వాదనల్ని వేదికలుగా చేసుకుంటున్నారు. తమ వాణికి బలాన్ని, తమకంటూ బలగాన్ని తయారు చేసుకొని తాము చెప్పదల్చుకున్నదేమిటో సూటిగా, స్పష్టంగా, నిఖార్సుగా, నిర్భయంగా చెప్పుకుంటూ వస్తున్నారు. పేర్లు ఏమైనా వాదాల అంతిమ లక్ష్యం ఒక్కటే. గుర్తింపు కోసమే ఈ వాదాలన్నీ ప్రయత్నిస్తున్నాయి. దళితులు అన్ని వర్గాల్లోనూ ఉన్నారు. పేదవారు, వెనుకబడినవారు, గుమస్తాలు, స్త్రీలు అందరూ దళితుల కిందకే వస్తారు. దళితులదే సమాజంలో మెజార్టీ.

ఆర్థిక సమానత్వం ముందుగా ఈ వ్యవస్థ సాధించగలిగితే అన్ని సమస్యలు దాదాపుగా పరిష్కారం అవుతాయి. అన్ని వాదాలు, వివాదాలు తొలగిపోతాయి. స్త్రీవాదమైనా, దళితవాదమైనా సొంతంగా తమ ఉనికిని తెలియజేసుకోవడమే అంతర్లీనమైన అంశం. ఏ వాదం వచ్చినా సాహిత్యానికి వచ్చే నష్టమేమీ వుండదు.

నడుస్తున్న సాహిత్యం చరిత్రలోని అన్ని రచనా ప్రక్రియల గాలుల్నీ చూస్తూనే వున్నాను. వస్తున్నవన్నీ మంచికే. వారివారి గొంతుల్ని వినిపిస్తున్నారు. వారి గొంతులకొక వాదాన్ని జత చేసుకుని నినాదిస్తున్నారు. ఇది ఆహ్వానించదగ్గ పరిణామమే.

ఆర్థిక సమానత్వం దిశగా వ్యవస్థ అడుగులు వేయడం ప్రారంభిస్తే అవస్థలు తొలగిపోయి అసలైన సాహిత్యం ఆవిర్భవిస్తుంది.

**'కవిసేన మేనిఫెస్టో' ఎందుకోసం వచ్చింది? మీ 'కవిసేన' తన లక్ష్యం సాధించిందా?**

కవిసేన ఒక ప్రభంజనం. సంచలనం. దాన్ని ఎవరో ఏర్పాటు చేయలేదు. 1970 కాలంలో స్వచ్ఛందంగా కదలి వచ్చిన కవి మిత్రులు చేతులు కలిపి నిర్మించుకున్నారు. వారందరి కోసం నేను మేనిఫెస్టో రాశాను. 'కొడవలి కర్షకుడి ఆయుధం. సుత్తి కార్మికుడి ఆయుధం. కత్తి సైనికుడి ఆయుధం. అట్లాగే కవిత్వమే కవి ఆయుధం. కవి తన ఆయుధాన్ని గురించి తెలుసుకోవాలి.

దాన్ని ఎప్పుడు, ఎందుకు, ఎలా ప్రయోగించాలో తెలుసుకోవాలి. దానికోసమే కవిసేన ఏర్పడింది. ఇది రాజకీయ ఉద్యమంగా ఏర్పడింది కాదు. ఇది ప్రధానంగా వైజ్ఞానిక ఉద్యమం.

మీ నడకలు అడవుల్లో నిర్భయంగా తిరిగే సింహాల్లో ఉండాలని కోరుకుంటూ, కవి సత్యాగ్రహి అని తెలియజేస్తూ, సత్యమంటే గుండెల్లో మండే వెసూవియస్ అగ్నిపర్వతమనీ, గొంతులో గర్జించే నయాగరా జలపాతమని అలాంటి సత్యాన్ని బతికించడం కోసం కవిసేన తయారయ్యింది. తాను అనుకున్న లక్ష్యం సాధించింది.

కవిసేన ఆ సమయంలో (1970) ఒక తుపానులా వీచింది. ఉద్యమమై నడిచింది. దీన్ని ఎవరూ మరిచిపోలేరు. ఈ ఉద్యమం అడుగులు ఎంతో బలమైనవి. అందుకే నేను ఆకాంక్షించినట్లే లక్ష్యాన్ని సాధించి తన సత్తా ఏమిటో కవిసేన నిరూపించుకోగలిగింది. ఇంతకంటే ఇంకేం కావాలి? 'కవిసేన మేనిఫెస్టో' ప్రపంచ సాహిత్య ఉద్యమాల కరదీపికగా ఇప్పటికీ నిలిచేవుంది.

**మీరు రచనలు చేయడానికి స్ఫూర్తి ఏమిటి?**

జీవితానికి అనుభవాలే ఆధారాలు. నేను ఎన్నో కష్టనష్టాలు అనుభవించాను. చిన్నప్పటినుంచీ సంఘర్షణ పడుతూనే వున్నాను. అలా నాలోనేనూ దు:ఖించి ఆవేదనను బైటకు అక్షరాలకు ఊపిరిపోస్తూ వచ్చాను. జీవితాన్ని మోస్తూ నేను పడిన బాధల గాయాలే గేయాలుగా మారుతూ వచ్చాయి. ఇదంతా నాకు ఒక కొత్త ప్రపంచాన్ని పరిచయం చేస్తూ వచ్చింది. ఏదీ మరిచిపోలేదు.



ఒక యోగస్థితిలో కెళ్ళి పుంఖానుపుంఖాలుగా కాగితాల్లోకి నా భావాన్ని ఒంపుకుంటూ పోయిన సందర్భాలు అనేకం వున్నాయి.

అనుభూతి తీవ్రమై ఆవేశంగా వాక్యాలకు వాక్యాలు రాత్రంతా మేలుకొని నిద్రలోనూ పక్కనే తెల్లకాగితాల్ని పెట్టుకొని ఒక యజ్ఞంలా కవిత్వాన్ని లిఖించుకుంటూ పోయిన రోజులూ వున్నాయి.

సాహిత్య అధ్యయనం కూడా అదే స్థాయిలోనే సాగింది. చదవడం కోసమే చాలా సమయం కేటాయించేవాడ్ని. ప్రపంచ దేశాల సాహిత్యాన్ని అంతా సేకరించుకొని పరిశోధన చేయడానికే శ్రమించాను. జీవితంలో ఎన్నో దశల్ని చూశాను.

అవమానాలు పడ్డాను. అపజయాలను చూశాను. పిడికెడు మెతుకుల కోసం రోజంతా పేదలు ఎన్ని కష్టాలు పడి తమ రక్తాన్ని చిందించి బతుకును నెట్టుకొస్తారో నేను వీక్షించాను. అలాంటి దృశ్యాలెన్నో పాతుకపోయాయి. ఆ పునాదులనుంచే సాహిత్యం అంకురిస్తూ వచ్చింది. ఇదంతా నా రచనల వెనుక ప్రభావం చూపిస్తూ వచ్చింది.

**తెలుగులో ఇతిహాస కావ్యాలుగా వచ్చిన మీ ఆధునిక మహాభారతం, జనవంశమ్ కావ్యాలు ఏం చెప్పదలుచుకున్నాయి?**

"లేస్తోంది ఉష:కాంతుల్లో నుంచి ఒక హస్తం. ఆ హస్తం నిరంతర శ్రామికుడి సమస్తం" - అంటూ సాగే కావ్యరూపమే 'నా దేశం నా ప్రజలు అనే ఆధునిక మహాభారతం. నేను అనేక కావ్యాలు రాయలేదు. రాసింది ఒకే కావ్యం దాని పేరు 'నా దేశం నా ప్రజలు' దాని వర్తమాన రూపాంతరమే ఆధునిక మహాభారతం. ఈ కావ్యం యొక్క భావాలు అప్పుడప్పుడూ రాస్తూ వచ్చాను.

ఈ ఆధునిక మహాభారతానికి 'జనవంశమ్' అనుబంధ కావ్యం. దీనితో నా కావ్యయాత్ర ముగిసింది. ఈ కావ్యం తయారుచేసే అవకాశం నాకు లభించడం నా జీవితాన్ని నా ప్రజలకు సమర్పించే అవకాశంగా అదృష్టంగా భావిస్తాను.

వర్గచైతన్యం జ్వలింపచేయడమే ఈ కావ్య హృదయము. వ్యాస మహాభారతం రాజుల భూమి కోసం జరిగిన యుద్ధమైతే ఇది కూడా సామాన్య ప్రజానీకం భూమిని పొందడం కోసం చేసే యుద్ధాన్నే చెబుతుంది. దీన్ని చదవడం వల్ల మనిషి మనిషిగా మారతాడు. భూగోళానికి ఇరుసు అవుతాడు.

**వాల్మీకి... గురించి మీ రచనలు వచ్చాయి. వారిని స్ఫూర్తిగా తీసుకున్నారా?**

వాల్మీకి లోకప్రియ సాహిత్య సృష్టి కోసం మార్గాన్వేషణ చేసిన ఆ కాలపు ఆదిమ

పురుషుడు. సామాన్య ప్రజానీకానికి జ్ఞానబోధ అందించిన మహానుభావుడు. వాల్మీకిని చదవడం నాకెంతో ఇష్టం. ఏదైనా మంచి సాహిత్యం పఠించాలనుకున్నప్పుడు వాల్మీకి రామాయణాన్ని అందుకుంటాను.

**'ఈ నగరం జాబిల్లి' కావ్యం గజల్ ప్రక్రియపై రాయడానికి కారణం?**

ఒక శోకంనుంచి, ఒక మొహమాటం నుంచి, ఒక భయం నుంచి పుట్టిందే ఈ గీతికావ్యం. రాజ్‌కుమారి ఇందిరాధన్‌రాజ్‌గారి ప్రోత్సాహంతో తయారైంది. 1984లో పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు నాచేత గజల్ వ్యాసాలు రాయించారు. అందుకే ఈ పుస్తకాన్ని వారికే అంకితమిచ్చాను.

గజల్ వాస్తవంగా పాడే పాట. పుస్తకాల్లో చదువుకునే తెలుగు వచన కవితలాంటిది కాదు. గజల్ పాడడానికే రాయబడుతుంది. గజల్ ఆయస్కాంత విద్య. వెచ్చని చలిమంటలాంటిది. గజల్ చేతిలోకి వచ్చివాలిన ఒక రంగుల పక్షి. రెండు రెక్కలు ఒక గొంతు. ఇంతే దాని సంపద అంతా కలిసి. ఎవరైనా పక్షిని చేత్తో ముట్టుకుంటే తెలుస్తుంది. దాని పిడికెడు శరీరం. ఇలా గజల్ తయారవుతుంది.

"గోలుకొండ నిషానయిన కోహినూరు కన్నచోట
ప్రేమకు ఝుండా మాదిరి చార్మినార్ ఉన్నచోట
యీ నగరం జబిల్లి దక్కేను ప్రేమాగల్లీ"

అలాగే గజల్ లక్షణాలను కూడా ఈ కావ్యం వివరిస్తుంది. తెలుగులో ఇలాంటి రచన అరుదైనదే. అప్పట్లో పలువురు దీనిని ప్రశంసించారు.

**సాహిత్యానికి అవార్డులు అవరోధంగా మారుతున్నాయా? అభినందనలుగా వుంటున్నాయా? అవార్డులపై మీ అభిప్రాయం ఏమిటి?**

అవార్డుల మీద మొదటినుంచీ నాకు నమ్మకం లేదు. అవి వస్తే రావచ్చు. రాకుండానూ పోవచ్చు. అంతమాత్రాన వాటి కోసమే మనం రచనలు చేస్తున్నట్లు కాదు. మన రచనల్ని ప్రజలు గుర్తిస్తే చాలు. అంతకంటే గొప్ప పురస్కారాలేముంటాయి?

రాజకీయాలు చేసి అవార్డులు సంపాదించడం నాకిష్టం లేదు. రాజకీయ నాయకుల వెనుక తిరిగి తాయిలాలుగా సంపాదించే అలాంటివి నాకు వద్దు. అవార్డులు అభినందనల స్థాయిదాటి అవరోధాలుగా మారిపోతున్నాయి. సాహిత్యానికి అవార్డులెందుకో కూడా నాకు అర్థంకాదు. ఇలాంటి వాటిని రద్దు చేయాలని కోరుతూ నేను గతంలోనే కేంద్ర ప్రభుత్వానికి సూచనకూడా చేశాను.

అధికారం కోసమో ప్రభుత్వాల కోసమో, అవార్డుల కోసమో రచనలు చేయాల్సిన అవసరం



లేదు. ఆత్మసంతృప్తి ముఖ్యం. దాన్ని మనం పొందగలిగి, ప్రజల మన్ననలు పొందగలిగితే రచన పరమార్థం నెరవేరినట్లే. నేను అవార్డులను కొన్ని సార్లు కాదనలేక తీసుకున్నా చాలా సార్లు తిరస్కరించాను.

సాహిత్యాన్ని పదవులపైకి ఎక్కడానికి నిచ్చెనగా వాడుకోవడం కంటే అలాంటి సాహిత్యాన్ని సృష్టించకుండా వుండడమే ఉత్తమం.

**'నేను కలమెత్తితే నాకు ఒక దేశపు జెండా కున్నంత పొగరుందని' మీరు అనడం పలు వివాదాలకు కారణమైంది. దీనిపై మీ స్పందన ఏమిటి?**

కవి తనలో తాను ఎంతో సంఘర్షణపడితే తప్ప ఉట్టిగానే సాహిత్యం పుట్టదు. అంతఃప్రేరణ కల్గాలి. అప్పుడే హృదయం స్పందిస్తుంది. ఆ స్పందన నుంచే కవిత్వం జీవం పోసుకుంటుంది. మంచుకొండలా వున్నా అలాంటి సాహిత్యమే కాలంతో పోటీపడి నిలుస్తుంది. సవాళ్ళనుంచి, సంక్షోభాలనుంచి, సమస్యలనుంచి సందేహాలనుంచి సమాధానంగా పుట్టేదే నిజమైన సాహిత్యం. కవిత్వమంటే బలమైన ఆయుధమని నేను ముందే చెప్పాను.

నేను కలం పట్టినప్పుడు నాకు దేశం జెండాకున్నంత పొగరుందని అనడం నా భావావేశం. దాన్ని కూడా విమర్శించే వారికి నేనేం చెప్పగలను? వాళ్ళు అంతే. అలా విమర్శిస్తూనే వుంటారు. చివరికి వాళ్ళకి విమర్శలే మిగుల్తాయి. కవిత్వం రాస్తున్నప్పుడు ఒక ప్రత్యేక స్థితిలోకి వెళ్ళి ఆవేశంతో రాస్తాం. అందుకే ఆ పదాలు ప్రాణం పోసుకుని పటిష్టంగా నిలిచిపోతాయి. అంతమాత్రాన అందులో ఆవేశమే తప్ప ఆలోచన వుండదంటే ఒప్పుకోను.

నా కవిత్వాన్ని జనం సరిగ్గానే అర్థం చేసుకున్నారు. ఆ ఆత్మసంతృప్తి చాలు. అంతకంటే నేనేం కోరుకోవడం లేదు. ఆ వాక్యాలు ఎందరికో స్ఫూర్తినిచ్చాయని నాకెన్నో ఉత్తరాలు రాశారు. ఎన్నో సభల్లో, సాహిత్య సమావేశాల్లో ప్రజలే ప్రత్యక్షంగా నన్ను ప్రశంసించారు. అభినందనలు అందజేశారు. ఇక విమర్శలతో అవసరం లేదు.

**రాజకీయాలపై మీ అభిప్రాయం?**

ఏదో ఒక సిద్ధాంతాన్ని కార్యరూపం చేయడానికి చేసే ప్రయత్నమే నా దృష్టిలో రాజకీయం. ఇప్పుడు రాజకీయాలు బురదలా తయారయ్యాయి. సిద్ధాంతం కూడా లేకుండానే పార్టీలు మనుగడ సాగిస్తున్నాయి. ఏదోవిధంగా ప్రజల్ని మోసం చేసి, అధికారం అందుకోవాలనే ఆశమీద ధ్యాసే తప్ప సరైన పరిపాలన మీద, సామాన్య ప్రజల కష్టాలమీద రాజకీయ పార్టీలకు ఎలాంటి అభిప్రాయాలూ వుండడం లేదు. ఎంతసేపూ అధికారం మీదనే గురి. కవి సమాజంలో పెరిగిపోతున్న రాజకీయ అనైతికతను, అవినీతిని వ్యతిరేకించాలి. సమస్త మానవ

జాతి జీవితంపట్ల కవికి బాధ్యత వుండాలి. ఇది రాజకీయ పరమైన బాధ్యత కంటే గొప్పది.

"కవితా చైతన్యం ఒక విరాట్స్వరూపమైతే రాజకీయ చైతన్యం ఒక వెంట్రుకముక్క" అని నా మేనిఫెస్టోలో నేను రాశాను.

మన కళ్ళు సూర్యోదయం కోసం తహతహలాడుతూ ఎదురుచూసే తరుణంలో తెల్లవారుజామునే రెండు ముఖాలు కనిపిస్తాయి. అందులో ఒకడు బుడబుక్కలవాడు, మరొకడు పాములవాడు. వీళ్ళకోసం కాదు మనం ఎదురుచూసేది. వీళ్ళ మీద పేడనీళ్ళు చల్లండి. మన ఎదురుచూపు సూర్యోదయం కోసం అని మర్చిపోకూడదు. ఇదే నేను రాజకీయాలకు ఇచ్చే నిర్వచనం. 'నా కవిత్వం ఏ జెండాను ఎగరెయ్యదు. కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు' అని గొరిల్లాలో రాశాను.

**జీవితానికి మీరిచ్చే నిర్వచనం?**

జీవితం ఒక యాత్ర. యాత్ర అనేక మజిలీల ప్రయాణం. మనిషి జీవితంలో సుఖాలకంటే దు:ఖాలే ఎక్కువ. కంటి కొసన ఒక అశ్రువు నిలిస్తేనే జీవితం నీతో హృదయం విప్పి మాట్లాడుతుంది. జీవితం బ్రహ్మాండమైన రథచక్రానికి కట్టి ఈడ్చుకుపోతుంటే మనమెంత నిస్సహాయులమో బోధపడుతుంది. జీవితం మనం అడక్కుండా వచ్చిన ఒక సంగరం. కవి తన జీవిత కాలంలో అనేక కావ్యాలు రాయడు. కవి ఒకే మనిషి. ప్రవహిస్తున్న ఒకే జీవితం జీవిస్తాడు.

అలాగే ఒకే కావ్యం రాస్తాడు. కవి కావ్యయాత్ర అనేక కృతుల సాముదాయక స్వరూపం. దీన్ని అప్పుడప్పుడూ క్రమక్రమంగా రాస్తూ వుంటాడు. అలా రాయబడే ఒక్కోకృతి వాస్తవంగా పూర్ణకృతి కోసం పుట్టే ఒక్కోపర్వం. కావ్యయాత్ర అంతిమ చరణంలో అన్ని పర్వాలూ కలిసి ఒక్క కావ్యం మాత్రమే అవుతుంది. ఇదే నేను ఆధునిక మహాభారతంలోనూ చెప్పాను.

గంగానది మొదట ఒక దేవత/తర్వాత ఒక పడవల రస్తా/ ఆ తర్వాత మన పొలాల్లోకి ప్రవహించే పంట కాలవ/చూశావా దేవతల రూపాలు కూడా/కాలం చేతుల్లో ఎలా మారిపోతాయో/ఇవాళ మనమంతా ఈ నదిలో/ మునిగిపోతే మునిగిపోవచ్చుగాక/కానీ మరిచిపోకు రేపు ఈ నదే/సముద్రంలో మునిగిపోయే రోజు రాకపోదు/జీవించడంలోనే జీవితమంతా/ఖర్చుచేసి అలసిపోయాడు/వర్తమానంలోంచి చరిత్రలోకి వలసపోయాడు. అంటూ రాశాను.

**సాహిత్యానికి సమాజాన్ని సంస్కరించే సత్తా నిజంగా వుందంటారా? సాహిత్యం సమాజాన్ని మార్చగలుగుతుందా?**



సాహిత్యం ప్రచండమైన శక్తిని తనలో నింపుకొంది. సమాజాన్ని మార్చే శక్తిని తనలో నింపుకొంది. సమాజాన్ని మార్చే శక్తి సాహిత్యానికి మాత్రమే వుంది. చేతివేళ్ళను పిడికిళ్ళుగా మార్చి చైతన్యాన్ని ఇచ్చే ఆవేశాన్ని సాహిత్యమే అందిస్తుంది. వ్యవస్థలో వచ్చే ఉద్యమాలకు ఊపిరి పోసేది సాహిత్యమే. సాహిత్యం నుంచే సమాజం జీవం నింపుకుంటుంది. సమాజం ఎప్పటికప్పుడు ఎలా నిర్మితమైతే బాగుంటుందో, ఎలా తీర్చిదిద్దబడితే ప్రజలంతా సుఖసంతోషాలతో వుండి సమసమాజం తయారవుతుందో సాహిత్యం విశ్లేషిస్తుంది.

ఆ మార్పుల్ని ముందే ఆశిస్తుంది. కోరుకుంటుంది. అనంతరం ఆ దశల్ని సమాజం అందుకోవడానికి, ఆ స్థాయిని చేరుకోవడానికి ప్రయత్నిస్తుంది. ఈ మార్పులకి కీలక కారణం సాహిత్యమే కదా! ఇలా సమాజ నిర్మాణంలో సాహిత్యం అత్యంత కీలక పాత్ర పోషిస్తూ వస్తుంది. ఇది చరిత్ర పరిణామక్రమాల్ని చూస్తే మరింత దృఢంగా విశదమౌతుంది.

**చలంపై మీ అభిప్రాయం?**

ఆయన నైతికంగా నిర్భయుడు. అందుకే ఆయన ఎలా అయితే సమాజాన్ని చూశాడో అదే ధైర్యంగా తన రచనల్లో అందించగలిగారు. ఎవరో చదివి ఏదో అనుకుంటారని తనలోనే తన భావాల్ని దాచేసుకోలేదు. చెప్పదలుచుకున్నదేదో సూటిగా చెప్పడమే చలం రచనా విధానం. చలం స్వతంత్ర భావాలుండే వ్యక్తి. కథా రచనలో ప్రవీణుడు.

**ఒక్క సినిమాపాటతోనే ఆగిపోయారు?... తర్వాత రాయలేదు ఎందుకని?**

'ముత్యాలముగ్గు' సినిమా మా 'గ్యాన్‌బ్యాగ్‌ప్యాలెస్'లోనే చేశారు. ఆ సందర్భంలో వాళ్ళు కోరడంతో 'నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది. కన్నుల్లో నీరు తుడిచి కమ్మటి కల ఇచ్చింది' అనే పాట ఇచ్చాను. అంతే ఆ తర్వాత ఆ ప్రయత్నాలేవీ చేయాలనిపించలేదు.

పరిశ్రమలో అసూయ పెరిగింది. దాంట్లో నేను జోక్యం చేసుకోవడం ఎందుకు అనిపించింది. నైతికంగా పతనమైన చోట పాట బతకలేదు. అలాంటి విలువలు లేనిచోట దాన్ని వుంచడం ఎందుకు? అందుకే వాటికి దూరమయ్యాను.

నేను చెప్పదల్చుకున్న విషయాన్ని కవిత్వంలో చెప్పడం నాకిష్టం. కవిత్వం స్వచ్ఛమైంది. దాని స్వరూపాన్ని, స్వభావాన్ని, స్వచ్ఛతను నాకిష్టం లేని రంగంలోకి తీసుకెళ్ళడం నాకే నచ్చలేదు. అలా సినిమా పాటల జోలికి పోలేదు.

**ఎమర్జెన్సీ రోజుల గురించి...?**

అవి చీకటి రోజులు. ఎంతో హింస జరిగింది. కవిగా స్పందించాను. కావ్యం తీసుకుని వచ్చి నా స్పందన తెలియజేశాను. 'గొరిల్లా' ఆ భయంకర కాలానికి పుట్టిందే. దాన్నిండా ఆ

మచ్చలు, గాయాలు కుప్పలు కుప్పలుగా ఆవిష్కారం అవుతాయి.

**కొత్తతరం కవులకు మీరిచ్చే సూచనలు, సలహాలు?**

కవిత్వం రాయండి సాదాసీదాగా కాదు. బలమైన వాదంగా రాయండి. సమాజంలో రెండు వర్గాలున్నాయి. ఒకరు పీడితులు, మరొకరు పీడకులు. ఈ సమాజం బాగుపడాలంటే పీడితులు లేకుండా నిర్మితమయ్యే సర్వసమాన మానవ సమాజాన్ని తయారు చేయాలి. దానికి సాహిత్యాన్ని ఆయుధంగా కవులందరూ స్వీకరించాలి. పీడకుల్ని పెకలించి పీకెయ్యాలి. అప్పుడే మనం కోరే వ్యవస్థ సాధింపబడుతుంది.

ఆర్థిక సమానత్వ సాధనకు ఏకైక మార్గం విప్లవం. అది కేవలం సాహిత్యం ద్వారానే సిద్ధిస్తుంది. ప్రజలంతా ఏకమై తిరుగుబాటు చేసే స్థాయిలో సాహిత్యం చైతన్యం తీసుకురావాలి. ఈ వ్యవస్థను సంస్కరించడానికి సాహితీకారులు ఉద్యమించాలి. పీడితుల పక్షంవైపు నుంచి ఈ ఇతివృత్తంతో కవిత్వం రాయాలి. రావాలి. అప్పుడే మనం కలలుకనే వ్యవస్థ మనకు అందివస్తుంది. కొత్తతరం కవులు కూడా ఈ దిశగానే కలాల్ని కదిలించాలని నేను కోరుకుంటాను. అదే నేను వారినుంచి కోరేది. వారికి సూచించేది.

కవి కీర్తి ఎప్పుడూ లాభం కాదు. మంచి పనులు చేయడం ఒక లాభం కోసం కాదు. ఎన్నో మంచి పనులు చేసిన జీసస్ ఏ లాభం పొందాడు? కవి కూడా ఒక క్రీస్తు అని భావించండి. దానికి సిద్ధంగా వుండండి. ఆ తర్వాతే కలం పట్టండి. కొత్తయుగం తీసుకొస్తాననుకుంటే పూలదండలతో ఆహ్వానాలు ఎదురవుతాయనుకోకండి. 'నీవు పెరిగి పెద్దవాడివైతే ఈ మిద్దెలు, మేడలు, అసెంబ్లీలు, అకాడమీలు నీ నడుం ఎత్తుకు కూడా రాలేవు' అని రాశాను. యువకవులంతా దీనిని గుర్తించుకోవాలి.

**చివరికి ఎటువంటి సాహిత్యం చిరస్థాయిగా నిలుస్తుంది?**

ప్రజలను చైతన్యవంతం చేసే సాహిత్యం ఏదైనా ప్రజల హృదయాలలో చిరస్థాయిగానే నిలిచి వుంటుంది. మనం ఏదైతే చెప్పాలనుకుంటామో దాన్ని మనకంటే గొప్పగా పూర్వులు ఎప్పుడో రాశారు. రాయడానికి మిగిలిందేదో వెతుక్కోవాలి. ఎందరో చచ్చారు. మరెందరో పుట్టారు. జీవం నిండిన సాహిత్యమే నిలబడుతుంది. జీవితానుభూతి మరింత పదునెక్కాలి. అప్పుడే జీవం నిండిన సాహిత్యం పుట్టుకొస్తుంది. అదే నిలుస్తుంది.

**చివరిగా....!**

శేషేంద్ర ఒక నినాదం. ఉద్యమం. విప్లవం. చైతన్యం. విప్లవ భావజాల దార్శనికుడు. 74ఏళ్ళ వయసులోనూ ఆయన అలసిపోని సాయుధుడుగా సాహిత్యస్వాప్నికుడుగానే



కనిపిస్తారు. అనర్గళంగా, ఆవేశంగా, వయసు భారం మోస్తూనే సుదీర్ఘ సమాచారం అందించే శేషేంద్ర తెలుగు సాహిత్యకీర్తిని అంతర్జాతీయ పీఠమెక్కించిన ఐతిహాసికులు. వారికి కృతజ్ఞతలు. అభినందనలు.

*నవంబరు 2002*

*స్వాతి మాసపత్రిక*

KATHANAM
VEMPALLI
GANGADHAR











కాలంతోపాటు చరిత్ర కరిగిపోతుంది. ప్రసిద్ధ కోటలు బీటలు వారుతున్నాయి. శాసనాలు రాతిబండలు అవుతున్నాయి. కట్టడాలు కుప్పకూలి పోతున్నాయి. నాటి శిల్పాలు నేడు శిథిలాలుగా మిగిలాయి. విగ్రహాల డేగ చూపునీడల్లో చరిత్ర విలవిల లాడుతుంది. నిధుల వేట పేరుతో బలవంతుల చేతుల్లో చరిత్ర భస్మం అవుతుంది. మనవాళ్ళే మన చరిత్రను కొల్లగొట్టి విదేశీయులకు అమ్మేస్తున్నారు. చరిత్రతో వ్యాపారం చేస్తున్నారు. నేటి చరిత్ర స్థితిపై వ్యాసాలు...

సంచలనానికి మరోపేరు అరుంధతిరాయ్. గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్ రచనద్వారా బుకర్ ప్రైజ్ విజేతగా నిల్చిన రాయ్ 2000 సంవత్సరం మార్చి15 తేదీన అనంతపురం జిల్లా విచ్చేసినప్పుడు ఆమె మాటల్లోనే ఆమె జీవితపోరాటం ఆవిష్కరించిన క్రమం...

రాష్ట్రవ్యాప్తంగా జరిగే పలు జాతర్లలోనూ, తిరునాళ్ళలోనూ భక్తి ముసుగులో జరిగే బూతు డ్యాన్సుల విన్యాసాలపై ప్రత్యేక వ్యాసం...

1990 గల్ఫ్‌యుద్ధం కారణంగా మన రాష్ట్రం నుంచి ఉపాధికోసం దుబాయ్ వెళ్ళిన వారు యుద్ధ జ్ఞాపకాలు మోసుకొచ్చారు. జీవిత సమరంలో క్షతగాత్రులైన వారి ఆవేదన...

యుగకవి, సాహిత్యస్వాప్నికుడు సాయుధుడు గుంటూరు శేషేంద్రశర్మతో ప్రస్తుత సాహిత్య పరిణామాలపై విశ్లేషణాత్మక ఇంటర్వ్యూ...

రాయలసీమ రాజకీయం ముఠాకక్షల హత్యల తోరణం. ఫ్యాక్షన్ పిడుగుకు ఎలా విలవిలలాడుతుందో బాంబుల రాజ్యంలో రక్తపు మరకల చరిత్రపై ప్రత్యేక కథనం...

USHASSU PRACHURANALU